


1969 సం॥ ఫిబ్రవరి యువ చాలా బాగుంది. ముఖ్యంగా గంటి వెంకటరమణ గారి "తీరినకోరిక" నిజం చెప్పాలంటే మూడుసార్లు చదివేనంటే నమ్మరు. ఇంత చక్కని కథను వ్రాసి, యువద్వారా పాఠకులకు అందచేసిన వెంకటరమణగారికి నా మరీమరీ అభివందనములు

కుమారి దూసి అలివేలు,
శ్రీకాకుళం.

ఫిబ్రవరి యువ, ముఖచిత్రం కన్నుల పండువగానుండి యువ కెంతో నిండుతనాన్ని చేకూర్చింది. మీనా సీరియల్ చదువుచున్నంత సేపు ఎంతో ఉత్సాహంగా ఉంటున్నది. తీరనికోరిక, ప్రాప్తం కథలు చాలా బావున్నాయి. మధ్యమధ్య ఉన్న కార్టూన్స్ కడుపుబ్బ నవ్విస్తున్నాయి.

మద్ది భద్రారెడ్డి
కందఘట్ల.

కథలన్నిటిలోను 'మట్టిగాజులు' కథ ఎంతోబాగుంది. రచయిత 'గుల్షన్‌నందా' గార్కి; ప్రచురించిన మీకూ, నా అభినందనలు.

పి. సత్యనారాయణ ఆచారి, బొబ్బిలి

# అమృతాంజనము

## ఒళ్ళు నొప్పులను

## చప్పున తగ్గించే చల్లని మందు





- అమృతాంజనము ఏ విధంగానూ హాని చేయదు నొప్పి వున్నచోట కొద్దిగా రాస్తే చాలు
- అమృతాంజనము నొప్పిని త్వరగా తగ్గిస్తుంది ఇందులో అత్యంత శక్తివంతమైన పది ఔషధాలున్నాయి
- అమృతాంజనము రాసుకుంటే చల్లగా హాయిగా వుంటుంది ఇందులో కర్పూరం, మెంథాల్ మొదలైనవి చేరివున్నాయి
- అమృతాంజనము ఖర్చు ఆదా చేస్తుంది ఒక్క సీసా ఎంతోకాలం ఆటవస్తుంది

75 ఏళ్లగా ఇంటింటిదీపమై వెలుగుతోంది

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు బొంబాయి కలకత్తా
న్యూఢిల్లీ హైదరాబాదు




AMR - 14 Tel

ఫిబ్రవరి 'యువ'లోని కథ '[illegible]ప్తం' చాల బాగుంది. హేమ ఎంటేవాళ్ళు [illegible] దెనా ఉంటారు [illegible] వాళ్ళు అరుదు. [illegible] చాల ఉదాత్తంగాను ఎప్పటికీ మరువలేనిగాను [illegible] సి. ఆనందారామం గారికి మా అభినందనలు.

సి. బుచ్చిబాబు ద్రాక్షారామ

జనవరి యువ సంచికలో 'గైడు', 'మనిషీ-నీడ', 'దత్తపుత్రుడు', 'కోరల్ బీచ్‌లో కొన్ని క్షణాలు', 'మాయ' మొ॥ కథలు చాల బాగున్నవి. సమాజంలో జరిగే నిజ సంఘటనలను మరోసారి 'గైడు', 'మనిషీ-నీడ' కథలు గుర్తుకు తెస్తున్నవి. రచయిత (త్రు) లకు నా అభినందనములు.

పి. హెచ్. బాబురావు, వరంగల్-2.

దాదాపు ఎనిమిదేండ్లుగా 'యువ' చందాదారుగా వుంటున్న మాకు, రోజు రోజుకు ఎంతో అందంగా తయారయి వస్తున్న సంచికలు, పరరాష్ట్రాలలో వున్నామన్న తలపునే విస్మరింపచేస్తున్నాయి. అన్నిట్లోకి ముఖ్యమైనది 'సినీ వార్తల' వెల్లువలో కొట్టుకుపోకుండా నిలదొక్కుకుంటున్న 'యువ' ప్రతిభ.

యద్దనపూడి సులోచనారాణి 'మీనా' సీరియల్ క్రొత్తపంథాలలో నడుస్తూ ఎప్పుడూ ఎదురుచూచేట్లు చేస్తున్నది. చక్కటి నవల ప్రచురిస్తున్న మీకు, వ్రాసిన వారికి మా అభినందనలు పంపుతున్నాము.

జయా సుబ్రహ్మణ్యం, బెటూల్.

దేశమంటే మట్టికాదోయ్! మనుషులోయ్!
వట్టిమాటలు కట్టిపెట్టి గట్టిమేలు తలపెట్టవోయ్!
అన్న గురజాడ మహాకవి మాటలు మరచిపోలేము.

ఆర్థికంగా, హార్ధికంగా సహాయపడడానికి తగు స్తోమతవున్నా ఆశలు నిరాశలుచేసే వడ్డీలు ధరవరలు లేకుండా అందరికి వీలయినంత త్వరలో మోటారు శకటం అందజేయడం మా ఉద్దేశ్యం!

వాయిదావివరాలు, అడ్వాన్సు డెలివరికి కట్టవలసిన సొమ్ముకూడా ఇస్తున్నాము.

| బండిపేరు | నెలసరివాయిదా | అడ్వాన్సు డెలివరి మొదట కట్ట వలసిన సొమ్ము | నిమిత్తము పట్టుకాలం (రోజులలో) |
|---|---|---|---|
| సువేగా & విక్కి | రు. 55 | రు 1100/- | 30 |
| రాజదూత్ | రు. 90 | రు. 1800/- | 30 |
| జావా | రు. 100 | రు. 2000/- | 45 |
| బులెట్ | రు. 150 | రు. 3000/- | 45 |
| లాంబ్రెట్టా | రు 110 | రు. 2200/- | 30 |
| వెస్పా | రు. 125 | రు. 2500/- | 45 |
| హెరాల్డు | రు. 450 | రు 6000/- | 60 |
| అంబాసిడరు | రు 525 | రు 7500/- | 60 |

ఇంకా ట్రాక్టర్లు, జీపులుకూడా ఉన్నాయి వివరాలకు రూపాయిపంపండి.

**ది మ్యూజెస్** (రిజిస్టర్డు) పోస్టుబాక్సు నెం 16, తాడేపల్లిగూడెం (ఆం ప్ర.)

విజయనగరం - 1 శ్రీ ప్రభాకర ట్రేడింగు కో, చిన్నవీధి ఫోను 188, 430
విశాఖపట్నం - 4 శ్రీ ఎమ్. సుబ్బారావు, యూనివర్సల్ ఆటో మొబైల్సు, లీలామహల్ జంక్షన్, ఫోన్సు 4406, 4439
అనకాపల్లి ఓరియంటల్ స్టీల్సు, గుండాలవీధి ఫోను 382 పి. పి
అనకాపల్లి శాయి స్టీలు కాబినెట్ వర్క్సు, జి. యన్. టి. రోడ్డు.
కాకినాడ - 4 శ్రీ వి. వి. సత్యనారాయణమూర్తి, ఛీఫ్ ఏజంటు, ఛల్లా బ్రదర్సు. అచ్యుతపురం ఫోను 422 పి పి
రామచంద్రపురం శ్రీ లక్ష్మి ఏజన్సీస్, మెయిన్‌రోడ్డు, ఫోను 63
అంబాజీపేట శ్రీ కూచి గోపాలకృష్ణారావు, ఫోను 33
రాజమండ్రి - 1 శ్రీ రఘు ఎలక్ట్రానిక్సు, ఫోర్టుగేటు, ఫోను 711
రాజమండ్రి - 1 శ్రీ రామకృష్ణా రేడియో & టెలివిజన్ కార్పొరేషను ఫోర్టుగేటు, ఫోను 976
తాళ్ళపూడి శ్రీ బి భూషయ్య. ఆంధ్రా బ్యాంకు ఫోను 37 పి పి
జంగారెడ్డిగూడెం శ్రీ కొంకిమళ్ళ సూర్యప్రకాశరావు, మెయిన్‌రోడ్డు
భీమవరం శ్రీ జి. యల్. నరసింహారావు, ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా ఫోను 287 పి పి

| | |
|---|---|
| పాలకొల్లు | శ్రీ నాళం కోటిలింగం, వెంపరాలవారి వీధి |
| హనుమాన్ జంక్షను | శ్రీ జరుగు నాగేశ్వరరావు, ఆర్. టి. సి. క్యాంటీను |
| కంచికచర్ల | శ్రీమతి యమ్. సుశీల W/o శ్రీ మద్దాలి కోటేశ్వర రావు, కోపరేటివు సూపర్వైజరు |
| విజయవాడ - 2 | శ్రీ ఫ్రిజర్ రిఫ్రిజిరేషను సర్వీసు, జె. డి. హాస్పటలు రోడ్డు గవర్నరుపేట, ఫోను 7891 |
| దేవరకోట (దివి తా॥) | శ్రీ డి. రామస్వామి, ప్రెసిడెంటు, పంచాయితీబోర్డు |
| గుంటూరు | శ్రీ యమ్. పి. వెంకటరెడ్డి, శ్రీనివాస మెన్యూర్ డిపో, ఫోను 1584 |
| రేపల్లె | శ్రీ శాంతి సాహితీ ప్రచురణలు |
| నరసారావుపేట | శ్రీ మద్దూరి విశ్వనాధము, కంట్రాక్టరు ఫోను 60 పి పి |
| వినుకొండ | శ్రీ డి. కృష్ణంరాజు, కంట్రాక్టరు PWD C/o శ్రీ యం సుబ్బారెడ్డి |
| హిల్ కాలనీ (విజయపురి) | శ్రీ డి. గోపాలరావు, జూనియరుఇంజనీరు, పైలనుకాలనీ |
| ప్రొద్దుటూరు | శ్రీ వూకా కృష్ణమూర్తి, కమీషను ఏజంటు |
| నబీకోట (కడపజిల్లా) | శివశ్రీస్ ఏజన్సీస్ |
| నంద్యాల | శ్రీ గోపాలపాండే, నేషనల్ టాకీసు ఫోను 16 |
| ఆళ్ళగడ్డ | శ్రీ వి. వి. రామారావు P W D మేస్త్రీ |
| తాడిపత్రి | శ్రీ కామిశెట్టి నాగయ్య శ్రేష్టి ఫోను 64 |
| కర్నూలు | శ్రీ బాలాజీ ఏజన్సీస్, ప్రాఫ్ బజారు ఫోను 456 |
| నిజామాబాదు | శ్రీ విజయ ఫొటో స్టోర్సు, సర్దార్ పటేల్ రోడ్డు |
| గుడిగండ్ల (మహబూబ్‌నగర్ జిల్లా) | శ్రీ యాలాల రామలింగం, గుడిగండ్ల |
| కరీమ్‌నగరు | శ్రీ విజయ ఇంజనీరింగు సర్వీసెస్, గాంధి రోడ్డు |
| బోధన్ | శ్రీ కె. వెంకట్రావు C/o ది బోధన్ కోపరేటివ్ మార్కెటింగు సొసైటీ లిమిటెడ్ |
| ఖమ్మం | శ్రీ యన్. సత్యనారాయణ, అడ్వకేటు గంటాలమ్మవీధి |
| హైద్రాబాద్ - 12 | శ్రీ సురేంద్ర చంద్ర షా, యునైటెడ్ ఏజన్సీస్ గౌలిగుడా చమన్, ఫోన్ 42604 |
| కళ్యాణఖని (ఆదిలాబాదు జిల్లా) | శ్రీ కె. విక్టరు, ఓవర్ మాన్ |
| ఎమ్మిగనూరు | శ్రీ యు. యం. నర్సయ్య, మర్చంట్, ఫోను 56 |
| మదనపల్లి | శ్రీ జి. భాస్కరరెడ్డి, 12/261, గాంధి రోడ్డు |

ఇంకా మైసూరు, తమిళనాడు, కేరళ రాష్ట్రములలో కలరు.

యువ

సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 19 | మార్చి, 1969 | సంచిక 3

అతి విస్తారమైన ఖనిజసంపదగల రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. ప్రతి రాష్ట్రంలోనూ ఏదో ఒక ప్రాంతంలో ఏదో ఒక ఖనిజం దొరుకుతుంది. కాని, సులభంగా, తక్కువ వ్యయంతో త్రవ్వి తియ్యడానికి వీలయినదీ, కొద్దిగా కాక చాలా ఎక్కువగా దొరికేదీ ఏ ఖనిజం ఎక్కడ వున్నదో కనిపెట్టి దానిని త్రవ్వితీస్తే, అది ప్రజలకు లాభదాయకం అవుతుంది. అలాంటి ఖనిజ సంపద ఎక్కడ, ఎంత వున్నదో కనిపెట్టవలసిన బాధ్యత, జియొలాజికల్ సర్వేశాఖ వారిది.

ఈ జియొలాజికల్ సర్వేశాఖవారు గత అయిదారేళ్ళలో ఆంధ్రదేశంలోని ఖనిజ సంపదను గురించి కొంత పరిశోధన చేశారు. ఇప్పటివరకు వారు చేసిన పరిశోధనలను బట్టి, రాయలసీమలో వజ్రాల గనులు వున్నట్టూ, కృష్ణా జిల్లాలోని అవనిగడ్డ ప్రాంతంలోనూ, కృష్ణా గోదావరి నదుల మధ్య ప్రాంతంలోనూ పెట్రోలుగనులు వున్నట్టూ తేలింది. ఈ పెట్రోలు గనులలో విస్తారంగా పెట్రోలు లభిస్తుందని కూడా అంచనా.

అయితే, యీ ప్రాంతాలలో ఎక్కడ బావులు త్రవ్వితే పెట్రోలు పైకి వస్తుందో తేల్చాలి. అలా చెయ్యడానికి, డ్రిల్లింగ్ చెయ్యవలసి వుంది. కాని, యీ పని మాత్రం జరగడం లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో దొరికే పెట్రోలుకన్న చాలా తక్కువగా వుంటుం దనుకున్న కావేరి తీర ప్రాంతాలలో యీ డ్రిల్లింగ్ చెయ్యవలసిందని మదరాసు ప్రభుత్వం కోరుతున్నది. కాని, అటు కావేరిప్రాంతంలోగాని, ఇటు కృష్ణా, గోదావరి ప్రాంతంలోగాని యీ డ్రిల్లింగ్ చెయ్యకుండా, ప్రభుత్వం ఎందువల్లనో ఉదాసీనత చూపుతున్నది.

అంతేకాదు; జియొలాజికల్ సర్వేవారి అంచనాలప్రకారం ఆంధ్ర ప్రదేశ్‌లో కంటె తక్కువ పెట్రోలు దొరుకుతుందన్న బీహారు ప్రాంతా లలో డ్రిల్లింగ్ చెయ్యడానికి ప్రయత్నాలు ప్రారంభమైనవి. దీనివల్ల దేశంలో దొరికే ఖనిజసంపదను పుష్కలంగా వినియోగించడానికి సక్రమమైన ప్రయత్నాలు జరగడంలేదని అనుకోవాలి.

ఆంధ్రప్రదేశ్‌లోని పెట్రోలుగనులను కనుక్కొని, ఆ పెట్రోలును పైకితియ్యడం ఎంతశీఘ్రంగా జరిగితే అంతమంచిది. దీనివల్ల బాగుపడేది ఒక్క ఆంధ్రప్రదేశ్ మాత్రమేకాదు. భారతదేశం అంతా సౌభాగ్యవంత మౌతుంది.

కాని, కేంద్ర ప్రభుత్వం ప్రాంతీయ దృక్పథంతో కాక, దేశంలో సమగ్రమైన అభివృద్ధి, దేశంలోని అన్ని ప్రాంతాలలోని ఖనిజసంపదను వినియోగించడం దృష్టిలో పెట్టుకొని, ఆ విధంగా కృషి సాగించాలి. కేంద్ర ప్రభుత్వం సరిగా యీ కృషిని సాగించనప్పుడు, రాష్ట్ర ప్రభు త్వం కేంద్రాన్ని హెచ్చరించవలసిన అవసరం ఎంతేనా వుంది.



*నగర సమీక్ష :*

# "గణితభారతి" గ్రంథావిష్కరణ

ఆనాడు మహానగరంలో "గణితభారతి" గ్రంథావిష్కరణ, అంకిత మహోత్సవమూనూ. ఆహూతులతో అనాహూతులతో హాలు కిట కిటలాడుతున్నది.

"ఇప్పుడు ఫలానా సత్యనారాయణగారు సభకు అధ్యక్షత వహించి కార్యక్రమం జరిపించాలని మా ప్రార్థన" అన్నారు ఒక కార్యకర్త మైకులో. వెంటనే ఒక పదేళ్ళ కుర్రవాడు వేదికమీదకు వొచ్చి కుర్చీని "అలంకరించాడు". "గ్రంథకర్త భట్టాచార్యను, కృతిభర్త త్రిగుణ శర్మనూ, ఉపన్యాసకులు భట్టుమూర్తి అనంత విశ్వంగార్లనూ ఇక్కడ వేదికమీదకు రావాలని కోరుతున్నాను" అన్నారు పదేళ్ళ అధ్యక్షుల వారు. అధ్యక్షులు తమ తొలిపలుకులలో ఇలాఅన్నారు. "గణితభారతి మాకు ఎంతో ఉపయోగపడుతుంది. అది లేకపోతే మేము గణిత శాస్త్రాధ్యయనంలో ఎంతో ఇబ్బందిపడాలి" అని. తర్వాత గ్రంథకర్త కృతిభర్తకు తమ పుస్తకాన్ని అంకితం ఇవ్వవలసినదిగా వారు కోరారు. సన్నాయి మోగింది. "సీతమ్మ పెళ్ళికూతురాయెనే" అనే ట్యూన్ వాయించారు సన్నాయివారు. పుస్తక కన్యను ఒకగంపలో పెట్టి వేదిక వద్దకు తీసుకువచ్చారు (ఆమె మేనమామ!) $(a+b)^2=a^2+b^2+2ab$, $(a-b)^2=a^2+b^2-2ab$ అని మంత్రాలు చదువుతున్నారు పురోహితులు. గణితోక్తంగా వివాహం జరిగింది. కృతిభర్తా కర్తా ఉచితరీతిని ప్రసంగించారు. భట్టుమూర్తిగారు ఒకగంట మహోపన్యాసం చేసారు.

---




ఆధునిక కవితలో గణితంగూర్చి ఉద్రేకంగా (?) ఆయన మాట్లాడారు. భట్టుమూర్తిగారు ఏ విషయంపైన ఐనా అనర్గళంగా మాట్లాడుతారు. రేపు ఫంక్షను ఉందని ఇవాళ తెలిస్తే / చెప్తే చాలు వారికి వెంటనే ఆయన మొత్తం పుస్తకాన్ని మథించి ఉపన్యాసానికి తయారుగావుంటారు. అనంతవిశ్వంగారు గణితానికీ నవలా సాహిత్యానికీ కథలకూ ఉన్న సంబంధం సోపపత్తికంగా తెలియచేశారు.

సభ ముగిసింది. "అయ్యా గణితభారతి కాపీ ఒకటి నాకు ఇవ్వండి" అని అడిగాడు ఒక శ్రోత భట్టాచార్యను. ఆయన ఇచ్చాడు. శ్రోత శ్రద్ధాభక్తులతో తెరిచిచూస్తే అది ఎక్కాలపుస్తకం!

# గుండె ఆగిన క్షణం

సుందరనగరం స్టేషను అంత పెద్దదీకాదు, మరీ చిన్నదీకాదు. ఉదయం వచ్చే మెయిలు ఆగదు. మధ్యాహ్నం ఎక్స్‌ప్రెస్ ఆగుతుంది. సాయంకాలం జనతా వస్తుంది. తెల్లవారుఝామున ఏ మూడింటికో ప్యాసింజ రొస్తుంది. జనతాకీ తప్పితే ప్యాసింజరుకీ రద్దీ ఉంటుంది. సుందరనగరం తిరణాళ్ళప్పుడు రద్దీ చెప్పనక్కర్లేదు.

రాత్రి వొంటిగంట. అక్కడక్కడ రెండోమూడో దీపాలు మినుకుమినుకు మంటున్నై. ప్రయాణీకులు ఇద్దరో ముగ్గురో ఉంటే, పోలీసుబలగం మట్టుకు ఆ స్టేషను కనీవినీ ఎరగనంత జాస్తిగా ఉంది. ఎక్కడా చప్పుడులేదు. తుపాకీల్తో పోలీసులు అడుగుల్లో అడుగులువేస్తూ ఇటూ అటూ తిరుగుతున్నారు.

ఆ సాయంకాలం స్టేషను మాస్టరుకి ఫోనులో పిలుపొచ్చింది.

"అర్ధరాత్రి వస్తున్నాను. కలక్షను అంతా పెట్టెలో పెట్టి, జాగ్రత్తగా అందివ్వపోతివా, ప్రాణాలు దక్కవు. పోలీసు కాపలా తెప్పించుకోడానికి వ్యవధి లేదని విచారించకు, జాగ్రత్త..."

ఫోను 'కట్' అయిపోయింది.

స్టేషనుమాస్టరు చురుకైనవాడు. స్టేషనులో ఉన్న ఇద్దరు పోలీసుజవాన్లు చాలరు. వెంటనే ఊళ్లోన్నుంచి బలగాన్నంతా రప్పించాడు. ఆయన గుండె తీవ్రంగా కొట్టుకుంటున్నది. అప్పటికి నాలుగురోజులై కలక్షను బ్యాంకులో వేయటానికి కొన్ని ఆటంకాలొచ్చినై. దానికితోడు ఖర్చులూ, జీతాలనిమిత్తం పెద్దమొత్తం వచ్చిపడింది. తిరణాళ్ళవల్ల డబ్బెక్కువ వచ్చింది. పెట్టెలో దాదాపు రెండుమూడు లక్షలు అవలీలగా ఉంటై.

డబ్బున్న పెట్టెను స్టేషనుమాస్టరు తన గదిలోనే పెట్టుకుని, పక్కనే కూర్చున్నాడు. చుట్టూ డజనుమంది పోలీసులు తుపాకులతో కాపలాకాస్తున్నారు. అతని గుండె మెయిలుచప్పుడుకన్నా వేగంగా కొట్లాడుకుంటున్నది.

మూడోతరగతి ప్రయాణీకుల షెడ్డులో దాదాపెవరూ లేరు. ఒక మూలగా ఒక ముసలాయన కునికిపాట్లు పడుతున్నాడు. అతనికి దగ్గర్లోనే పూర్తిగా ముసుగు వేసుకొని ఒక వ్యక్తి గాఢనిద్రలో ఉన్నట్టుగా కనపడ్డది.

"శేఖర్"

ఒక పోలీసుజవాను అటుగా వచ్చాడు.

"ఏయ్! ఎవరు నువ్వు?"

ముసలాయన ఆవులించాడు.

"ప్యాసింజరుకోసం చూస్తున్నాం నాయనా? గంటన్నర లేటట. ఎప్పుడూ లేటే. మా ఊళ్లో అది తప్ప మరో బండి ఆగదు. పాడుగోల! కోడల్ని ఇంటికి తీసుకుపోతున్నా. ఏం చేసేది? ఈ ముసలికాలానికూడా చాకిరీ తప్పదు కదా! వాడేమో ఊళ్లో లేడాయె .."

"ముఖంమీద కప్పు తీయి!"

"ఏం టట్టా ఖసురుకుంటావ్?" అంటూ ముసలాయన పడుకున్న వ్యక్తిని తట్టాడు.

ఆమె ఉలిక్కిపడి, తలమీద కప్పు తొలగించింది. పోలీసు బ్యాటరీలైటువేశాడు. అంత నిద్రలోనూ కళకళలాడుతున్న అందమైన ముఖం.

పోలీసు ఒకసారి నవ్వుకొని వెళ్ళిపోయాడు.

తెల్లవారుతూండగా అయిదింటికి ప్యాసింజరొచ్చింది. ముసలాడూ, అతని "కోడలూ" రైలెక్కడం, వెళ్ళడం, పోలీసు గమనించి, అప్రయత్నంగానే పెద్ద నిట్టూర్పు విడిచాడు.

అతనేకాదు. స్టేషనులోఉన్న జవాన్లందరూ, స్టేషనుమాస్టరూ కూడా "హమ్మయ్య!" అనుకున్నారు.

ఎందుకంటే, రాత్రి ఫోనులో నోటీసిచ్చిన "దొంగ"కాస్తా పత్తాలేదు. డబ్బంతా సురక్షితంగానే ఉంది.

ఆరోజు సాయంకాలం స్టేషను మాస్టరుకి మళ్ళా ఫోనువచ్చింది అదే సమయానికి. అతగాడిగుండె పీచు పీచుమంది.

"క్షమించండి. మాకోడలి వొంటిమీద పాతిక వేల రూపాయల నగలున్నై, రాత్రంతా స్టేషనులోనే పడిఉండాలి. కోడల్ని ఇంటికి తీసుకెళ్ళాలి, కాపలా ఎట్లాగో తెలీక మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను. మీడబ్బు కాపాడుకోవడంతోబాటు, మాకోడలి నగలూ కాపాడారు. మమ్మల్ని పలకరించి, మాక్షేమం కనుక్కున్న పోలీసు జవాన్లకు ధన్యవాదాలు చెప్పండి —"

ఫోను మళ్ళీ "కట్" అయింది.

స్టేషనుమాస్టరు గుండె ఒక్క క్షణంపాటు నిజంగానే కొట్టుకోడం మానేసింది.






రాచకొండ
రంగనాధశర్మ

"నా జీవితం నరకమైపోయింది లల్లీ...... నరకమైపోయింది," రెండు చేతుల్తోనూ ముఖాన్ని కప్పుకుని బావురు మంది పద్మ.

అంతవరకు తనక్షోభను...బాధను... లల్లీకి చెప్పి ముగింపు మాటలుగా పద్మ అన్నమాటలు లల్లీని అయోమయావస్థలో పడవేశాయి.

పద్మ చెప్పినది లల్లీ నమ్మలేక పోయింది. "నేను నమ్మలేను పద్మా! నా కాయన వ్యక్తిగతంగా తెలుసుకూడా. ఆయనెంతో విశాల హృదయులు. సంస్కారవంతులు. ఆయన మాటల్లో, చేతల్లో, ఊహల్లో, కథల్లో, ఆయన వెలిబుచ్చే భావాలకు ఆశ్చర్యపోనివారు లేరు. ఆయనంటే అందరికీ... అందుకే అంత గౌరవం.

అనాదినుంచీ తుప్పుపట్టిన సిద్ధాంతాలు స్త్రీ జాతిమీద ఎంత శక్తివంతంగా పనిజేస్తూ స్త్రీ జీవితాన్ని హీనపరుస్తూ

న్నాయో ఆయన నోట వచ్చిన పలుకులు అమృతమయాయి. అలాటి వ్యక్తిని ఎంతోమంది ప్రేమించారు, ఆరాధించారు, స్నేహాన్ని కోరారు, గౌరవించారు.

ఎంతోమంది కాలేజీ అమ్మాయిలు ఆయన్ను పెళ్ళిచేసుకోవటానికి ముందుకు వచ్చారు. హృదయాన్ని విప్పి ఆయన ముందుంచారు. కాని ఆ అదృష్టం నీకు లభించింది. అందు కసూయపడ్డవాళ్ళే యెక్కువ, కాదనలేను.

అటువంటి ఓ మంచి మనిషిని నీవు అనవసరంగా అపార్థం..."

పొడిగా నవ్వింది పద్మ. "నీరు పవిత్రమైనదే. ఆ నీటి అడుగున అగాధాలున్నాయనిగాని, ఉంటాయనిగాని ఊహించటంకూడా కష్టమే – ఏ సుడిగుండమో...ప్రాణాలను బలిగొనే మరే అగాధమో అక్కడ ఉందంటే నమ్మలేరెవరూ. ....స్వానుభవంలోగాని అది అర్థం కాదు."

ఏది యేమైనా........

"నా మాటలు నమ్మటం లేదుకదూ నువ్వు! ఒక మనిషిమీద మొదటిసారిగా ఏర్పడ్డ యే భావాన్నీ చెరుపుకోవటం అంత సులువుకాదు. నిజమే! నీలో మంచిగా చిత్రీకరింపబడిన వ్యక్తి గురించి వ్యతిరేకంగా ఏం చెప్పినా నువ్వు భరించలేవు, సహించలేవు. నాగస్వరంముందు నాగుల్లాటి వాళ్ళం మనం. సర్వం మరచి తలాడిస్తూ ఉంటాం. ఆ క్షణంలో పాముకూడా ఎంతో అందంగా, హుందాగా కన్పిస్తుంది. తన నాగస్వరంతో, నాగుల్ని, చుట్టూ చేరిన జన సమూహాన్నీ తన్మయపరచేవాడు... తను ఆనందపడటానికి తీరిగ్గా ఇంటి దగ్గర కూర్చుని నాగస్వరం వాయించుకుంటూ కూచుంటాడని నే ననుకోను."

"పద్మా."

"ఔను. ఆయన మాటల్లోనూ, కథల్లోనూ, శాశ్వత ముద్రగా నిలచిపోయే సంస్కారం, సహృదయత; యింత క్షణికా లనుకోలేదు నిజ జీవితంలో."

"కాని...కాని....యిది నిజమే ఐతే క్షమించు. నేను ఋజువు చేసుకోవాలి."

"అంటే?"

"నీ మాట లెంతవరకూ నిజమో నేను తెల్సుకోవాలి."

"లల్లీ! అది నా జీవితం మీద ఎలా పనిచేస్తుందో కాస్త ఆలోచించు."

"పద్మా, అనుమానాల, అమానుషంలో పడి జీవచ్ఛవంలా తయారైన యిప్పటి నీ జీవితం, నీ మాటలు, ఒకవేళ నిజమేఐతే యింతకంటె హీనమైన పరిస్థితులు ఏర్పడవనే నా నమ్మకం."

"వద్దు లల్లీ. నా కేదో భయంగా ఉంది. ఇదంతా నేనే చేయించానని ఆయన ఒకవేళ పసిగడితే..."

"యింతవరకూ పీడకలగా ఉన్న నీ జీవితం చక్కని మలుపు తిరుగుతుంది."

"లల్లీ...ప్లీజ్. నా మాట విను. యిప్పటికే నా జీవితం చదరంగమై పోయింది."

"సరే: నీయిష్టం : వీలైనంతవరకు మీ జీవితాల్ని సరిదిద్దుకునే ప్రయత్నం మాత్రం చెయ్యండి. వస్తాను." లలిత బయటకు నడిచింది. దీర్ఘంగా నిట్టూర్చి యింటిపనిలో మునిగిపోయింది పద్మ.

* * *

డియర్ జగ్గూ,

చాలాకాలానికి మీకు ఉత్తరం వ్రాస్తున్నాను... మనం కాలేజీలో సుపరిచితులం - అప్పట్లో నేనెన్నో ఆశలు నిల్పుకున్నాను ... కానీ నాకా అదృష్టం లేకపోయింది. ఆ ఆశలు నిలబడలేదు. కూలిపోయాయి ... ఎవరో అదృష్టవంతురాలు మీదైంది - మీరు విశాల హృదయులు... సంస్కారవంతులు... మిమ్మల్ని పొందినభాగ్యం ఆ మెకు దక్కింది. నాకోరిక తీరకుండానే మిగిలిపోయింది.

ఒకసారి .ఒక మనిషిమీద యేభావం కూడా చెరిపేసుకోలేము. అదే సున్నితమైన ప్రేమభావమే అయితే మరీను...

మీరెవరివారైపోయినాసరే ...

నాకోరిక నెరవేర్చుకోవాలి ...

మీరు కాదంటారనుకోను;

వీలైతే ఎల్లుండి సాయంత్రం సరిగ్గా 6 గంటలకు నెహ్రూ పార్కులో కల్సుకోండి - ముఖతః మాట్లాడ వల్సింది చాలావుంది.

ఒక్కమనవి ...

నేను "టైము" విషయంలో మాత్రం చాలా ఖచ్చితంగా ఉంటాను. అన్న టైముకు మీరు రాలేకపోతే మాత్రం క్షమించండి - నేను అక్కడ మీకు కన్పించను.

రైట్ కార్నర్‌లో సిమ్మెంటు బెంచీ వుందిగా - ఆమూలనైతే మనం మాట్లాడుకోవటానికి బాగుంటుంది - ఏమంటారు, తప్పకవస్తారుకదూ: ఉంటాను...మీ...

క్రిందను సంతకంలేదు.

తారీఖు చూశాడు... పదమూడు ...

జగన్నాధం తీవ్రంగా ఆలోచించాడు. అతనిదృష్టిలోకి ఎవరూరాలేదు. అదేదో తేల్చుకోవాలనే నిర్ణయానికే వచ్చాడు.

అవేళ పదిహేనో తారీఖు...

పద్మ మరోసారి అప్పుడేవచ్చిన ఉత్తరం చదువుతుంది.

తన స్నేహితురాల్ని కలుసుకోవాలి. కాని ...అసంభవం....

తను ఇల్లుకదలటమే ...

అయినా ఆయన ఆఫీసుకెళ్ళిపోయారు.

ఉత్తరంలోఉన్న టైముకు తనెటూ వెళ్ళలేదు,

ఆలోచిస్తున్న పద్మకు భర్త కేక విన్పించింది.

ఆశ్చర్యంగా వీధితలుపు తీసింది.

"అదేం" అంది,

మధ్యాహ్నం శలవుపెట్టాను...

జగన్నాధం ఆరోజు ఎంతో హుషా

రుగా ఉన్నాడు - భర్తచర్యలకు ఆశ్చర్య పోతూంది పద్మ!

పద్మ జంకుతూనే అడిగింది - చాలా కాలానికి నా స్నేహితురాలొకామె వచ్చింది - ఆమెను కల్సుకోవాలి:

"అలాగే పద్మా వెళ్ళు" జగన్నాధం మరీ హుషారుగా అనటంతో పద్మ ఉక్కిరి బిక్కిరి అయింది - కలో, నిజమో అర్ధంకాలేదు...తనతోనే ఎక్కడికీ తీసుకువెళ్ళటాని కంగీకరించని భర్త... యీనాడు....

యేందుకో తనను తనే తిట్టుకుంది.

తనపై నిజానికి భర్తకు అనురాగం, అభిమానం లేకపోలేదు.

యిన్నాళ్ళూ అపార్ధం చేసుకుంది.

యేమో? యేమిటో?... యే నిర్ణయానికీ రాలేకపోయింది పద్మ!...

నిజమే! కాలేజీ రోజుల్లో యెంతో మంది అమ్మాయిలు...సుచరిత, వాణి, రాజేశ్వరి, లలిత, కృష్ణవేణి, యింకా చాలమంది తన ప్రేమకోసం తహతహలాడేవారు. తను కవి. ముఖ్యంగా కాలేజీ డిబేట్లలో నిర్భయంగా, గంభీరంగా దంచే ఉపన్యాసాలతో కాలేజీ లెక్చరర్లను సహితం ఆకర్షించేవాడు.

సంతకంలేని ప్రేమలేఖలు ఎన్నో వచ్చేవి.

తను మాట్లాడితేనే చాలని మురిసిపోయేవా ళ్ళెంతోమంది అమ్మాయిలు.

కాలేజీ జీవితం వదిలాక ఉద్యోగంలో ప్రవేశించాక కథకుడిగా తనకు పెద్ద పేరుంది-ఎన్నో పోటీలలో ప్రథమ బహుమతు లందుకున్నాడు.

భావిని చక్కదిద్దుతూ, కుసంస్కారాన్ని నాశనంచేస్తూ- పూర్వపు సత్సంప్రదాయాల్ని గుర్తుకు తెస్తూ, మన సంస్కృతిని, మన శాంతియుత జీవనాన్ని గుర్తుచేస్తూ-ప్రస్తుతం...మోజుల బూజుల్లోపడి, నాగరిక బురఖాతో అవినీతిని పెంచుకున్న సమాజాన్ని సునిశితంగా ఒకప్రక్క విమర్శిస్తూనే, చక్కని శైలిలో వ్రాసే తన కథలకు ఒకటి రెండుసార్లు ప్రభుత్వ అవార్డులుకూడా వచ్చాయి.

వాటితోపాటు తమను వివాహం చేసుకొని తమ జీవితాల్ని ధన్యం చెయ్యమన్నట్లుగా ప్రాధేయపడుతూ వచ్చే ప్రేమలేఖలకు అంతేలేదు.

తను అభ్యుదయ కవి.

సమాజ వికాసాన్ని కాంక్షించే రచయిత.

సంఘంలో సంచలనాన్ని రేకెత్తించడానికి పూనుకున్న కథకుడు.

కథానాయకుడు.

ఆదర్శాలను ఎలుగెత్తిచాటే వ్యక్తిత్వంగల వ్యక్తిగా అందరికీ పరిచయమైనవాడు.

యీ దృష్టిని పదిమందిలో యింకా బలపరుచుకోవాలి...

కాగితాలు ఖరాబు చేయడంలోనే కాదు తన ఆదర్శం...



మాటల్లో గొంతు చించుకోవటంకాదు తన ఆదర్శాల ఉద్దేశ్యం....

ఆచరణ కావాలి....

అదే...

పద్మను పెళ్ళి చేసుకోవటానికి ముఖ్య కారణం...

జీవితంలో మొగ్గగా ఉండగానే వాడిపోయిన జీవితం పద్మది. పద్మ తండ్రి వెంకటశేషయ్యకు పూర్వ సంప్రదాయాల మీద సంపూర్ణమైన విశ్వాసం...కట్టుబడి ఉండాలన్న నియమం కలవాడు. అందుకే పద్మ పుష్పవతి కాకుండానే పెళ్ళి చేశాడు. వైవాహిక జీవితంలో ఆమె ప్రవేశించేసరికి పన్నెండేళ్ళు.

సాంసారిక సుఖాలకు ఆమె నోచుకోలేదు ..నుదుట బొట్టు కరవయిన కారణాన....పద్మభర్త గోదావరిపుష్కరాల్లో గోదావరికి బలి అయిపోయాడు...చిన్నతనంలోనే పద్మ 'విధవ' అయింది.

వెంకటశేషయ్య సంప్రదాయాలకు బానిస.

ఎవరెన్ని చెప్పినా ...

పద్మగోడైనా వినకుండా... ఆమెకు తెల్లబట్టలు కట్టబెట్టాడు...తల తీయించాడు.

అది తనకే చూడ్డానికి కొంతబాధ కలిగినమాట వాస్తవం.

తనపనికి లోకులెవరూ హర్షించలేదు.

కూతురు పద్మకూడా క్షమించలేదు.

సంప్రదాయాల పేరుతో అన్నెం ... పున్నెం ఎరుగని అమాయకురాలి జీవితాన్ని నాశనంచేశావ్ అని పదిమందీ వెంకటశేషయ్యను దుమ్మెత్తి పోశారు.

అన్నిటికీ తట్టుకున్నాడు.

చివరికి కన్నకూతురే ఓనాడు యెదురు తిరిగింది.

"చూశావా నాన్నా! అమ్మపోయిన స్థానంలో నువ్వునిలబడి మూడేళ్ళ పిల్ల

నుంచి యింతదాన్ని చేసి, నా కోసమే నీసుఖాల్ని ... నీ జీవితాన్ని త్యాగంచేసి నా సౌభాగ్యాన్నే సదా కోరుకునే నీఆశలు నాకిచ్చినరూపాన్ని చూడునాన్నా ... చూసి ఆనందించు...నీకుసంప్రదాయాలు కావాలి. నా బ్రతుకక్కర్లేదు. జీవితంలో నేనేం చవిచూశానని నాన్నా యింత నిర్దయగా నా జీవితాన్ని నీ సాంప్రదాయ సంకెళ్ళలో బంధించావ్?

చాలా నాన్నా నీకూతురు సౌభాగ్యం ఆనందంగా ఉందా నీకూతుర్ని వేషంలో చూడటానికి?

ఎవరుమెచ్చారు నాన్నా నువ్వుచేసిన పనికి?

సంప్రదాయాల్ని దృష్టిలో పెట్టుకోవటంలో పూర్వుల మంచి ఉద్దేశాల్ని ఎవ్వరూ కాదనరు.

కాని అవి యిలా గొంతుల్ని కోసే వాటిగా మలచుకోవటం మూర్ఖం... అంతకంటె యింత విషమిచ్చి నన్ను చంపెయ్ నాన్నా ..."

కూతురు మాటలకు వెంకటశేషయ్య తట్టుకోలేక పోయాడు... అలాగని తన మార్గాన్ని విడిచిపెట్టలేక పోయాడు.

"అంతకంటెయింతవిషమిచ్చ ..."

కూతురే దారిచూపించినట్టు... ఆ విషాన్నే మింగి ఆర్ధరాత్రి తనువు చాలించాడు ఎవ్వరికీ చెప్పకుండా.

పద్మ ఏకాకి యింది ——

అటువంటిపద్మను ... నలుగురూహర్షించేలా జగన్నాధం వివాహంచేసుకుని ఆమె జీవితంలో "నందనం" సృష్టించాడు. ఆరిపోయిన దీపాన్ని వెలిగించాడు.

అయితే....

హర్షించిన వాళ్ళకంటె అధిక సంఖ్యలో విమర్శకులు లేకపోలేదు. కాని వాటినేమీ తనదృష్టిలో పడనీయకుండా జాగ్రత్తపడటానికి ప్రయత్నించాడు.

కాని...తను వల్లించిన

తన ఆదర్శాలే నిజ జీవితంలో ఎంత కఠోరమైనవో అర్ధమయ్యేసరికి తన ఆదర్శాలు సడలిపోయాయ్... ఆ స్థానములో యేదో పురుగులాటి అనుమానం చోటుచేసుకుంది. అణుచుకున్నా దాగని అగ్నిపర్వతంలా టిదది.

అది పద్మ జీవితంమీద నిరంకుశంగా పని చేసింది.

పద్మ జీవితంలో తిరిగి చీకటి మెల్ల మెల్లన ప్రవేశించి దట్టంగా అలుముకుంటూంది.

"కాఫీ తీసుకోండి," పద్మ పిలుపుతో జగన్నాధం ఉలిక్కిపడ్డాడు.

"ఏమి టాలోచిస్తున్నారు."

"ఏం లేదు" తన గొంతు తనకే విన్పించనంతలా గొణిగి కాఫీ అందుకున్నాడు.

అయిదు గంటలకు యింట్లోంచి బయల్దేరాడు జగన్నాధం...

చాలా కాలానికి వచ్చిన స్నేహితురాలు సరాసరి యింటికి రాకుండా

ఎక్కడెక్కడో ఎందుకు కలుసుకో మంటూందో అర్థం కాలేదు పద్మకు.

యేకాంతంలో కలుసుకున్నాం ఆయిన అనుమతి లభించటం ఎంతో సంతోషమయింది పద్మకు.

పని ముగించుకుని త్వర త్వరగా బయటకు కదలింది.

నెహ్రూ పార్కులో సిమ్మెంటు బెంచీమీద కూర్చుంది పద్మ.

శీతా కాలం.

ఆరుగంటలకే బాగా చీకటిపడింది... చెట్ల క్రీనీడలో బెంచీమీద కూర్చుందామె-స్ట్రీట్‌లైట్ చుట్టూ ముసురుతున్న పురుగుల్ని చూస్తూ.

హఠాత్తుగా ఉలిక్కి పడింది.

ఎవరో తన వైపే వస్తున్నారు.

తను వచ్చింది తన స్నేహితురాలి కోసం...

కాని వచ్చేది పురుషుడు...

యేదో తెలియని భయం ఆవరించి చటుక్కున లేచింది.

తొందరతొందరగా బయటకు వచ్చి రిక్షాలో కూర్చుని వీధిపేరు చెప్పింది. రిక్షా కదిలింది.

ఇరవై గజాలు వెళ్ళాక ఎందుకో వెనుదిరిగి చూసింది. పార్కు దగ్గర రిక్షా ఎక్కుతున్న అదే ఆకారం...రిక్షా తన వెనుకే...

గుండె ఝల్లు మంది.

యింటికి చేరుకుని రిక్షావాడికి డబ్బు లిచ్చి గబగబ లోపలికెళ్తూ వీధికొనకూ చూసిన పద్మ అకస్మాత్తుగా ఆగిన రిక్షాను చూశాక మరి బెంబేలు పడిపోయి లోపలి కెళ్ళి తలుపు వేసుకున్నాక గాని కాళ్ళ వణుకు తగ్గలేదు.

రిక్షాలోంచిదిగి సరాసరి తనయింట్లోకే వెళ్ళినదెవరై ఉంటారా అనే అనుమా నంతో రిక్షాలోనే కాసుకూర్చున్న జగన్నాధానికి తల వేడెక్కిపోయింది.

రిక్షావాడికి డబ్బులిచ్చేసి పంపేశాడు.

యింటికి వెళ్ళటమా ? మానటమా అని ఆలోచించాడు. కొంత సేపు అటూ యిటూ తిరిగి చివరికిల్లు చేరాడు.

తలుపు కొట్టేసరికి పద్మ త్రుళ్ళి పడింది.

"పద్మా" భర్త కేకకు కొండంత ధైర్యం వచ్చి తలుపు తీసింది. పరధ్యా న్నంగా యింట్లో అడుగు పెట్టిన జగ న్నాధం కళ్ళు నాల్గు ప్రక్కలా వెదుకు తూనే ఉన్నాయ్.

"మీ స్నేహితురాల్ని కలిసావా" చాలా సేపటికి జగన్నాధం భార్యనడిగాడు.

"ఉహూ, లేదు" అని మాత్రం అంది.

"అదేం ?"

"వీలుపళ్ళేదు."

"అంటే"

"ఆమె నన్ను నెహ్రూ పార్క్‌లో కలుసుకోమంది."

"నెహ్రూ పార్క్‌లోనా ?" షాక్ తిన్నట్లయ్యాడు.

"ఔను, సరిగ్గా ఆరుగంటలకు రమ్మంది."

"వెళ్ళావా ?''

"వెళ్ళాను."

"మరి కలియలేదా ?"

"లేదు: యింతలోనే ఎవడో తుంటరి వెధవ..."

"పద్మా!'' ఆవేశంగా అరచి తన తొందరపాటుకు సిగ్గుపడి..."ఆఁ"... అన్నాడు, తర్వాత చెప్పమన్నట్లు.

"అటువైపు రావటంతో నాకు భయమేసి వెంటనే రిక్షాలో యింటికి చేరాను.

వాడెవడో మరి, మరో రిక్షాలో యీ వీధి కొసవరకూ వెంబడించాడు.

మీరు తలుపు కొడితే అందుకే వెంటనే తీయలేదు, మీ గొంతు వినేవరకూ.

బట్టలు మార్చుకోండి, భోజనం చేద్దాం'' అంటూ పద్మ వంటగదిలోకి వెళ్ళిపోయింది.

జగన్నాధాని కిదంతా ఓ మిష్టరీలా తోచింది – తను వెంబడించింది తన భార్యనేననే సంగతి గుర్తు కొచ్చేసరికి యిదంతా ఎవరో కావాలనే ఆడిన నాటకం ఏమో అన్పించింది.

లేకపోతే___

తననూ,

పద్మనూ,

కూడా నెహ్రూ పార్కులో సరిగ్గా ఆరుగంటలకు–

"ఓహ్" తల కొట్టుకున్నాడు.

రెండురోజులు గడిచాక మళ్ళీ జగన్నాధానికి ఉత్తరం వచ్చింది–'నవరంగ్' బాక్సులో కల్సుకోమని–ఉత్తరం ఆఫీసు ఎడ్రసుకే వచ్చింది. ఐదవగానే ఆఫీసు నుంచి బయల్దేరి ఇంటి కొచ్చేశాడు. యింటి కొచ్చేసరికే టాయ్‌లెట్ అయి సిద్ధంగా ఉన్న భార్యను చూశాక ఆశ్చర్యపడకుండా ఉండలేకపోయాడు.

"మీ స్నేహితురా లివాళ మళ్ళీ కల్సుకోమందా ?"

"ఔను."

"నవరంగ్–బాక్సులో కదూ ?"

యీ మా రాశ్చర్యపడటం పద్మ వంతయింది.

"ఔను."

సరే, యిద్దరం కల్సేవెళ్దాం.

యీ మాటకు మరీ ఆశ్చర్యపోయింది పద్మ.

సరేనంది.

యిద్దరూ బయల్దేరారు.

ఆ తర్వాత రెండేసిరోజుల వ్యవధిలో....

బీచ్ ఒడ్డున...

బస్‌స్టాప్‌లో ...

ఎమ్యూజ్‌మెంటు పార్కు–దగ్గర ...

యిలా కల్సుకోమని జగన్నాధానికుత్తరాలురావటం...ఇంటికిరావటం... భార్య సిద్ధంగాఉండటం...

యిదంతా జగన్నాధాని కయోమయం అనిపించింది.




ఒకవేళ పద్మే యిలా నాటకమాడు తూందా అనిపించింది. _ నిలేశాడుకూడా.

'నా జీవితానికో వెలుగుచూపారు. మీ ఆదర్శాల్ని కార్యరూపంలో చూపించి బాల వితంతువునయిన నన్ను వివాహం చేసుకుని ఎంతో త్యాగంచేశారు. మీ హృదయం ఎంత విశాలమైందో ఋజూ చేసుకున్నారు.

పోతే...

మీ ఆదర్శాల్ని అర్థం చేసుకోలేని వాళ్ళు అన్నమాటలకు మీలోని ఆత్మ బలం దెబ్బతింది —

అమూల చేసినపనికి పశ్చాత్తాపంతో పాటు అనుమానం ద్వేషం... స్థానం చేసుకున్నాయ్ మీలో.

బొమ్మను బొమ్మగాఉంచక జీవం పోసి కదలించారు.

అణగారిపోయిన ఆశల్ని రేపారు.

అందులో కాలిపొమ్మని శపించటం కూడా మీరేచేస్తే యెలా సహించ మంటారు?

యెలా భరించమంటారు?

యెంతకని ఓర్చుకోమంటారు?

మీనిర్దయ... అనుమానం ... నన్ను మసిచేసింది. గుండెకోత పెట్టింది. యీ బాధ, యీబరువు, యీక్షోభ, నేనెవరితో చెప్పుకోవాలి.

మీరువినరు...

తల్లి చిన్నప్పుడే పోయింది,

తండ్రికూడా నాకాశ మిగల్చలేదు.

అనుక్షణం భారమైపోతున్న హృదయ బాధను ఎవరో ఒకరితో చెప్పుకోవాలి...చెప్పుకున్నాను. లల్లీతో చెప్పుకున్నాను. అప్పటికొంత గుండె బరువు తగ్గింది. మనశ్శాంతి లభించింది. లల్లీయే యీ ఉత్తరాలు వ్రాసింది.

యిందులో నాతప్పేమయినా ఉంటే క్షమించండి!' పద్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. భర్త పాదాలమీద వాలి పోయింది.

"లల్లీకి పెళ్ళయిందికదూ" ఉన్నట్టుండి జగన్నాధం అడిగినదానికి పద్మ యేం జవాబూ చెప్పలేకపోయింది.

కొద్దిగా తేరుకున్నాక చెప్పింది. లల్లీ భర్త బి. డి. ఓ. గా పనిచేస్తున్నాడు.

జగన్నాధం యింకేమన్లేదు. మొదటి సారిగా తన ప్రేమను వెళ్ళబోస్తూ లల్లీ తనకు వ్రాసిన వుత్తరాన్ని ఆమె భర్తకు పంపినట్టు పద్మకుగూడా తెలియనివ్వ లేదు.

వారంరోజులనాడు లల్లీ భర్తదగ్గ ర్నుంచి జవాబు వచ్చింది.

"డియర్ జగన్నాధరావ్,

మీ ఉత్తరం అందింది. మెనీ మెనీ థాంక్స్! యిన్నాళ్ళూ మనుష్యుల వ్యక్తిత్వాన్ని, మనస్తత్వాన్ని, వాళ్ళు వెలిబుచ్చే భావాలతో సమన్వయం పర్చుకుని ఆ వ్యక్తిమీద ఓ అభిప్రాయాన్ని ఏర్ప రచుకోవటం మాత్రం నాకు తెల్సు. అఫ్‌కోర్స్...అది మంచయినా కావచ్చు. మరేదయినా కావచ్చు. అలా నిర్ణయించు కోవటం తప్పని మీలాటి ఆదర్శవాదులు ఋజువు చేసినపుడు పదిమందిలో నిల బెట్టి, స్వయంగా తుపాకీ పట్టుకుని కాల్చేద్దామనిపించేంత కోపం వచ్చింది. కాని...కాని......మీ మూలంగా, జీవి తాంతం దుఃఖపడేవాళ్ళున్నారనే ఇంగిత జ్ఞానం నా కోపాగ్నిమీద నీళ్ళు చల్లింది. నిజానికిప్పుడు మీ పరువునూ, ప్రాణాల్నీ కాపాడింది మీ భార్యే నన్న సంగతి నేను గుర్తుచేయనక్కర్లేదను కుంటాను.

ఇక లల్లీ గురించి అంటారా! యవ్వన సహజమైన ఉద్రేకంలో, కోర్కెల్లో, మీలాటి ఆదర్శవాదులు గొంతులు చించుకు వల్లించే ఉపన్యా సాలకు లోబడి యేవేవో కలలు గనటం మామూలే. ఐతే అవి నెరవేరవచ్చు... నెరవేరకపోవచ్చు. జీవితాంతం వాటినే అంటిపెట్టుకుని కూర్చుంటూ దుఃఖ మయం చేసుకునే చవటలూ, అలా చేసుకొంటారనుకొనే వాజమ్మలూ ఉంటారనుకోను. జగన్నాధరావుగారూ! లల్లీ నా భార్య అయ్యాక, ఆమె గతంతో నాకు సంబంధంలేదు. ఒకవేళ ఒకనాటి తన నిర్ణయాలపై... ఊహలపై... ఆమె మనసు యిప్పటికీ... అంటే... మా పెళ్ళయిన ఈ ఆరేళ్ళనాటికిగూడా లగ్నమయి ఉంటే...ఆమెను స్వాపుగా




మళ్ళించుకునే బాధ్యత, బరువు, అలా నా వైపు త్రిప్పుకోవటానికి సరిపడ సానుభూతిని, ఆప్యాయతను ఇవ్వగల శక్తి భర్తగా నాకుంటాయి చెప్పు... కేవలం ఇలాంటి ఉత్తరాలకోసం డబ్బులు తగలేసే మీ లాంటి పెద్దమనుషులవల్ల యేనాడూ కాదు ఈ ఇరవై పైసలు పెట్టి, మల్లెపూవు కొని, మీ భార్య జడలో స్వయంగా ఉంచి, దగ్గరగా తీసుకుని హాయిగా నవ్వి, ఆనందించే తెలివైన పని మీ రెందుకు చేయలేదా అనే నా విచారం, జాలిగా అనలా వుత్తరం లల్లీకి నేను వ్రాసిచ్చిందే యింకో విషయం.

మీ ఉత్తరం అందేసరికి... లల్లీ తమలపాకులు చుట్టి, నా నోటికందిస్తుంది. యీలాంటి అమృతమయమైన హాయిని, కాలాన్ని, మీ 'హెడేక్' ఉత్తరాల్తో పాడు చేసుకోవటం యిష్టంలేక తర్వాత ఎప్పుడో చదివాను... ఆదర్శవాదులదగ్గర్నుంచి వచ్చిన ఉత్తరం కదా అని. మే గాడ్ హెల్ప్ యూ. శలవ్,

—భాస్కర్."

ఆ రాత్రి పద్మ భర్త ప్రవర్తనకు ఉక్కిరిబిక్కిరయింది. గుండెలమీద తల ఆన్చి ఆనంద బాష్పాలు రాల్చింది. 'నే నదృష్టవంతురాల్ని' అనుకుంది. అప్రయత్నంగానే 'లల్లీ, భాస్కర్' ఆమె హృదయంలో నిలిచిపోయినట్లయింది. వాళ్ళకు హృదయపూర్వకంగా మనస్సులోనే నమస్కరించుకుంది.

# స్వామి వారపత్రికానంద ప్రభావం

సీతారామ్రావ్‌కు గత ఆరునెలల బట్టీ ఆరోగ్యం చెడిపోయింది. క్రమంగా క్ర క్రమంగా అక్రమంగా లావెక్కడం మొదలుపెట్టాడు. హఠాత్తుగా ఒకరోజు బరువు చూసుకుంటే రెండువందల పౌన్లు తూగాడు. అతనికి విపరీతమైన భయం వేసింది, వెంటనే ఆలోపతివైద్యం మొదలుపెట్టాడు. కాని మూడువారాల తర్వాత కూడా ఏమీ ఫలితం కనిపించ లేదు. "ఆలోపతీ" వొద్దు "ఆలిపతి" ప్రయత్నంచేయండి అన్నారు కొందరు మిత్రులు. "ఆలిపతి" (రోజు భార్యతో కులాసాగా ...... పూర్తిగా చెప్పను.) తర్వాత "ఉమాపతి" కూడా వాడి చూశాడు. ఫలితం కనిపించలేదు. "ఉమాపతి" నుండి సీతారామ్రావ్ యునానీకి వెళ్ళాడు. ఆరువారాలు గడిచాయి. సీతారామ్రావ్ బరువు పెరుగుతున్నది కాని తగ్గడంలేదు.

ఆఖరుకు ప్రాణం విసిగి దగ్గరగా వున్న నదిలో దూకేద్దామని వెళ్ళాడు సీ. రా. రావ్. అతను దూకబోతూ ఉంటే "ఆగవయ్యా ఆగు" అని వెనకనుంచి ఒక కంఠం వినిపించింది. సీ. రా. రా. వెనక్కి తిరిగిచూశాడు. స్వామీ వారపత్రికానంద పెద్ద గడ్డంతో అక్కడ నిలబడివున్నాడు. "నాతో రా నాయనా" అని ఆయన ఎంతో ఆదరంగా సీ.రా.రా ను తనతో తీసుకువెళ్ళి ఒక ఆశ్రమంలో కూర్చోపెట్టాడు. ఆ ఆశ్రమంలో సీ. రా. రా. పదిరోజులు వున్నాడు. అతను బయటకురాగానే మళ్ళీ జనంలో పడగానే అతన్ని ఎవరూ పోల్చుకోలేక పోయారు. అతని భార్యకు మూర్ఛ వొచ్చినంత పనయింది అతని బక్కదనాన్ని చూసి. స్నేహితులంతా అతనికి కంగ్రాట్స్ చెప్పారు. "ఏ మందు వాడావు" అని అడిగారు.

సీ. రా². చిరునవ్వు నవ్వాడు. "నేను స్వామివారు ఇంత గొప్పవారనుకోలేదు. రోజూ స్నానంచేశాక నన్ను కూర్చోబెట్టి కొన్ని తెలుగు వారపత్రికలు చదివి వినిపించారు. ఆధునిక నవలలూ, కథలూ, కవితా అన్నీ విన్నాను. రోజురోజుకూ బరువు తగ్గడం మొదలుపెట్టింది. మొత్తం నాలుగేళ్ళపత్రికలు వారు చదివి ముగించిన తరువాత నా బరువుచూశారు. ఆశ్చర్యం ఎంతో తగ్గింది. స్వామీ వారపత్రికానందఎంతో గొప్పవారు" అన్నాడు సీతారామ్రావ్.

"గోపశ్రీ"




జంటకొమ్మల్లాంటివి ఆ రెండు ఇళ్లూ.

ఒకదాని ప్రక్కన మరొకటి ఉన్నది. రెండింటికీ నిట్టాడి ఒక్కటే; సోపరా ఒక్కటే; ముందు గడప ఒక్కటే; మెరాబాకూడా ఒక్కటే. ఉత్తర దక్షిణాలు తాటాకులదడి మినహాయించి, రెండింటికీ మరో ప్రహరీలేదు.

ఉత్తరపు ప్రక్కన ఇంట్లో పరమయ్య ఉంటున్నాడు. ఆయన వయస్సు నాలుగు పదులపైన. కాని శరీరదార్ఢ్యం మెండుగా గలవాడు. ఒడ్డూ పొడుగూ గలిగి, కండలు దీరిన అవయవాలతో దేవాలయపు మండిగంలా దిట్టంగా కనబడతాడు. మిన్నతీవమీదున్న మధ్య వయస్కుడు! నవరసాల్లో శృంగార రసంపై ప్రత్యేకమైన అభిమానమూ, అభిరుచీగల రసిక శిఖామణి. భార్య చనిపోయి దాదాపు దశాబ్దమైంది. పిల్లలు లేరు. అప్పట్నుంచీ మళ్ళీ పెళ్ళిజేసికో లేదు. కాని స్త్రీ అనుభవం జూస్తే, "ఈ ఊళ్ళో నా కౌగిలిలో మల్లెపువ్వులా నలగని ఆడవాళ్ళు తక్కువ"

అంటూ మీసం మెలివేసి. రొమ్ము విరుచుకుంటూ ఆయన చెప్పుకోవడం కూడా కద్దు

దక్షిణ ప్రక్కన ఇంట్లో నరసింహయ్య ఉంటున్నాడు పరమయ్య కంటె ఆయన వయస్సులో ఓ అయిదేళ్ళు పెద్ద. కాని కంటికి పదేళ్ళు పెద్దగా కనబడతాడు. జీవితసమరంలో. సంసార భారంలో, కష్టాల కార్ఖానాలో ఆయన శరీరం ఏపారి, ఏనుగు దేహంలా గిడసబారింది. భార్యా, ముగ్గురు కూతుళ్ళూ, ఇద్దరు కొడుకులూ గల భార సంసారం. తాపీ పనిజేస్తూ ఆ సంసార శకటాన్ని మెరక ఎక్కించేందుకు నానా యాతనలూ పడుతున్నాడు. ఏరోజు ఆయన శరీరం స్వేదాన్ని వర్షించకపోతే, ఆ రోజు ఆ ఇంట్లో పొయ్యిమీద కుండ ఎక్కదు. కొడుకులు అందివచ్చినవాళ్ళు కాదు. కడగొట్టువాళ్లు కూతుళ్ళు ఎదిగినవాళ్ళయినా ఇంటి చాకిరీకి పనికి వచ్చే వాళ్ళేగానీ కుటుంబ భారాన్ని ఏ మాత్రం తగ్గించేవాళ్ళు గాదు. పైపెచ్చు పెద్ద కూతురూ, రెండో కూతురూ పెళ్ళీడు కొచ్చి ఆ భార్యా భర్తలకు గుదిబండలయినారు.

పెద్దకూతురు సీతాకుమారికి ఇరవయ్యేళ్లు వచ్చాయి. సర్కారు బడిలో చదువున్నంత మేరకు చదువుకుంది. అందచందాల్లో ఏ వంకా వొంపూ లేవిది. ప్రొద్దున్నే పూచిన తెల్లగులాబీలా ఉంటుంది. సహజ స్నిగ్ధసౌందర్యరాసి, సుగుణవతి. కాని ఆమెకు పెళ్ళిచేయడానికి ప్రయత్నిస్తూ నరసింహయ్య అయిదేళ్ళుగా ఆ వూరు ఆ వూరు తిరుగుతూ ఆరు జతల చెప్పుల్ని అవతల పారవేశాడు. అయినా ఆమె పెళ్ళి స్థిర పడలేదు. 'ఈ రోజుల్లో కట్నం కానుకలిచ్చుకోలేకపోతే, ఆడపిల్ల ఎంత అందమైనదయినా అడవిలో పువ్వే!' అనుకున్నాడు.

సాంతం సాగిలబడ్డ ఆ సాయంత్రం ఇంటిముందు మెరాబాలో కొబ్బరి చెట్టు క్రింద పడకకుర్చీ వేసుకు కూర్చున్నాడు పరమయ్య. సిగిరెట్టు కాలుస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. సిగిరెట్టు పొగ ఉంగరాలు తిరుగుతూ గాలిలో కలిసిపోతున్నట్టుగానే — ఆయన మనస్సులో ఆలోచనలు ఉంగరాలు తిరుగుతున్నాయి.

నరసింహయ్య తాపీ పనినుంచి ఇంకా ఇంటికిరాలేదు. ఆయన భార్య శాంతమ్మ ఇంటిముందు ఖాళీ స్థలంలో గోతాం పట్టమీద ఎండబోసిన పెసల్ని పెద్ద దబరాగిన్నెలోకి ఎత్తుతూన్నది. ఆవిశ కొడుకు లిద్దరూ దూరంగా ఓ మూలనున్న పెంటపోగు దగ్గర బిళ్ళంగోడు ఆట ఆడుతున్నారు. రెండో కూతురు నళిని వసారాలో గుంజకు చేట చేర్చుగా కూర్చుని ఏదో వారపత్రికలో సినిమా బొమ్మల్ని ఆసక్తిగా చూస్తోంది. మూడో కూతురు ప్రక్కింటికి వెళ్ళింది ఆటలకోసం.

ఊహల్లో అందమైన స్త్రీలనుగురించి ఆలోచిస్తున్న పరమయ్య దృష్టి కాకతాళీయంగా ఎదురుగ్గా వున్న పైగజాల్లో జామచెట్టు దగ్గరున్న పంపుమీదకు మళ్ళింది. ఆయన ఆలోచనలు కొత్తదారి త్రొక్కాయి; కొత్త ఉత్సాహాన్ని పుంజుకున్నాయి. ఏదో అనిర్వచనీయమైన ఆనందం గ్లూకోజ్ ఇంజక్షనిచ్చినప్పుడు శరీరంలోకలిగే వేడివలె పొంగి పొర్లింది.

—పంపుదగ్గర సీతాకుమారి బకెట్ లోకి నీళ్లు కొడుతున్నది. అప్పుడామె వొంగి వుండడంవల్లనూ, పైట కుడి భుజంమీద నాట్యం చేస్తూండటంచేతనూ— ఆమె సన్నని నడుంవొంపులూ, రొమ్ముల లావణ్యమూ ఆయన చూపుల్ని బరబర లాగేశాయి. గులాబిరేకుల్లాంటి ఆమె చెక్కిళ్ళపై మునిమాపు మెత్తని కాంతులు పడుతూ అందానికి మెరుగులు పెడుతున్నాయి.

నులివెచ్చని ఉద్రేకం నీటిఆవిరివలె శరీరంలో పొగలూ సెగలూ కాగా, పరమయ్య సిగిరెట్టు అవతలపారేసి, కుర్చీలో సర్దుకుని కూర్చున్నాడు. కాని దృష్టిని రవ్వంత మళ్ళించలేదు. స్త్రీలో హృదయాహ్లాదాన్ని రేకెత్తించే భాగాలను చూడడం ఆయనకు గొప్ప సరదా. తద్వారా పొందే పరవశత్వం అనుభవానికి గీటురాయి.

బకెట్‌తో నీళ్ళు తీసికెళ్ళుతూ ఆయన ముందుగానే నడిచివెళ్ళింది సీతాకుమారి. బకెట్ బరువుతో ఆమె బాణం బద్దలా వొంగి నడుస్తూంటే — ఆసౌందర్యపు సొగసుల్ని తిలకిస్తూ పరమయ్య కనురెప్పలు వాల్చలేదు. ఆమె ఇంట్లోకి వెళ్ళేవరకూ అదేచూపు చూస్తూనే ఉన్నాడు.

...అబ్బ! ఎంత అందంగాఉంది సీతాకుమారి! ఆసౌందర్యం, ఆవొంపులూ, ఆ లావణ్యమూ, ఆ ఆకర్షణా — తను ఏ స్త్రీలోనూ చూడలేదు. ఇట్లాంటి స్త్రీనుంచి పొందని అనుభవంతో తన జీవితం సార్థకతకాదు. ఆమెను తను పెళ్ళిచేసికుంటే! తనబ్రతుక్కి పరిపూర్ణత ఏర్పడుతుంది! తను కబురుచేస్తే నరసింహయ్య కాదంటాడా? కట్నం ఇచ్చుకోలేని దుస్థితిలో ఆమెకు పెళ్ళి చేయలేక నానాఅవస్థా పడుతున్నాడు. ఆయన్ను అడగటమెట్లా? అనుకున్నాడు పరమయ్య.

మళ్ళీ ఇంట్లోంచి ఖాళీ బక్కెట్‌తో బయటికొచ్చింది సీతాకుమారి. బకెట్‌ను వూగులాడించుకుంటూ, ఆయన ముందుగా నడుస్తూ, "ఏమిటిబాబాయ్! ఆదేపనిగా ఆలోచిస్తున్నావ్!" అన్నదిసీతాకుమారి— చందమామ వెన్నెల్ని వెదజల్లినట్టు చిరునవ్వు నవ్వుతూ.

ఉండేల్‌దెబ్బ తగిలినట్టు పరమయ్య గుండె గతుక్కుమన్నది. తనను 'బాబాయ్!' అని సంబోధిస్తున్నదేమిటి? తను ఆమెను గాఢాతిగాఢంగా ప్రేమి

స్తున్నాడు. అట్లా ఆమె పిలవడం న్యాయమా ? సబబా ? – తను ఆఇంట్లోకి వచ్చిన అయిదేళ్ళనుంచీ ఆమె అట్లానే పిలుస్తూన్నది అలవాటై పోయింది.

"బ్రతుకునుగురించి ఆలోచిస్తున్నాను సీతా !" అన్నాడు పరమయ్య ప్రేమగా, ఆప్యాయంగా.

"నీ బ్రతుకేం బాబాయ్ ! కొబ్బరి బొండాంలోని చల్లని నీరు" అంటూ సీతా కుమారి పంపుదగ్గరకు వెళ్ళింది.

ఛి, ఛీ, మళ్ళీ అదేమాట! "బాబాయ్!" "బాబాయ్ !" – తనని అట్లా పిలవకపోతే యేం ? మృదువుగా, ముచ్చటగా, సరసంగా – "బావా !" అని పిలిస్తే ఎంత పసందుగా వుంటుంది !

— పరమయ్య మనస్సులో తుమ్మముల్లు గుచ్చుకున్నంత పనైంది. మళ్ళీ అంతలోనే తెప్పరిల్లి, బకెట్‌లోకి నీళ్ళు కొడుతూన్న ఆమెకేసి కొండంత ఆత్రుతతో చూడసాగాడు.

కాని మునిచీకటి చిక్కబడింది. నరసింహయ్యగారింట్లో దీపం వెలిగించబడింది. సట్టింట దీపపుతాలూకు చారలు ఇంటిముందు మెరాబాలోకి పర్చుకోగా చీకట్లోని పదార్థాల్ని సూటిగా చూసే దృష్టిబలం పరమయ్యలో సన్నగిల్లింది. మళ్ళీ బకెట్‌నిండా నీళ్లు తీసికెళ్ళుతూ ఆయన ముందుగానే సీతాకుమారి వెళ్ళింది. ఆమె మాట్లాడలేదు, మాట్లాడే అవకాశంలేక పరమయ్య కళ్ళప్పగించి చూస్తూ కూర్చున్నాడు. ఇంత త్వరగా చీకటి చిక్కబడుతుందని ఆయన అనుకోలేదు.

* * *

పరమయ్యకూ, నరసింహయ్యకూ పూర్వపు బంధుత్వమేమీలేదు. కాని ఒక కులానికి చెందినవారే. అయిదేళ్ళ క్రితం నరసింహయ్య తమ్ముడు ఆ ఇంటి భాగాన్ని అమ్ముకొని జీవికకోసం నైజాం వెళ్ళితే నాలుగువేల రూపాయలకు ఆఇంటిని కొనుక్కొని అందులో ప్రవేశించాడు పరమయ్య. అంతకుముందే ఆయన భార్య పరలోకగతురాలైంది. మళ్ళీ పెళ్ళి జేసికోలేదు. "పరమయ్యా ! ఇంకా గోడదుమికే వయస్సులోనే ఉన్నావు. మళ్ళీ పెళ్ళి జేసికోకపోయావూ ?" అంటూ స్నేహితులు సలహాలిచ్చారుగానీ, "నా శారీరక వాంఛలు తీరే అవకాశాలు లేకపోతేనే గదా ?" అంటూ ఆ సలహాల్ని కొట్టి పారవేశాడు. కాని ఇప్పుడిప్పుడే సీతాకుమార్ని వివాహం చేసుకోవాలన్న లాలస ఆయనలో మొగ్గతొడిగి, వికసించే దశకొచ్చింది.

ప్రక్కప్రక్కనే వుండటంచేత పరమయ్యకూ, నరసింహయ్యకూ సహజమైన స్నేహానుబంధాలు కాలక్రమేణా ఏర్పడ్డాయి. ఏదైనా డబ్బు అవసరమైనప్పుడు నరసింహయ్య ఆయనదగ్గర పుచ్చుకోవడమూ చేతికిరాగానే తిరిగి




యిచ్చివేయడమూ జరుగుతూన్నది. పరమయ్యకు ఆడదిక్కు లేదు స్వయం పాకం అందుచేత నరసింహయ్య భార్య అప్పుడప్పుడూ పిల్లలచేత కూరలూ, పిండివంటలూ పంపుతూవుంటుంది. ఆ విషయంలో ఆవిడ సాహసమేమీలేదు. నరసింహయ్యే స్వయంగా ఆ సూచన చేశాడు ఇరుగూ పొరుగూ వాసులుగా వాళ్ళిద్దరికీ స్నేహం వున్నా ఆ స్నేహంలో ఆత్మీయతా, చనువూ తక్కువ.

వెతికి వెతికి నరసింహయ్య పెద్ద కూతురుకు తెనాలినుంచి ఓ సంబంధం తీసుకొచ్చాడు. వరుడు బుద్ధిమంతుడు. తల్లీ దండ్రీ ఆసరాఉంది. ఏదో ప్రెస్‌లో వర్కరు. నెలకు నూరు రూపాయలు తెచ్చుకుంటున్నాడు. అంద చందాలకు లోటుకూడా లేదు. ఆసంబంధం ఖాయ పడితే తనగుండెలమీద బరువు సహం తీసివేసినట్లవుతుందని ఆశపడ్డాడు నరసింహయ్య.

పెళ్ళి చూపులు జరిగాయి, పిల్లవాడూ, తల్లి దండ్రులూ, మరో మధ్యవర్తీ. వచ్చారు. కట్నం కానుకలక్రింద అయిదు వందల రూపాయలిచ్చేట్టు కూడా ఖరారు చేసికున్నారు. అబ్బాయికి అమ్మాయి బాగా నచ్చింది. అందుచేత తండ్రి వెయ్యి రూపాయలకట్నం ఇవ్వమని పట్టుబట్టినా, పిల్లవాడి మోజుకొద్దీ కొండ దిగిరాక తప్పలేదు. ఆపెళ్ళి స్థిరపడుతుందని నరసింహయ్యా, శాంతమ్మా మురిసి పోయారు. ఇకముహూర్తం పెట్టు కోవడమే మిగిలింది. ఇంటికి వెళ్ళాక పురోహితునితో సంప్రదించి, లగ్నాలకు తరలివస్తామనీ, ముందుగా ఉత్తరం

ద్వారా తెలియబరుస్తామనీ చెప్పి వాళ్లు వెళ్ళారు. అప్పట్నుంచీ నరసింహయ్య రోజూ పోస్టాఫీసుకు తీరిక చేసికొని వెళ్ళి వస్తూనే ఉన్నాడు.

సరీగ్గా వారం రోజులకు వాళ్ళ దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది; ఈ పెళ్ళి మాకు ఇష్టంలేదనిన్నీ మరో సంబంధం చూసుకోవాల్సిందనిన్నీ.

ఆ భార్యా భర్తలు తలలు తలలు పట్టుకు దుఃఖించారు.

సీతాకుమారి తన దుర్విధిని తల్చుకుని కడుపులో ప్రేవులు కదిలిపోయేట్టు కుమిలి కుమిలి ఏడ్చింది.

వాళ్ళ ఆశలనూ, అడియాసలనూ ప్రక్కింట్లోవుండే పరమయ్య ప్రత్యక్షంగానే వీక్షిస్తున్నాడు.

* * *

అంతటితో నరసింహయ్య కాలి నుసిగామారిన బొగ్గువలె పీరసించి పోలేదు. అడుగంటిన ధైర్యాన్నీ, ఉత్సాహాన్నీ, విశ్వాసాన్నీ కూడగట్టుకొని మళ్ళీ సీతాకుమారికి సంబంధాలు వెతికే ప్రయత్నాలు చేశాడు. మిత్రులనూ, శ్రేయోభిలాషులనూ, పరిచయస్తులనూ, వాకబుచేసి వాళ్ళ సహాయ సానుభూతులతో ఓనెలా పదిహేనురోజుల పిమ్మట మరోసంబంధాన్ని తీసుకొచ్చాడు నరసింహయ్య.

"ఈ సంబంధం తప్పకుండా కుదురుతుంది. నాకు నమ్మకముంది. ఇది తప్పిపోయిందంటే, ఇక సీతకు పెళ్ళికాదు ఈజన్మలో" అన్నారు నరసింహయ్య

"ఏమో !. అన్నింటికీ ఆ భగవంతుడే ఉన్నాడు" అన్నది శాంతమ్మ ఏడుకొండలవాణ్ణి స్మరించుకుంటూ.

"ఇంకా స్వామికి నాపై దయకలుగలేదు. అనుకుంది సీతాకుమారివిశ్శబ్దంగా."

ఓ శుభముహూర్తాన పెళ్ళి చూపులు జరిగాయి. పెళ్ళికొడుకుది కాస్త ముదిరిన వయస్సు. కాని ద్వితీయంకాదు. సెకెండరీ గ్రేడు టీచరుగా అతనికి ఎనిమిదేళ్ళ అనుభవం ఉంది. ఇంతకాలమూ అతను పెళ్ళి చేసికోకుండావుండి, ఇప్పుడు వివాహానికి సుముఖుడు కావడానికి ఏవేవో కథలు అమల్లో లేకపోలేదు. కాని ఆకథల్ని కట్టుకథలుగా నరసింహయ్య భావించి ముందుకొచ్చాడు.

పెళ్ళికొడుకు ఏమంత అందమైనవాడు కాదు. తుమ్మచెక్క మొహం. సన్నగా, ఆకులురాల్చిన సర్విచెట్టులా ఉన్నాడు. కొంగమెడ, నర్సరావుపేట బావుల్లోవి పీపులా లోతైన నేత్రాలు. ముక్కు మూడంగుళాల పొడవుంది. వెయ్యిమంది జనంలో ఎత్తుగా, నిచ్చెన నిలబెట్టి నట్టుగా కనబడే ఆకారం.

అతగాడు సీతాకుమారికి ఏమాత్రం నచ్చలేదు. కాని నోరు నొక్కుకున్నది - తండ్రి ఏమైనా అంటాడేమోనని. పెళ్ళి చూపుల తతంగంద్వారా చూసి చూసి




ఆమెకు మగజాతిపైన ఓరకమైన దోష దర్శిత్వదృష్టి అలవడింది.

సీతాకుమారి ఆ పెళ్ళికొడుక్కూ బాగా నచ్చింది. ఇట్లాంటి అందచందాల అలివేణికోసమే తను ఇన్నాళ్లూ పెళ్ళిచేసికోకుండా తాత్సారం చేసిందని మహా ఇదిగా మురిసిపోయాడు. కట్నం కానుకల ప్రసక్తి ఎత్తకుండానే ఆమెను పరిణయ మాడటానికి పెన్నిధి దొరికినంత సంబరంతో ఒప్పుకున్నాడు.

పురోహితుణ్ణి పిలిపించి వెంటనే ముహూర్తంకూడా పెట్టించారు. ఆ ముహూర్తం పదిహేనురోజుల వ్యవధిలో కుదిరింది. పెళ్ళికొడుకూ, అతని తల్లిదండ్రులూ తమ గ్రామం వెళ్ళారు - పెళ్ళి పనులకోసం తొందర పడుతూ.

సీతాకుమారి పెండ్లికి ముహూర్త నిశ్చయంకూడా జరిగిపోవడంతో - ప్రక్కింటిలోవున్న పరమయ్య శరీరం మీద తేళ్ళూ, పాములూ మొదలయిన క్షుద్రకీటకజాతి పారుకాడసాగాయి. చీకటినిండిన చిత్తంతో చిందులు త్రొక్కనారంభించాడు. ఎంత దారుణం? ఎంత ఘోరం? ఆమెకోసం తను యివతల తపించిపోతూంటే, తనని మాట మాత్రం అడక్కుండా - నరసింహయ్య ఆమె పెళ్ళి కుదురుస్తాడా? తన బ్రతుకేం గావాలి? తనకు వయస్సు ఉంది;

అందచందా లున్నాయి; ఆస్తి ఉంది. పేరూ పలుకుబడీ ఉన్నాయి. తనకంటె ఆ కిటికీ చువ్వగాడు సీతాకుమారికి తగిన వరుడా? ఆమె ఎట్లా ఒప్పు కుంది ఈ బలవంతపు పెళ్ళికి? అను కుని పరమయ్య చీకాకు పడ్డాడు

ఒకరోజు మధ్యాహ్నం సీతాకుమారి ఒంటరిగా ఇంటిపసారాలో తిరుగు తూంటే. తన ఇంటికి పిల్చాడు పరమయ్య.

"ఈ పెళ్ళి నీకు ఇష్టమేనా, సీతా?" అన్నాడు పరమయ్య ఆవేశాత్మకంగా.

"నా ఇష్టాయిష్టాలతో పనేముంది బాబాయ్!" అన్నది సీతాకుమారి నివురు గప్పిన నిర్లిప్తతతో.

పరమయ్య మనస్సుకు ఈతముల్లు గుచ్చుకుంది—'బాబాయ్!' అన్న సంబో ధనతో. తన ప్రేమనూ, ఉద్దేశ్యాన్నీ, ఉత్కంఠనూ వెళ్ళగ్రక్కా లనుకున్న ఆయన గొంతులో గులకరాళ్లు అడ్డు వచ్చాయి. ఏం మాట్లాడలేక ముఖం ప్రేళ్ళాడ వేశాడు.

నలిగిన నల్లేరులా నిట్టూర్పు విడుస్తూ సీతాకుమారి వెళ్ళింది.

* * *

పెళ్ళి ఇంకా మూడురోజు లుందనగా ఓ మధ్యాహ్నం నరసింహయ్యగారింట్లో హఠాత్తుగా గాలి స్తంభించింది.

అది రానున్న గాలివానకు సూచనగా గ్రహించాడు ప్రక్క ఇంట్లో వున్న పరమయ్య.

కొన్ని నిముషాల అనంతరం ఆ ఇంట్లో నిజంగా గాలివాన ఛాయలే కనిపించాయి

"ఈ ముదనష్టపు ముండకు యిక జీవితంలో పెళ్ళికాదు!" అన్నాడు నర సింహయ్య బిగ్గరగా. ఆ కంఠంలో ఏదో తీవ్రమయిన ఆగ్రహమూ, ఆవే దనా, కసీ కలిసికట్టుగా ధ్వనించాయి.

శాంతమ్మ సన్నగా ఏడ్పు సాగిం చింది

నరసింహయ్య పెద్దకూతురుకు పట్టిన దుర్గతిని నానా శాపనార్థాలద్వారా వెళ్ళ గ్రక్కుతున్నాడు. అయిదేళ్ళుగా కడు పులో పుండువలె పెరిగిన సహనం ఆయనలో ఒక్కసారిగా పగిలి బ్రద్ద లైంది. దానితో ఉచితానుచితాలు విస్మ రించి సీతాకుమారినీ,ఆమె దురదృష్టాన్నీ, లోకంలో పెచ్చరిల్లిపోతున్న కుళ్లునూ, దుర్మార్గాన్నీ, భగవంతుని కాఠిన్యతనూ వెనవైనాలుగా తిట్టసాగాడు.

సీతాకుమారి కుక్కిన పేనులా మంచం కుక్కిలో మూడు అంకె వేసి కావి పడుకుని కళ్ళద్వారా కుంభవృష్టిని కురిపిస్తోంది.

—పరమయ్య సంగతీ సందర్భాలను ఇట్టే గ్రహించాడు. సీతాకుమారి పెళ్ళి మళ్ళీ తప్పిపోయింది. అవతలవాళ్ళు "మీ సంబంధం మాకు అక్కర్లేదు,"

ంటూ ఉత్తరం వ్రాసి వుంటారు. ముహూర్తం నిర్ణయించబడ్డ పెళ్ళి జారి పోతే. నిజంగా ఏ తండ్రయినా ఏం చేయగలడు? అసలు తనలాంటివాణ్ణి ఇంటిప్రక్కన పెట్టుకొని ఆ నరసింహయ్య దూరపు కొండలకేసి పోవడం ఏం బాగులేదు। అందుచేతనే ప్రతిసారీ ప్రొద్దెదురు। అట్లాంటి శాస్తి జరగవల్సిందే।...ఇప్పటికైనా అడుగుజారి అతనిని అడక్కపోతాడా? అనుకున్నాడు పరమయ్య

ఆరోజు సాయంత్రం అయిదు గంటలకు నరసింహయ్యగారింట్లోంచి హఠాత్తుగా ఏడ్పులు వినవచ్చాయి. నరసింహయ్య ఇంట్లోలేడు.

పరమయ్య పరుగెత్తుకుంటూ ఆ ఇంట్లోకి వెళ్ళాడు.

పెళ్ళి ఆగిపోయిన అవమానాన్నీ, తండ్రి తిట్లనూ, లోకాపనిందనూ భరించలేక సీతాకుమారి అఘాయిత్యానికి తలపడింది. ఎవ్వరూ లేకుండాచూసి వంటగదిలో వొంటినిండా కిరసనాయిలు పోసుకొని అగ్గిపుల్ల అంటించుకుంది. చిన్నతమ్ముడు చూసి తల్లిని కేక వేశాడు. తల్లివచ్చి మంటలు ఆర్పడానికి నానా ఖంగారూ పడేసరికే సీతాకుమారి పచ్చటి శరీరం చాలా భాగం కాలి మసిబొగ్గయింది. నేలమీద కుప్పగా కూలిపోయింది.

ఆమె వికృతాకారాన్ని చూసి పరమయ్య నిలువెల్లా శిలా ప్రతిమవలె స్తంభించి పోయాడు.

సీతాకుమారిని వెంటనే ఊళ్ళోవున్న ఎల్ ఎఫ్ డిస్పెన్సరీలో చేర్చారు. ఆమె చావుబ్రతుకుల్లో ఉంది. పరమయ్య ఆమె మంచందగ్గర నేరస్థునిలా కూర్చున్నాడు. ఆయన మొహంలో కత్తిగీటుకు నెత్తురు చుక్కలేదు.

"బావాయ్।... బావాయ్।" అన్నది సీతాకుమారి మెల్లగా.

పరమయ్యలో దుఃఖం పెల్లుబికి, పశ్చాత్తాపం రూపంలో బయటికొచ్చింది.

"నేను ... దుర్మార్గుణ్ణి సీతా।... నన్ను క్షమించు నీ మీద ప్రేమాభిమానాలతో, నిన్ను పెళ్ళి చేసికోవాలన్న తలంపుతో .. నీ జీవితాన్ని నాశనం చేశాను. నిన్ను దారుణంగా బలిచేశాను .. నీకు వచ్చిన సంబంధాలను చెడగొట్టింది. నేనే, ఈ పెళ్ళికూడా చెడిపోవడానికి నేనే కారకుణ్ణి. నన్ను క్షమించు సీతా।''

మునిమాపులో లీనమైపోనున్న సూర్యాస్తమయ కాంతిలా పేలవంగా నవ్వింది సీతాకుమారి.

"నీ మనస్సు నాకు తెలుసు బావాయ్। కాని మన పెళ్ళి అసాధ్యం. జరిగేదికాదు. వచ్చే జన్మలో నీకు భార్యగా పుడతాను బావా।'' అన్నది సీతాకుమారి సత్తువను కూడగట్టుకొని.




కూత వేసుకుంటూ సాగిపోయింది రైలుబండి.

ఆ పల్లెటూరి చిన్న ప్లాటుఫారం మీద మిగిలిపోయిన నలుగురు ప్రయాణీకులూ సామాను చేత్తో పుచ్చుకుని, టిక్కెట్లు గేటు దగ్గర నిల్చున్న స్టేషన్

# నాలికపైన నేమి?

కౌటూరి రవీంద్ర-త్రివిక్రమ్



మాష్టరు కందించి బైటికి నడిచేరు.

బరువుగా వున్న లెదర్ సూటుకేసు మోయలేక ఒక ప్రక్కకి ఒరిగి పోయింది, 'వీణావని'. ఆ 'అమ్మడు' తామరతూండ్ల చేతులు ఎఱ్ఱగా కంది పోయాయి. పల్చని పెదవుల్ని పంటి కొసలతో నొక్కి పట్టింది. ఆమె పరసనే 'సరస్వతి' రెండు చేతుల్లోను చేతి సంచీలు పట్టుకుని నడుస్తోంది.

ఇద్దరూ మట్టిరోడ్డు దగ్గరికొచ్చేరు. నేలమీద సామానుంచి చేతులు దులుపుకుని దూరంగా వున్న ఊరినుండి స్టేషను దెసగవున్న మట్టిరోడ్డు మీదుగా పరుగులు తీస్తూ వస్తున్న ఎడ్లబండికేసి చూడసాగేరు.

"అది మాదే!" అంది ఆనందంతో తబ్బిబ్బౌతూ, 'సరస్వతి'. 'వీణావని' మారుపలక్కుండా నిర్లిప్తంగా చూస్తు నిలబడింది. బండికేసి. బండి సమీపిస్తున్నకొద్దీ పట్టెడకున్న మువ్వల ధ్వనితో గంటల శబ్దం మిళితమై కొట్టొచ్చినట్లు వినిపిస్తోంది.

బలిసిన ఎద్దుల్ని కొరడాతో అదిలిస్తున్న ఒక దృఢకాయుని శరీరం నిండుగా కనిపిస్తోంది. బండిమీద. మరో నిముషంలో దుమ్ము రేపుతూ వచ్చి ఆగింది వాళ్ళముందు.

ఛెంగున దూకాడు దృఢకాయుడు. ఆప్యాయంగా సరస్వతిని పిలవబోయి, నూతనవ్యక్తికేసి ఆశ్చర్యంగా చూస్తు నిలబడిపోయాడు.

నిర్లక్ష్యంగా చూసిందతనివైపు వీణావని.

సరస్వతి కలగజేసుకుని "మా స్నేహితురా లన్నయ్యా...పేరు వీణావని" అంది.

"నమస్కారం" అన్నాడు చేతులు జోడించి.

ప్రతినమస్కారం చేసి ఆశ్చర్యంగా సరస్వతి కేసి చూసింది. ఆ చూపుల్లో ఏదో భావన కొట్టొచ్చినట్లు కనిపించి, సరస్వతికి అర్థమైంది. "అన్నయ్య అంతే! చాల' నిరాడంబరంగా ఉంటాడు" అంది.

వీణావని మరేమీ మాట్లాడలేకపోయింది. వాళ్ళ భావాలతో పనిలేనట్లు చిటికెలో సామానంతా బండిలో సర్ది "ఎక్కండి..." అంటూ చక్రంమీదగా ఎక్కి తొట్లో కూర్చుంటూ పగ్గా లంది పుచ్చుకున్నాడు.

దిట్టంగా బలిసిన గిత్తలు పలుకుకే పరుగు పెట్టేట్టున్నాయి ఇద్దరు ఆడపిల్లలూ ఆసీనులయిన తర్వాత గిత్తల్ని అదిలించాడు. ఒక్క కుదుపుతో ముందుకు దూకేయి గిత్తలు.

"పేపర్లు బాగా అన్సరు చేశావా చెల్లాయ్?" అన్నాడు వేణు

"చేశా నన్నయ్యా" అంది సరస్వతి.

"క్లాసు వస్తుందా?"

"అనుకుంటున్నాను మరి!"

వారి సంభాషణని మౌనంగా వింటోంది వీణావని.

"ఆదేమిటే అలా బొమ్మలాగ కూర్చున్నావ్? ఏం మా ఊరు బాగా లేదా?" అంది హఠాత్తుగా సరస్వతి.

మిత్రురాలి ప్రశ్నకి ఉలిక్కిపడి "అబ్బే...అదేం లేదు. మీరు మాట్లాడుతున్నారు కదా అని ఊరుకున్నాను" అంది వీణావని.

కొంప తగలబెట్టి అర్నెల్లు జైలు
కెళ్లారు పొయ్యి అంటించటం రాదూ?!



"వారి విబ్బంది పెట్టకు చెల్లాయ్... బహుశః క్రొత్తదనం అన్పిస్తుండవచ్చు" అన్నాడు వేణు.

సరస్వతి నవ్వింది వింతగా. "నీకు తెలియదన్నాయ్ – ఇది మహా వసపిట్ట. మంచి 'మింగ్లింగ్ నేచర్' ఉంది" అంది మిత్రురాల్ని పొగడుతూ. వీణావని మిత్రురాలిని మెల్లగా గిల్లింది కళ్ళతో బెదిరిస్తూ.

"మరేం ఫర్వాలేదులే. మా అన్నయ్యా నీకు తగినవాడే" అంది ఆమె అల్లరిగా నవ్వుతూ.

సరస్వతి, వీణావని పట్నంలో కాలేజి చదువు చదువుతున్నారు. శలవులకి 'వీణావని' బలవంతంమీద, వాళ్ళింట్లో కొన్నాళ్ళుండి, తనతోబాటు పల్లెకు వెంటబెట్టుకు వచ్చింది సరస్వతి.

వీణావని వచ్చింది మొదలు సరస్వతికి క్షణం తీరిక లేదు. కాస్సేపు మామిడితోపులో, మరికాస్సేపు తాళ్ళ చెఱువు ఒడ్డున, యింకాస్సేపు చదరంగం ఆట లేకపోతే వైకుంఠపాళి.

వీణావని వచ్చిన తర్వాత వేణు ఆమెతో సూటిగా మాట్లాడింది ఎక్కువ లేదుగానీ, పరోక్షంగా ఆమెకు అతిథి మర్యాదలన్నీ సవ్యంగా జరుగుతున్నదీ లేనిదీ ప్రత్యేక శ్రద్ధతో పరిశీలించేవాడు.

వేణుని మొదట చూసినపుడు విరక్షర కుక్షి అనుకున్నది వీణావని. కానీ, అతగాడు 'అగ్రికల్చరల్ బియ్యేస్సీ' ప్రథమశ్రేణిలో పాసయ్యాడని విని తెల్లబోయింది.

అతని వేషభాషల్లో అతినిరాడంబరం, నిర్మలత్వం స్పష్టంగా కానవచ్చేవి. అతనితో మనసు విప్పిమాట్లాడాలంటే ఏవో బెరుకుగా ఉండేది, మొదట్లో.

"ఈరోజు మా తూర్పు పొలానికి వెళదాం" అంది సరస్వతి. తూర్పు పొలమో, పడమర పొలమో—మొత్తానికి పొలం పచ్చదనంలో, చల్లని పైరుగాలి పీలుస్తూ ఆ ఆనందా న్ననుభవించాలన్న ఆసక్తి కలిగింది వీణావనికి.

"సరే" అంది అంగీకారంగా.

వేణుతో ఆరోజు తాము పొలం రానున్నట్లు చెప్పింది సరస్వతి.

"విరాక్షేపణీయంగా రావొచ్చు-ఎలమందగాడి కిచ్చి బండి పంపిస్తా, అందులో రండి" అన్నాడు.

"ఊహూఁ...అలా కాకుండు. నీతోనే వస్తాం'' అంది సరస్వతి.

"ఊఁ... తప్పుతుందా! ఎక్కండి త్వరగా.. అవతల అనుమళ్ళ పనులు చూడాలి" అంటూ తొందర జేసాడు.

* * *

వానకు నిండిన వాగులా పరుగులు పెడుతున్న గిత్తలు పగ్గాలు బిగదీసుకోవటంతో తక్కున ఆగిపోయాయి. బండి ఆగిన కుదుపుకి ఒకరికొకరు గుద్దుకొన్నారు.

పగ్గాలు గట్టిగా బిగలాగి రోడ్డుమీదకి తదేకంగా చూస్తున్న వేణు ధోరణి వింతగా తోచి మిత్రురాళ్ళిద్దరూ లేచి నిల్చుని, ఏమిటా అని చూసారు. వాళ్ళ గుండెలు ఝల్లుమన్నాయి. రోడ్డుకి నట్ట నడుమ రెండు భయంకర సర్పాలు తీవ్రంగా పోట్లాడుకుంటున్నాయి! ఒకదానికొకటి పెనవేసుకుంటున్నాయి, బుసలు కొడుతూ కాట్లు వేసుకుంటున్నాయి!

వాటికి పరిసరాల స్పృహ ఉన్నట్లే లేదు! లేకపోతే బండి వస్తున్న అలికిడికి పారిపోయి ఉండేవి. వేణు రెండు చేతులూ జోడించి, అర్ధనిమీలిత నేత్రాలతో ఏదో ప్రార్థించాడు.

వీణావని అతనికేసి వింతగా చూసింది "ఈ మనిషి రాతియుగంలో పుట్టవలసినవాడు! లేకపోతే పాములకి నమస్కరిస్తాడేమిటీ?" అనుకుంది.

అదేమి చిత్రమో, రెండు నిముషాల తర్వాత ఆ రెండు పాములూ రోడ్డుకటూ, యిటూ గుబురుగా ఉన్న గడ్డిలో దూరి మాయమైనాయి! గిత్తలు పగ్గాలు వదులు కావటంతోటే ముందుకు ఉరికాయి.

వీణావని, సరస్వతి-యింకా యిందాకటి షాక్‌నుండే పూర్తిగా కోలుకోలేదు. వాళ్ళ శరీరాల్లో యింకా కంపరం అలాగే నిలిచి ఉంది.

పొలంమీద కెళ్ళి చల్లగాలి పీల్చుకోవాలని పడ్డ ఉత్సాహం అంతా ఎండ వేడికి కరిగే నీహారంలా అయిపోయింది బండిని సరాసరి తూర్పు పొలంమధ్యకి తీసుకెళ్ళాడు అక్కడ బండి వెళ్ళటానికి అనువుగా జాగా వదిలివేయబడి ఉంది.

వేణు బండిమీదనుండి దుమికి "మెల్లగా దిగండి" అంటూ హెచ్చరించాడు. మెల్లగానే దిగారు వాళ్ళు!

కాస్సేపు భయానికి స్వస్తిచెప్పి నలు మూలలూ పరికించారు. ఎటు చూసినా పచ్చదనం! పాదాల్లో ముళ్ళు గుచ్చుకోకుండా ఉండటానికి వెంటతెచ్చుకున్న చెప్పులు తొడుక్కుని బయల్దేరారు. విహారం!

*　　*　　*

వీణావని వచ్చి అప్పుడే అయిదు రోజులు దాటింది. ఆపిల్ల అతిసుకుమారంగా బస్తీలో పెరిగింది. పల్లెటూరి వాతావరణం అంతా చూస్తుంటే - ఏదో క్రొత్తలోకంలో కడుగుపెట్టినట్లు. ఆ గోధూళీ ఆ మట్టినుండి వెలువడే వింత సువాసనలు నాసికను స్పృశిస్తుంటే కలిగే తన్మయం. ఆ పల్లెజనుల గ్రామ్యభాషలో ఒత్తిగిలిన ఆత్మీయభరితమైన, స్వచ్ఛ పూరితమైన భాష! ఆ భాషలో యాస, ఆ యాసలో ఒక అందం.

ఇవన్నీ 'వీణావని' మనస్సుని బాగా లోబరచుకున్నాయి. అన్నింటిపీ మించి పోతూ 'వేణు' కన్పించేవాడు ఉన్నతమయిన అతని విగ్రహానికి సరిపోయిన నిగ్రహం. పిండయిన గుణసంపద. రోజులు గడిచినకొద్దీ అనుభవమౌతూ అతనంటే ఏ పురుషునిమీదా అంతవరకు కలగని విశిష్టభావమేదో ఏర్పడుతున్నట్లు ఆమెకే అర్థమైంది.

తనలోని మార్పు తరచి చూసుకున్నపుడు "నేను అదివరకటి వీణావనినేనా?" అని ప్రశ్నించుకుంటే "కాద" ని ఎవరో అంతరంగంలోంచి జవాబిచ్చినట్లుండేది

బయల్దేరేముందు వారంరోజులకంటే మించి ఉండకూడదనుకున్న ఆమె నిర్ణయం సడలిపోయింది. ఆ పల్లె వాతావరణం అంతగా ఆమెను హత్తుకున్నది. వేణుతో పరిచయం పెరిగి చనువుగా మారింది.

సరస్వతి కూడ వీణావని రాకతో కులాసాగా కాలం గడపటానికి అలవాటు పడ్డది. లేకపోతే శలవులకి వచ్చినపుడల్లా ఎంత లేదన్నా ఆడపిల్ల కాబట్టి పాలుతీయటం, పిడకలుచేయటం, వంట వండటం-తప్పేవికావు! ఈ పనుల నుండీ ఆమెకు తాత్కాలిక విరామం లభించినట్లే. తల్లి వర్ధనమ్మ కూడా కూతురు నేమీ పనిచెయ్యనివ్వక అతిథిని సంతోషపెట్టటానికే వదిలివేసేది. పైగా, ఆమెకు మొదటి చూపులోనే వీణావని మీద సదభిప్రాయం ఏర్పడిపోయింది. ఆ మాట, నడవడి, ఆ రూపు-అన్నీ ముగ్ధంగా అగుపించాయావిడకి. "ఇలాంటి చదువుల సరస్వతి, బంగారు-బొమ్మవంటి పిల్ల నాకు కోడలుగా రాకూడదూ?" అనుకున్నది కూడా!

ఈ భావమే ఆమెని కూతురుద్వారా వీణావని కుటుంబం గురించి సవివరంగా తెలుసుకొనేలా చేసింది. తెలుసుకున్న తర్వాత సంతృప్తిపడ్డది కానీ, తన మనస్సులోని మాట కూతురిచెవిన వేసేవరకు ఆరాటం ఉపశమించలేదు.

సరస్వతి, తల్లి కోరిక విని నిర్ఘాంత పోయింది। ఆమె రెండు నిముషాలదాకా మౌనంగా ఉండిపోయింది. "పెద్దవాళ్ళ బుద్ధిలాలోచించినంతపనునుగాపిల్లలబుద్ధెలా ఆలోచిస్తాయి? వీణావనిని వదినగా పొందటంకంటే వేరే భాగ్యం ఏముంటుంది! అయినా, అన్నయ్యదంతా అదో తరహా వాడి మనస్సులో ఏముందో ఎవరికీ తెలియదు. తనంటే అవ్యాజానురాగం ఉన్నది. అడిగిచూస్తాను ఇద్దరూ ఆత్మీయులేగద?" అనుకొన్నది.

"ఏమే. నా కోరిక సబబుగా లేదంటావా?" అంది వర్ధనమ్మ కూతురు మౌనానికి కారణం తెలుసుకోలేక.

"సబబుగా లేకపోవట మేమిటమ్మా-బ్రహ్మాండంగా ఉంటేనూ! నా కింత వరకూ యీ ఆలోచన ఎందుకు తట్టలేదా అని విచారిస్తున్నాను" అని నవ్వేసి, "నువ్వేం దిగులుపడకు. వివాహాలు ముందుగా స్వర్గంలో జరుగుతాయట! గీత ఉంటే తప్పదు. సూత్రధారిని నేనవుతాను...సరేనా?" అన్నది.

వర్ధనమ్మ మొహంనిండా సంతోషం అలముకొంది. తేటగా నవ్వింది.

* * *

"మీరింత చదువు చదువుకున్నారు కదా? పాలేళ్ళమాదిరి వ్యవసాయం చెయ్యడమేమిటి? మీరు హాలికులైనా రందామన్నా యీ గ్రామానికెల్లా పెద్ద భూస్వాములు మీరేనయ్యె! పెత్తనం చేయిస్తేచాలు. పనులన్నీ జరిగిపోయే భాగ్యానికి పొలంలోకి దిగి నడుం బిగించాలా?"

వేణు ఆమె మాటకి మందహాసం చేసాడు.

"మీ ఉద్దేశ్యం చదువుకున్నవాళ్ళంతా ఉద్యోగాలే చేపట్టితీరాలనేగా?"

"అవసరం లేనప్పుడు అంతలేసి ధనవ్యయం చేసి పెద్ద డిగ్రీలు మాత్రం ఎందుకు సంపాయించుకోవటం? ఆ డిగ్రీలతో నాలిగ్గీసుకోవటానికా?" అంది వ్యంగ్యంగా.

"ఈ రోజుల్లో డిగ్రీలు అంతకంటే అధిక ప్రయోజనాలివ్వలేక పోతున్నాయిలెండి! గ్రాడ్యుయేట్లు, పోస్టు గ్రాడ్యుయేట్లు, డాక్టర్లు, ఇంజినీర్లు వీళ్ళంతా ఉద్యోగాలు దొరక్క దిక్కులు చూస్తున్నారు. కొందరు ఆత్మాభిమానాన్ని చంపుకుని కాఫీహోటళ్ళల్లో, టాక్సీ కార్పొరేషన్లలో తక్కువ జీవితాలకి అలవాటుపడుతున్నారు. ఉద్యోగాల్లో ఉన్నవాళ్ళకి - దినదినగండం నూరేళ్ళాయుష్షులా ఉన్నాయ్ రోజులు

ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజిలు ఇంతమంది నిరుద్యోగులకి దారి చూపించే తెరువులేక వెర్రిమొహాలు వేస్తున్నాయ్. వీళ్ళంతా ఉద్యోగాలకి ఎగబడటం మాని వెయ్యందే సమస్య తీరదు!"

వీణావని విరగబడి నవ్వింది.

"భేషుగ్గా ఉంది! చదువుకున్న




వాళ్ళంతా నోరుమూసు కూర్చోవాలి. ఉద్యోగాలు కావాలని అడక్కూడదు. అసి ఎగబడటం! అలా ఎగబడకపోతే నిరుద్యోగసమస్య తీరిపోతుంది. వండర్ పుల్‌గా ఉంది. ప్రకటన ఒకటి యిద్దామా?" - యింకా నవ్వుతూనేఉంది వీణావని. అతనుకూడ నవ్వేడు

వీళ్ళనవ్వుల్ని దూరంనుండీ విన్న సరస్వతి చేతుల్లో నాలుగు దోసపళ్ళు పుచ్చుకుని సమీపానికివస్తు. నీడలో వాళ్ళిద్దరికీ మధ్యలో కూర్చుంటూ "అంత నవ్వించేవిషయం నాక్కూడాచెప్పండర్రా. నేనూ భాగం పంచుకుంటాను" అంది కమ్మని వాసనలేస్తున్న పళ్ళను చెరొకటీ అందిస్తూ.

వీణావని ఉపశమించని నవ్వుమధ్య విషయాన్నంతా సరస్వతికిచెప్పి "మీ అన్నయ్యాని అడగవే. నిరుద్యోగులంతా ఉద్యోగంకోసం ఎగపడటం మానేసి ఏం చెయ్యాలో" అంది.

"ఏంచెయ్యటమేమిటి? వ్యవసాయం చెయ్యాలంటాడు! అంతేనా అన్నయ్యా?" అంది తానూ మిత్రురాలితరపు అవుతూ.

"అవును! మనదేశం సంగతి అటుంచి మన ఆంధ్రప్రదేశ్‌లో వేల కొలదీ ఎకరాలు బీడుబాకి ఉన్నాయి. ఆధునిక వ్యవసాయ సామాగ్రికి నేడు కరువులేదు. సుళువుగా ఎన్నో క్లిష్టతర వ్యావసాయకపు పనులు యీ యంత్రాల సాయంగా సాధించవచ్చు. దేశానికి రాబడి పెరగాలంటే పరిశ్రమలు పట్టు గొమ్మ లెలాగో స్వయంశక్తిమీద నిల

బడాలంటే వ్యవసాయం వెన్నెముక। వ్యావసాయకంగా అభివృద్ధి సాధించిన ఎన్నోదేశాలు నేడు యీ సత్యాన్ని అనుభవ పూర్వకంగా గ్రహించాయి. ఆ దేశాల్లో కర్షకునికి ఉన్నతగౌరవం లభిస్తోంది.

రష్యా వైజ్ఞానికంగా, పారిశ్రామికంగా అభివృద్ధిగాంచినా, దురదృష్టం కొద్దీ ఆహార ఉత్పత్తిలో వెనుకబడి, అభిప్రాయాలు సరిపడని అమెరికానుండే ఆహారం తప్పనిసరిగా దిగుమతి చేసుకుంటోంది। ఇంత భూభాగం ఉండి, ఉపఖండమని పేరొందిన భారతదేశం ప్రతి సంవత్సరం తన యాచకహస్తాన్ని అమెరికాముందు జాపటం మనకుతెలుసు।

ఇదంతాఎందుకని? వ్యవసాయరంగం ఎలా పటిష్ఠంచేయాలో కట్టుదిట్టమయిన ప్రణాళికద్వారా ఆచరణలో చూపలేక పోవటంవల్ల ।

ఉద్యోగాలకిఊళ్ళమ్మటతిరిగే నిరుద్యోగుల్నంతా చేరదీసి, సాకల్యంగా పరిస్థితులు వివరించి, వాళ్ళల్లో చైతన్యాన్ని కలిగిస్తే వారి సేవ నిముషాల్లో బయటపడుతుంది. భారతదేశానికి పట్టుగొమ్మలని పేరొందిన పల్లెటూళ్ళు సంపద కాలవాలమై కలకల లాడతాయి.

ఈ నిరుద్యోగుల్ని కర్షకులుగ చూడ గలిగిననాడు దేశానికి ఆహారసమస్యతో బాటు నిరుద్యోగసమస్య పరిష్కరింప బడుతుంది''... అన్నాడు ఏకధాటిన.

అతని వాగ్ఝరికి తెల్లబోయిన అతివ లిద్దరూ కోలుకున్నారు. వీణావని కా నిముషంలో తానొక గొప్ప వైజ్ఞానితో మాట్లాడుతున్న అనుభవం కలిగింది. ఆమె హృదయం ఆనంద పరవశమైంది. విద్యావంతురాలు కాబట్టి అతను చెప్పిన వాటిల్లో లవలేశంకూడా సత్యదూరమయిన విషయంలేదని అర్థం చేసుకున్నది. సరస్వతి కూడ అన్నగారిమేథకి మనసులోనే ఆనందించింది.

"మీరింత సూక్ష్మంగా వ్యవసాయం గురించి ఆలోచించగల రనుకోలేదు। ఎంత ఘనంగాచెప్పేరు।। మీరు చెప్పిన దాన్నిబట్టి నిరుద్యోగులు హాలికులైతే మాత్రం ఏమిటి? రిక్షావాడవటం కన్నా, కప్పులుకడగటంకన్నా, చాలీ చాలని జీతాలతో ఉదరపోషణ కోసం తాపత్రయపడేకన్నా – లక్షరెట్లు నయం। కానీ, మనవాళ్ళలో ఎంతమంది యీ ఆలోచనని హర్షించగలుగుతారు? ఎందరు ఆచరించ గలుగుతారు? ఎవరికీ పల్లెటూళ్ళమీద ప్రేమలేదే। వ్యవసాయం నానాటికి తీసికట్టూ నాగంభొట్లూ అన్నట్లుంది. రైతులకు సరయిన ప్రోత్సాహం లేదు. 'అన్నీఉండి అల్లుడినోట్లో శని' అన్నట్లు అతివృష్టీ, అనావృష్టి। ఇంకెలా రైతుల కడగండ్లు గట్టెక్కేది?"

"సంకల్పం ఉంటే సాఫల్యం సిద్ధిస్తుంది. మనిషి చంద్రలోకయానం చేసే




యీ రోజుల్లో అసాధ్యమనే మాటకి విలువలేదు "

"ఇక చాలించండర్రా మీ చర్చ. నాకు ఆకలి వేస్తోంది. ముందీ దోసపళ్ళ పని పట్టండి. ఆలోగా అమ్మ క్యారియర్ పంపిస్తుందేమో చూద్దాం. ఈ ఎలమంద గాడింకా వచ్చి ఏడవలేదు" అంది సరస్వతి సగం స్వగతం మిగతా వాళ్ళ నుద్దేశ్యించీవి.

ముగ్గురూ తిండిమీద పడ్డారు.

* * *

"ఏమంటావన్నయ్యా ?"

"నీ కేమన్నా పిచ్చా. వెఱ్ఱా చెల్లాయ్! ఆ అమ్మాయి ఏదో నీతోబాటు మన ఊరు చూడటానికివస్తే ఒదిన వరస కట్టావేమిటి ?" అన్నాడు వేణు చిరు కోపం చూపెడుతూ.

"అవన్నీ అడగబో కన్నయ్యా! ఇంతకీ నీ విషయం తేల్చు. అమ్మాయి నచ్చినట్లేనా ?"

"అబ్బ. ఏమిటి చెల్లాయ్. నన్ను పొలం వెళ్ళనీయ్. అవతల బోలెడు పనులు..." విసుక్కున్నాడు.

"అవన్నీ తర్వాత! ముందు నామాటకి జవాబు చెప్పి మరీ కదులు" అంటూ అడ్డుకుంది. గిత్తలు జోరీగల్ని తోకతో అదిలిస్తు తలలు తిప్పి అన్నాచెల్లెళ్ళ వివాదాన్ని వీక్షిస్తున్నాయ్.

"చూడు చెల్లీ! నీ స్నేహితురాలు బంగారు బొమ్మ. ఆవిడలో వంక

చూపటం ఆడవాళ్ళకే అసాధ్యం. ఇక మగవాళ్ళదాకా దేనికి? ఆమెకి చక్కని మొగు దొస్తాడు. ఈ పల్లెటూరు రైతు దేనికి? నామాట విని దీన్నింతటితో పోనియ్. మానససరోవరంలో బ్రతికే హంస, కొల్లేటి చెరువులో బాతుల నడుమ బ్రతగ్గలదా? ఆమె ఏ ఇంజినీరునో, ఐ.ఏ.ఎస్. నో, డాక్టర్నో, వకీల్నో..."

"వాళ్ళ నెవర్నీ వరించదు. ఒక సామాన్య కర్షకునికే అర్ధాంగి అవుతుంది!"

అతని వాగ్ధోరణికి ఆనకట్ట పడింది. ఆశ్చర్యంగా "మీరు..." అంటూ ఆగిపోయాడు వేణు.

"అలా తెల్లబోతా రేమిటండీ? నే నింతవరకూ మీ సంభాషణని యీ పశువుల పాకలోంచి వింటున్నాను! మీరు వివరించిన తర్వాత కర్షకుడు ఎంత గొప్పవాడో తెలుసుకున్నాను. నా యావచ్ఛక్తినీ వినియోగించి మీ ప్రయత్నాలకి తోడ్పడతాను. మీ ఊహల్ని యథార్థం చేయండి. నిరుద్యోగులయిన యువకుల్ని 'యంగ్ ఫార్మర్స్ క్లబ్' పేరిట ఆహ్వానిద్దాం. నిన్నరాత్రంతా నాకిదే ఆలోచన! మీకు బాసటగా ఎల్లప్పుడూ నిలచే అదృష్టం నాకు ప్రసాదించలేరా?" అన్నది వీణావని ముందుకొచ్చి.

గిత్తలు తలలాడించాయి - పట్టెడలో చిరుమువ్వలు గలగల మ్రోగాయి. ఆమె మీదనుండి తన తదేక దృష్టుల్ని మరలించుకుని "ఇదంతా ఏమిటో అయోమయంగా ఉంది. ముమ్మల్ని పరదా మాటున ఉంచి నాటకం ఆడిందన్నమాట చెల్లాయ్! ఏదీ ... అరే ... అంతలోనే ఎక్కడికి తుర్రుమంది?' అంటూ అటూ యిటూ చూశాడు

"నేను వస్తుండగానే వెళ్ళిపోయింది లెండి తెలివయిన పిల్ల! మీ పనికి అవరోధం కలిగించినందుకు మన్నించండి. ఒక్క విషయం. మీరు మనస్ఫూర్తిగా నన్నాదరించగలిగితేనే "ఊఁ" అనండి. బలవంతంలేదు. నేనుమాత్రం వ్యవసాయరంగానికే నా జీవితాన్ని అంకితమివ్వదలిచాను..." అంది దృఢంగా.

వేణు నేత్రాలు సంతృప్తిగా మెరిసాయి.

"లేదు వీణావనీ! మీలాంటి యువతి సాహచర్యమే నాకు మార్గాన్ని సుకరం చేస్తుంది. మీ హృదయం గుర్తించక తక్కువ అంచనా వేసుకున్నందుకు మన్నించండి. వస్తాను..." అంటూ ఉత్సాహంగా బండి ఎక్కి "ఎహేయ్... పదండి..." అన్నాడు. ఆ ఉత్సాహాన్ని అందిపుచ్చుకున్నట్లు ఆఘమేఘాలమీద పరుగులుపెట్టాయి గిత్తలు.

ధూళి మేఘంలో కరిగిపోతున్న బండికేసి తన్మయంగా, కనుమరుగయ్యే వరకూ చూస్తూ నిలుచుంది వీణావని.




"ఏరా రంగా అలా ఉన్నావేం?" ముని పంటితో బీడీని నొక్కిపట్టి అగ్గిపుల్ల గీస్తూ అడిగాడు నూటపది.

ఆ ప్రపంచం వేరు. అక్కడ మనుషులు స్థిరపడుతున్నకొద్దీ పేర్లకు బదులు అంకెల సంకేతాలే వాడబడతాయ్. ఆ ప్రపంచంలో అతను అందరికీ నూటపదిగానే పరిచితుడు.

నూటపది పలకరింపుకి బదులు చెప్పకుండా ఆకాశంలోకి చూస్తూ కూర్చుండిపోయాడు రంగడు. ఒంటరి మేఘ శకలాన్ని అట్టేసేపు చూడలేనట్లు - ఓ నిట్టూర్పు విడిచి దృష్టి మరల్చుకున్నాడు.

"నీ దిగులెందుకో నేను తెలుసుకోగలనులే."

ఈసారికూడా రంగడు మౌనంగానే ఉండిపోయాడు. అతని ముఖం విచారంగా ఉంది. చేతి కందుతున్న గడ్డి పోచలను త్రుంచి పోస్తున్నాడు ఏదో ఆలోచిస్తున్నట్లు కూర్చువి.

"ఉదయంనుంచీ నిన్నో కంట కనిపెడుతూనే వున్నాను. మొక్కలకి గొప్పులు తవ్వేటప్పుడూ, నీరు పెడుతున్నప్పుడూ పరధ్యానంగానే ఉన్నావు. పోలీసు చూడలేదు కనుక సరిపోయింది. లేకపోతే రెండు లాటీపోట్లుతగిలేవి. అదృష్టవంతుడివిలే..."

ఇంకా రంగ డేమీ అనకపోయేసరికి_ ఒక్కసారి నిశితంగా అతని ముఖంలోకి చూసేడు నూటపది. మరుక్షణం అతని మనసు రంగడిపై జాలితో నిండిపోయింది. గొంతునిండా అనునయాన్ని నింపుకుంటూ..."మనం బ్రతుకుతున్నది మామూలు ప్రపంచంలో కాదని మరచిపోకురా. ప్రపంచంలోని మరో ప్రపంచంలో బ్రతుకుతున్నాం మనం. ఇది చిత్రమైన ప్రపంచం. మనలాటివారి కోసం మనుషులు నిర్మించిన మరో ప్రపంచం. మరచిపోకు తమ్ముడూ!" అన్నాడు.

సానుభూతి, అనునయం, వైరాగ్యం, విషాదం_అన్నీ ముప్పిరిగొన్న నూట

పది మాటలకు చలించినట్లు తలఎత్తి చూసేడు రంగడు.

"ఎందుకురా అలా చూస్తావ్? తమ్ముడూ అని పిలిచాననా? నీ మనసు బాగులేక కానీ-తమ్ముడూ అంటే తప్పేమిటి? ఆ హక్కు నీ వొక్కడిదే కాదు. చిన్నవాడిని తమ్ముడనడంలో తప్పేమీ లేదు. ఆ మాటకువస్తే-యిక్కడున్నవాళ్ళందరూ నా తమ్ముళ్ళే కదరా?"

భరించలేనట్లు కళ్ళు మూసుకున్నాడు రంగడు. నూటపది మాటలు అతని మెదడుకి సూటిగా తగిలి-హృదయం ఆర్ద్రమౌతూ... జ్ఞాపకాల పొరలు విచ్చుకోసాగాయ్.

* * *

రంగడు జైలులోకి వచ్చిన కొద్ది నెలలకే...ఎవరో కొత్తవాడు వస్తున్నాడని అతన్నికూడా వెంటబెట్టుకు వెళ్ళారు తోటి ఖైదీలు. కొత్తవాళ్ళకి అటువంటి స్వాగతాలు చెప్తారు పాత ఖైదీలు.

"ఏ ఘనకార్యం చేసివచ్చావీ కటకటాల స్వర్గంలోకి?"

"నేరం చేయడానికుండే తెలివితేటలు తప్పించుకుందుకు లేకపోయాయా?"

"మే మిక్కడ స్వర్గసుఖా లనుభవించేస్తున్నామని - నువ్వు తయారయ్యేవా?"

కొత్తగా అడుగిడబోతున్నవాడు చిన్నవాడు. ముఖంచూస్తే తప్పుచేయగల సత్తావున్నట్లే కనిపించదు. లేతముఖం. జాలిపడుతూ చూస్తున్నాడు రంగడు.

నూటపది సానుభూతితో చూస్తున్నాడు కొత్తపక్షివంక.

వక్రమైనపలుకరింపులకీ, విచిత్రమైన స్వాగత సత్కారాలకీ తట్టుకోలేక దీనంగా నిలబడి పోయాడు కొత్తఖైదీ. ఈ క్షణమో మరుక్షణమో కన్నీరు కురిపించే సేటట్లున్నాయతని అమాయకపు కన్నులు.

మౌనంగా నిలుచున్న రంగడివంక - కాపాడమన్నట్లు ఆశగా చూశాడతను.

జాలిగా చూసేడు రంగడు.

ఖైదీల పరిహాసాలు పాగుతూనే ఉన్నాయ్.

"త... మ్ము... డూ..." అంటూ ముందడుగు వేశాడు రంగడు.

ఏ అనుబంధం ప్రేరేపించిందో - "అ... న్నా..." అంటూ రంగడి గుండెలమీదకు వాలిపోయాడు చిన్నవాడు.

నూటపది మినహా మిగిలిన ఖైదీలందరూ తెల్లబోయారు.

నూటపది - వారిద్దర్నీ ఒక్కసారి చూసి - చిరునవ్వు నవ్వాడు ఏదో అర్థమైనట్లు.

రంగడూ - అతనూ అన్నదమ్ములే అనుకుని విచిత్రంగా చూస్తున్నారు ఖైదీలు.

అంతకంటె విచిత్రం ...ఎక్కడా కాళీలేక రంగడి సింగిల్ సెల్ లో వేశారు కొత్తఖైదీని.

కొత్తరకం లెక్క చెబుతున్నా వేసుకోండి - విద్యార్థులు సమ్మె జరిపిన ప్రతిసారీ ఒక పోస్టాఫీసును తగులబెడితే మన ఊళ్లో ఉన్న పోస్టాఫీసులన్నీ ధ్వంసం కావడానికి ఎన్ని సమ్మెలు జరపాలి?




"నాకు తమ్ముడు లేడింతవరకూ. ఉన్నా నాకు తెలియదు. ఇకనుంచి నువ్వు నాతమ్ముడివి...." చేరదీశాడు రంగడు.

"అమ్మ చెప్పేది నాకన్నయ్య ఉండేవాడని. నే నెప్పుడూ చూడలేదు...." అతను రంగడి తమ్ముడిగా చేరిపోయాడు సెల్‌లో.

అక్కడున్న ఖైదీలందరిలోకీ చిన్నవాడతనే. కనుక కొద్ది కాలంలోనే అతన్నందరూ తమ్ముడనేవారు - గళ్ళ చొక్కామీద నంబరు స్ఫుటంగా కవిపిస్తున్నా.

అనుబంధం అంతకంతకూ పెరిగిపోసాగింది.

అన్నదమ్ములిద్దరిదీ ఒకటే జీవితం. రంగడికి తమ్ముడు; అతని కన్నయ్య - అలా స్థిరపడిపోయారు.

ఎంతమంచి తమ్ముడు! వెన్నలాటి

మనసు. వెన్నెలవంటి మనిషి. కల్లా కపటం తెలియనివాడు కనుకనే కట కటాలలోకి వచ్చాడు. వందమంది అప రాధులను విడచిపెట్టనైనా విడచి పెడు తుందికాని – ఒక్క నిరపరాధినీ శిక్షిం చదు న్యాయస్థానం–అన్నది శుద్ధ అబద్ధం. లేకపోతే తనకీ తమ్ముడికీ శిక్షేమిటి?

బ్రతుకు తెరవుకోసం చిన్న చిన్న దొంగతనాలు చేసేవాడతను. అదీ–చేసు కుందు కెక్కడా పనిదొరక్కపోతేనే. ఓరోజు దొంగతనానికి వెడితే – హత్యా నేరం రుద్ది – జైల్లోవేశారు. తను దొంగ అని నిజంగా కోర్టుకి తెలియదు. తను హంతకుడుకాదు. చేయని నేరానికి శిక్ష! తనసంగతి సరే. తమ్ముడు? పాలు కారుతున్న ముఖం – అమాయకపు కళ్లూ చూస్తేనే తెలుస్తుంది – నల్లనివన్నీ నీళ్లూ తెల్లనివన్నీ పాలూ అనికూడా పూర్తిగా తెలియని అమాయకుడని. అంత మెత్తని వాడిని దొంగనోట్లకేసులో యిరికించి శిక్షవేశాడు జడ్జి! ఎలా విధించగలిగారో తమ్ముడికి శిక్ష? జడ్జి.... యింకెవరు... వెంకటేశనే అయ్యుంటాడు. అతనైతే చెప్పేదేముంది? అప్పుడే రెండు హత్యలు చేసినట్లుంటుంది ముఖం. మంచీ చెడూ అవసరంలేనట్లు – నిజానిజాలతో ప్రమేయం లేనట్లు చింత నిప్పుల్లాటి కళ్ళు. వాటికితోడు మెలితిరిగిన మీసాలు. ఎంతలేసి శిక్షలు వేద్దామా అని కాచుకు కూర్చున్నట్లుంటాడు. అతన్ని చూస్తే న్యాయానికి దడ, ధర్మానికి భయం. జాలిలేనిగుండె. అయినా జడ్జిదేంతప్పు?

అంతా ప్లీడర్ల తికమక. జరిగిన దాని స్వరూపం మార్చేసి మరీ కాగితాలు పుట్టి స్తారు. ఒక నిజాన్ని కప్పిపుచ్చేందుకు వంద అబద్ధాలు. వాటిని నిజంలా నిరూ పించేందుకు వెయ్యి తప్పుడు రుజువులు. వీటన్నిటిమధ్యా నిజం కాస్తా నలిగి నాశన మౌతుంది. అయినా న్యాయస్థానానికి చెవులు తప్ప కళ్ళు ఉండవు. హృద యమూ ఉండదు. ఏ పక్షం ప్లీడరు తెలి వైన వాడైతే ఆ తరపున వస్తుంది తీర్పు.

తమ్ముడు ఎవరో యిచ్చిన దొంగ నోటు మార్చబోయాడట. కావచ్చు. మంచి మనిషికి వంచన తెలియదు. అది దొంగనోటేమో అన్న అనుమానం తమ్ముడివంటి మంచివాడికి రాదు. ఎవడో అమాయకుణ్ని చేసి తమ్ముడి కంటగట్టి వుంటాడు. నూటికీ కోటికీ ఒకడుంటా డేమో తమ్ము డంతటి మంచివాడు. తన కోసమే జరిగిందేమో అలా? తనకు తమ్ముడు దొరికాడు.

పధ్నాలుగోయేట – అల్లరి చిల్లరగా తిరుగుతూ యింట్లో వోట్లాడివచ్చేశాడు తను. ఉడుకురక్తంలో యుక్తాయుక్తాలు తెలియలేదు. కూలివాడిగా, రిక్షావాడిగా– చివరకు దొంగగా అవతారాలుమార్చాల్సి వచ్చింది బ్రతకడానికి. జైలులోకి వచ్చాడు హత్యానేరంపై. తన జీవితం తనకే రోత అనిపించసాగింది. ఎందుకీ బ్రతుకు? ఎవరికోసం?

ధ్యేయంలేని జీవితం; మమతా మమ కారాల మాధుర్యానికి నోచుకోని బ్రతుకు-విరక్తితో చావాలనిపించే ఆ రోజుల లోనే...తమ్ముడు దొరికాడు వరంలా. అతని నోట విన్న మాటలబట్టి ఇంకా తన తల్లి సజీవంగానేఉందనీ - అతను తన తమ్ముడే అనీ ఆశ కలిగింది.

జీవితంపై ఆశ! తమ్ముడి సాహచర్యంలో రోజులు తేలిగ్గా త్వరగా గడిచి పోయాయి. ఎన్నో రాత్రులు...చీకటి నిండిన సెల్‌లో భవిష్యత్తు గురించి బంగారు కలల కబుర్లు చెప్పుకుంటూ గడిపారిద్దరూ. తమ్ముడివల్ల తన బ్రతుక్కి అర్ధమూ పరమార్థమూ ఏర్పడ్డాయనిపించేది. తనని మనసారా ప్రేమించే మనిషొక డున్నాడు. అమాయకుడైన తమ్ముడి జీవితాన్ని తీర్చిదిద్దాలని కోరుకుంటూ విడుదలరోజు కెదురు చూసేవాడు.

తమ్ముడినీ తననూ విచిత్రంగా కలిపిన కాలచక్రమే మళ్ళీ విచిత్రంగా విడదీసిం దీనాడు. తమ్ముడు నిజంగా నేరస్థుడు కాదని-అధికారులు విడుదల చేసేశా రివాళ. తనను విడిచి వెళ్ళలేక వెళ్ళాడు తమ్ముడు. మళ్ళీ తామిద్దరూ కలుసుకోవాలంటే...కనీసం...రెండేళ్లు ...ఒక పగలు గడపడమే దుర్భరమై పోయింది. తమ్ముడు లేకుండా రెండేళ్లు! సాధ్యమేనా తనకి?

"పోయినోళ్ళందరూ మంచోళ్ళు. మనసు గట్టిచేసుకోరా రంగా. ఈ ప్రపంచంనుంచి వెళ్ళిపోయినవాళ్ళ గురించి విచారించకూడదు..." బీడీ పొగవదలుతూ అన్నాడు సూటపది.

"త...మ్ము...డు..." మెల్లగా గొణిగాడు రంగడు.

"నీ కంటె పెద్దోడినిరా. అనుభవం మీద చెబుతున్నాను ప్రపంచం మిథ్యరా. బ్రతుకు మాయ. ఏదీ శాశ్వతంకాదు. ప్రతీదీ భ్రమే. మమతలూ భ్రమతలేరా. అంతా మనం అనుకోవడంలోనే వుంది. అయినా జైలులో మనసులూ మమతలూ ఏమిట్రా? నాలుగురోజు లుండి పోయే భాగ్యానికి—వెళ్ళిపోయిన మనిషి కోసం అన్నం నీరూ మానుకుంటారా? ఆ మాటకొస్తే యిక్కడందరూ అన్నదమ్ములే కదురా!" నవ్వాడు సూటపది.

రంగడిలో ఏమార్పూ లేదు.

"ఓ శుభవార్త చెప్పడం మర్చి పోయానురా. ఉదయం వార్డెన్ గది కడుగుతూంటే పేపరు చదివాడతను. వారానికోసారో నెలకోసారో బయట నుంచి మన మనుషులని తెప్పించుకుని వాళ్ళు తేలిక చేసుకోనిస్తుందట ప్రభుత్వం. నాలాంటి ముసిలితొక్కు మాటకేం కాని—నీలాటివాళ్ళు ఎవర్తినో తెప్పించుకుని మజా చెయ్యొచ్చు. ఇక ఖైదీల పని కులాసాగా వుంటుంది. గవర్నమెంటూ మంచిదిలాగే కనిపిస్తోందిరా."

నిర్లిప్తంగా నవ్వాడు రంగడు.

"అవతల నా కెవరూ లేరు. తమ్ముడు తప్ప...."

తనమాట నమ్మలేదేమో అని అను మానంగా రంగడి వంక చూసేడు నూటపది.

నూటపది చెప్పింది నిజమే.

వార్డెన్ కున్న విచిత్రమైన అల వాట్లలో ఒక్కడూ ఉన్నా పదిమందికి వినపడేలా పేపరు చదవడం ఒకటి. అందులోనూ వార్త ఖైదీలకి సంబం ధించినది.

"ఖైదీలుకూడా మనుషులే. అన్నం, నీరూ, గాలీవలె స్త్రీ పురుష సాంగత్యం కూడా మానవుడి ముఖ్యావసరం. ప్రకృతి సహజమైన అవసరంనుంచి చిరకాలం వంచింపబడితే - ఆ మనిషి మానసిక ప్రవృత్తి విపరీత పరిణామా లకు లోనై - విడుదలానంతరం సాంఘిక వ్యవస్థలో యిముడలేని ప్రమాదముం దని-మనస్తత్వ శాస్త్రజ్ఞులు చేసిన సూచ నలను దృష్టిలో పెట్టుకుని - ఖైదీలకు క్రొత్త అవకాశాలు కలిగించేందుకు ప్రభుత్వం యోచిస్తూంది."

పేపరులోని వార్తను పదిమందికీ వినిపించాడు నూటపది. కొందరది విని అవకాశంకోసం ఆత్రుత పడ్డారుకూడా!

"ఇవాళ రాత్రి మాట్లాడుకుందుకు నీకు మనిషిలేడుకదూ? ఈ వొక్క రాత్రీ ఎలాగో గడుపు. రేపటి కెవరో ఒకరు రాకపోరు. జైలులో కాళీ ఖిగలద మేమిటీరోజుల్లో?" గట్టిగా నవ్వాడు నూటపది.

దూరంగా విజిల్ వినిపించింది.

ఖైదీలందరూ తమ గూళ్ళు చేరు కుంటున్నారు.

చీకటి పడుతోంది.

రంగడు లేచి నడవసాగాడు. అతను సెల్‌లో అడుగు పెట్టిన మరుక్షణం కవాటాలు మూసుకున్నాయ్. క్రమ క్రమంగా తాళాలగుత్తి చప్పుడు దూర మైంది.

ఆ రాతిగోడల నడుమ-రంగడి మన సులో మళ్ళీ అంతులేని చీకటి. భయం కరమైన నిశ్శబ్దం. అన్నిటికీ మించి బాధించే ఏకాంతం!

గతం క్రూరంగా వెక్కిరిస్తోంటే గోడకు జేరబడిపోయాడు రంగడు. జైలుగోడలు విచిత్రమైనవి. తమను నమ్ముకున్న మనిషికి స్నేహాన్నీ ధైర్యాన్నీ యివ్వగలవు. తమను నిర్ల క్ష్యం చేసే మనిషిపట్ల పగ తీర్చుకో గలవు. ఆ గోడలనడుమ - ఎండవేళ కూడా చల్లగా వుంటుంది. పగటిపూటా చీకటిగా వుంటుంది. సాధారణంగా అక్కడ చల్లని చీకటి ఉంటుంది. గతంలో తమను నిర్లక్ష్యంచేసినందుకు రంగడిపట్ల మౌనంగా కసితీర్చుకో సాగాయి. రాతిగోడలే నోరు విప్పగలి గితే-ఎన్ని విచిత్ర చరిత్రలు బయట పడేవో! ఆరాత్రి - రంగడికి కాళరాత్రే అయింది.




అటువంటి రాత్రులు ఏడు గడిచాయ్.

రోగులను చూసేందుకు వచ్చే డాక్టరు ప్రశ్నలకూ; తోటి ఖైదీల పలకరింపులకూ—మౌనమే సమాధానమైంది.

* * *

పనికట్టుకుని రంగడి సెల్‌కువచ్చాడు నూటపది ఓ మధ్యాహ్నం.

రంగడి భుజంమీద లాలనగా చెయ్యి వేసి—"ఇలా అయితే లాభంలేదు రంగా! నిన్ను చూస్తుంటే గుండె తరుక్కుపోతూంది. అన్నం తినవు, నీరు తాగవు, ముఖం పీక్కుపోయి — కళ్ళు లోపలికి పోయాయ్. ఇలా పస్తులుండి ఏం సాధిద్దామని?" అన్నాడు.

పెదవి కదపలేదు రంగడు. ఎక్కడో శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

నూటపది సామాన్యుడుకాడు. వాడుపు తెలిసిన మనిషి. ఖైదీల మనసులను అంచనా వేయడం అనుభవం నేర్పిన విద్య. అన్నిరకాల మనస్తత్వాలకీ మందు వేయగల తెలివి ఉన్నవాడు.

"పెదవి మెదిపి పలుకరా. నీ యెదురుగా నేనున్నాను. నీ బాధలో నన్నూ పాలు పంచుకోనీ. మనమూ మనమూ ఒక కుటుంబంలోనివాళ్ళం. మాటలలో సొద చెప్పుకుంటే మనసు తేలిక పడుతుంది. నాకంటె ఎవరున్నారు రంగా నీకిక్కడ?"

కనీసం అతని వైపయినా చూడలేదు రంగడు.

నూటపదికి కోపం రాలేదు. మరింత జాలి ముంచుకొచ్చిందతనిపై.

"నీ మనసు నాకు తెలుసురా. అందుకు ఉపాయం ఆలోచించే ఉంచాను..."

కొంచెం ఆగి అన్నాడు మాటపది - "నువ్వు తమ్ముడికోసం పడుతున్న బాధలో వెయ్యోవంతయినా నీ కోసం వాడు..."

కోపంతో రంగడి ముఖం జేవురించింది.

"మరి నిన్ను చూడ్డానికి ఒక్కసారీ రాలేదేం?" అడిగాడు మాటపది.

"అధికారులు రానివ్వొద్దూ?"

బిగ్గరగా నవ్వాడు మాటపది. "తల్లి పుట్టిల్లు మేనమామకి తెలీదూ? ఇది మన గూడురా. ఇక్కడుండేవాడికి దీని అనూపానూ తెలియకపోవు. నిన్ను చూడాలనే తహతహే వుంటే-యిక్కడి నుంచి వెళ్ళిన నీ తమ్ముడికి పద్ధతు లడ్డు పడతాయా? ఒరే రంగా, ఈ జైలొక ముసాఫిర్ ఖానారా. ఉన్నంత సేపే స్నేహాలూ మమతలూ. బయటపడితే... రంగురంగుల బ్రతుకులు. వాటిలోపడి... యీ గూడు మరచిపోతారు. అందరితో పాటే నీ తమ్ముడూ. ఇంకా వాడికోసం భ్రమపెట్టుకుంటావేం?"

"తమ్ముడిది దొరపుట్టుక. దొంగ బుద్ధులు వాడికి పడవు." కఠినంగా అన్నాడు రంగడు మాటపదివంక విశితంగా చూస్తూ.

ఆలోచనలోపడిపోయాడు మాటపది.

దేనిపట్ల అయినా మనిషి కాంక్ష విపరీతంగా పెరిగితే రెండే మార్గాలున్నా యతన్ని కాపాడటానికి. కోరిక తీర్చడం; లేదా విరక్తి కలిగించడం.

తమ్ముడిని చూడకుండా రంగ డిక ఆట్టేకాలం బ్రతకడని తేలిపోయాక రెండవపక్షం గురించి ఆలోచించ సాగేడు మాటపది.

కేవలం సీనియారిటీని బట్టేకాక-ఖైదీలకు పెద్దరికం వహించగలిగే నాయకుడి లక్షణాలు చాలా వున్నాయ్ మాటపదిలో. మిగిలినవారి బాగోగులు తనవిగా భావించుకుందు కలవాటు పడిపోయాడు మాటపది. ఆ జైలు తనగృహం. వచ్చి పోయే అతిథుల నాదరించవలసినవిధి తనది. ఆ భావం ఏనాటినుంచో స్థిరపడిపోయింది మాటపదిలో. ఎవరికే కష్టం వచ్చినా ఆదుకోవడం తనవిధిగా భావించుకోడం అలవాటై పోయింది. దానివలన అతనికి వొరిగేదేమీలేదు - తృప్తితప్ప. విడుదలచేసినా జైలువదిలి వెళ్ళనని ఖచ్చితంగా చెప్పేశాడు మాటపది ఏనాడో. జైలుని ఓకుటుంబం అనుకుంటే ఆ కుటుంబం మంచిచెడ్డలు చూసే గృహస్థు మాటపది.

"ఇంకా ఎన్నాళ్ళుండాలి నువ్వు?" అడిగాడు మాటపది.

"రెండేళ్లు." విరాళగా అన్నాడు రంగడు.

"జైలుగోడలు గెంతే ఓపికుంటే... ఈరాత్రే నువ్వు బయటపడగలవు..."

నమ్మలేనట్లు చూశాడు రంగడు. "అదంత సాధ్యమేమీకాదు -"

"ఈ యింట్లో ఉంటటమూ; యిక్కడి




నుంచి తప్పించుకోవడమూ నాకు తెలుసు." తూచి తూచి అన్నాడు నూటపది. "ఈరాత్రికి నీ ప్రయత్నాలలో నువ్వుండు, నాబాధేదో నేనుపడతాను."

"అంత సులభమైతే యిన్నాళ్లుగా ఎందుకున్నావిక్కడ ?"

"మమకారంరా. కొన్ని నెలలు కలిసి ఉన్నందుకే తమ్ముడికోసం తపించి పోతున్నావే. మరి నేనిక్కడకువచ్చి పదేళ్ళపైనే అయింది. మనిషికి మమత లుండేది మనుషులతోనే కాదురా. ఈ జైలుతో నాకెంత అనుబంధమని ? నా మనుషులూ, మమతలూ అన్నీ యిక్కడే. పొమ్మన్నా వదిలిపోలేను.

ఈరాత్రి నిన్ను బయటకు పంపుతాను కానీ పదికాలాలపాటు చల్లగావుండు. మరెప్పుడూ యిక్కడికి రాబోకు.'' వెళ్ళిపోయాడు నూటపది. మామూలుగానే కాలంగడిచింది. ఆరాత్రీ తెల్లవారింది. మరో రెండు రోజులుకూడా గడిచి పోయాయ్.

* * *

రంగడు తప్పించుకు పోవడంతో జైలు వాతావరణం మామూలుగా కంటె కొంచం భిన్నంగావుంది. డ్యూటీ పోలీస్ అప్రమత్తంగా డ్యూటీ నిర్వహిస్తున్నారు. వంటింటి కుందేలెక్కడికి పోతుంది తిరిగిరాక – అనుకుంటూ రంగడు పట్టుబడి వచ్చే క్షణంకోసం ఎదురుచూస్తున్నారు జైలు అధికారులు. మరెవరూ తప్పించుకు పోకుండా కట్టుదిట్టాలు చేస్తున్నారు.

వరండాచుట్టూ నలుగురు పోలీసులు

తుపాకీలతో నిలుచున్నారు. వరండాలో నిలబడీ కూర్చునీ అల్యూమినియం బొచ్చెలలో అన్నాలు తింటున్నారు ఖైదీలు రంగడి ఉదంతమే చెప్పు కుంటూ.

ఇంతలో ... నూటపది భుజంమీద పరిచితమైన చెయ్యిపడింది. వెనుదిరిగి చూసేడు.

తాగుతున్న మంచినీళ్ళగ్లాసు చేయి జారి రాతిగచ్చుమీదపడి దొర్లుతూ వింత శబ్దం చేసింది.

బాధగా జాలిగాచూసేడు నూటపది మళ్ళీ.

ఇద్దరు పోలీసులమధ్య తల వంచుకు నిలబడ్డాడు కొత్త ఖైదీ!

"అలవాటుపడ్డ ప్రాణం. కటకటాలు వదిలివెడితే తోచదు_" వికటంగా నవ్వు తున్నారు తీసుకొచ్చిన పోలీసులు.

"అసలు ... ఏం జరిగింది?" నీర సంగా జాలిగా అడిగాడు నూటపది.

"నిజంగానే యిక్కడి జీవితానికి పూర్తిగా అలవాటు పడిపోయానేమో! బయటకు వెళ్ళేసరికి_నీటినుంచి విసిరి వేయబడ్డ చేపలా ఉక్కిరిబిక్కిరై పోయాను. ఇక్కడి జీవితం నా ముఖం మీద స్థిరమైన ముద్రలు వేసిందేమో ప్రతివాళ్ళూ నా ముఖాన్ని పట్టిపట్టి చూసేవారే!

అక్కడ నాకెవరూ మిగలలేదు. ఒంటరిగా అంత స్వేచ్ఛ_భరించశక్యం కాలేదు. విశాల ప్రపంచం అంటారు కానీ అక్కడున్నంత సంకుచితం ఎక్కడా ఉండదు. ఎక్కడికెళ్ళినా విషపుచూపులు వళ్లు జలదరింపజేసేవి. ఓ వీధికుక్క మరో వీధిలోకి వెడితే అక్కడి కుక్క లన్నీ తరిమితరిమి వేటాడేటట్లు జైలు నుంచి బయటపడ్డ నన్నూ మనుషులందరూ మాటలతో, చూపులతో, చేతలతో వేటాడి వేధించారు. సర్కస్‌నుంచి తప్పిపోయిన పులిని వేటాడినట్లే వేటాడారు నన్ను ఎక్కడా నిలవనీయకుండా. అన్నీ చేదు అనుభవాలే ఎదురయ్యాయి. ఆ విశాల ప్రపంచంలో ఒంటరి జీవితం అసాధ్య మనిపించేసింది. అక్కడ బతకలేనని పూర్తిగా అర్థమైపోయింది.

నా మనుషులూ మమతలూ అన్నీ యిక్కడే వున్నాయి. మళ్ళీ రావద్దని నువ్వు చెప్పిన మాటలు మరిచిపోలేదు. కాని...అక్కడుండలేకపోయాను.

ఓ గుంపు కనిపించగా అక్కడికి నడి చాను. పక్కగా నిలుచున్నా డొకడు జేబునిండా నోట్ల కట్టలతో! దగ్గరలోనే ఎర్రటోపీ తచ్చాడుతూంది. ఆప్యాయంగా పలకరించా లనిపించింది. కాని ఏం సంబంధముంది నాకూ అతనికీ?

హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది. నాకు దొంగతనం చేతకాదు నిజానికి. పట్టుబడిపోవడం తప్పదని తెలుసు. అదే నాక్కావలసిందీ.

వెనుకగా వెళ్ళి నోట్ల జేబు మీద

చెయ్యి వేశాను. మరుక్షణం దొంగ దొంగ అంటూ కేకలు. ఎర్రటోపీ నన్ను పట్టుకుంది. లోలోపల ఆనందించాను.

ఆ ప్రపంచంలో అన్నీ పనులూ ఆలస్యమే. ఏవీ టైముప్రకారం జరగవు. ఇక్కడ మనమంతా రూలు ప్రకారం అన్నీ చేస్తాము. అక్కడేమో అందరూ రూలు తప్పించుకుందుకే చూస్తారు. పనులలో చురుకుదనమే ఉండదు. ఇక్కడికెంత త్వరగా వచ్చేస్తానా అని ఆత్రుతతో నేను ఎదురు చూస్తూంటే-ఆలస్యం చేసిచేసి చివర కివాళ పంపించారు జైలుకి.

రెండేళ్ళు శిక్ష! బలే బాగుందనుకున్నాను.

అన్నయ్యకికూడా యిక రెండేళ్ళే వుంది శిక్ష.

నేనూ అన్నయ్యా ఒక్కసారే విడుదలౌతాం. అన్నయ్య తోడుంటే ఆ ప్రపంచంలో బ్రతకగలనేమో!"

ఆగి—కళ్ళతో నలుమూలలా వెదుకుతున్నాడతను. ఎక్కడా కనిపించక పోవడంతో ఆత్రుతగా నూటపది ముఖంలోకి చూస్తూ "అన్నయ్యేడీ? అన్నా నికి రాలేదా?" అంటూ అడిగాడు.

నూటపదికి నోట మాటలేదు.

క్షమించరాని నేరం చేసినట్లు తలదించుకుని నిలబడిపోయాడు.

"అన్నయ్యకోసమే నే నిక్కడికి మళ్ళీ వచ్చానని నీకు తెలుసు. నీ కిక్కడ చాలా పలుకుబడి వుంది. నీ మాట ఎవరూ కాదనరు. మళ్ళీ నన్ను అన్నయ్య సెల్‌లో వేయిస్తావు కదూ?" ప్రార్థిస్తున్నాడు తమ్ముడు.

నూటపది కన్నులు నీటితో నిండిపోయాయ్.

"అన్నదమ్ము లిద్దరూ ఆ సెల్ కంట్రాక్టు తీసుకున్నట్లుంది. ఒకళ్ళు వెడితే మరొకళ్ళు. మొత్తానికి పైకి పోనివ్వరు..." వికటంగా నవ్వుతూ 'తమ్ముడి' చేయిపట్టుకుని రంగడు వదిలేసిన సెల్ వంక నడిపించసాగాడు పోలీసు.

"తమ్ముడొచ్చాడు మళ్ళీ..."

"పాతఖైదీ కొత్తగా వచ్చాడు..."

సెంట్రీ సెల్ తాళం తీస్తూంటే తెల్లబోయి చూసేడు తమ్ముడు.

"అ..న్న...య్యా..."

"మొన్ననే తప్పించుకుపోయాడు" సెల్‌లోకి నెట్టి తలుపుమూశాడు సెంట్రీ.

అక్కడ ... గుండెలనుకోసే చల్లదనం.

అక్కడ....మనసుని చిత్రవధచేసే ఏకాంతం

అక్కడ....స్మృతులను రేపి హృదయాన్ని కోతకోసే వాతావరణం.

అక్కడ...పట్టపగలు కూడా పగలాటి చీకటి.

వాటన్నిటిమధ్యా-రాతిగోడల నడుమ తమ్ముడు!

---

# మూడు లేఖలు

## 1

ప్రియమైన పరిమిత సంతానరావుగారికి,

నమస్సులు. ఇటీవల చాలాకాలం నుండి మీరు ఉత్తరాలు రాయటంలేదు. కారణం తెలియదు. ఈ శిష్య పిపీలిక మీద మీకు ఆగ్రహం కలిగిందా? మీ దగ్గరనుండి లేఖ రాకపోతే నాకు తెలుగు సినిమా కథానాయికలాగ "ఆదోలా" వుంటుంది. వెంటనే మీ క్షేమసమాచారం తిరుగుటపాలో తెలియచేయండి. మీ బరువూ మీ శ్రీమతి బరువూ దినదిన గంటగంట ప్రవర్థమానం అవాలని భగవంతుణ్ణి సదా ప్రార్థిస్తున్నాను. మీ ఇద్దరు పిల్లలూ కులాసా అని తలుస్తాను.

మీ

సదానందం సంజీవరావు.

## 2

డియర్ రావుజీ,

నమస్సులు. మీరు తేనెపూసి రాసిన ఉత్తరం అందింది. నా మీద మీ అపార వాత్సల్యానికి నేను ఎప్పుడూ కృతజ్ఞుణ్ణే. నా గదిలో మీ ఫొటో పెట్టుకుని ఖాదీ మాల వేసాను. (ఇది గాంధీ శతజయంతి సంవత్సరం కదా)

ఇవాళ పొద్దున్న మీ పేర ఒక రైల్వే పార్సిల్ పంపించాను. అది దయతో స్వీకరించండి. "నో" అంటే నేను ఇక్కడ మూర్ఛపడిపోతాను. అందులో సీతాఫలాలూ సపోటాలూ వున్నాయి. వెంటనే ఉత్తరం రాయండి.

మీ

శిష్యపరమాణువు

స. సం

## 3

గుగ్గురూజీ,

మీరు ప్రేమ చిప్పిలుతూ రాసిన ఉత్తరం అందింది. దానికి ఫ్రేముకట్టించి గోడకు కొట్టాను. వందలాదిజనం క్యూలో నిలబడి ఆ లేఖ చదివి అమందానంద కందళిత హృదయారవిందు లవుతున్నారు. ఏమి శైలి మీది! చాకులా బాకులా ఉంటాయి మీ భావాలు.

మీరు అన్యథా భావించకపోతే ఒక చిన్న రిక్వెస్టు. నా పుస్తకం ఫలానా పరిషత్తువారు మీకు బహుమతి నిర్ణయానికి పంపారని తెలిసింది. నన్ను డిసపాయింటు చేయకండి. నాకు బహుమతి రాకపోతే నా కంటె నా మిత్రులు ఎక్కువ బాధపడిపోతారు.

మీరూ మీ శ్రీమతీ హారిజాంటల్‌గా పెరగాలనికోరుతున్నాను. మీ పిల్లలు వర్టికల్‌గా పెంపొందాలని ప్రార్థిస్తున్నాను.

భవత్ విధేయుడు

సాహిత్య పిపీలిక బిరుదాంకిత

స॥ సం॥.

గోపాలచక్రవర్తి




బి.వి. చంద్రశేఖరమ్

సుశీల మొట్టమొదటిసారిగా వాళ్ళ మామయ్య వూరు చూడడానికి బయలు దేరింది. రైల్లో కూర్చుందే కానీ, ప్రయాణం చేస్తున్నంత సేపు అనేక ఆలోచనలతో కాలయాపన చేస్తూంది. 'మామయ్య'ని చూసి 10 ఏళ్ళయింది. అదే మొట్టమొదటిసారికూడా. సాధారణంగా వ్యవసాయం వదిలేసి ఏ వూరు బయలుదేరికాడు. కనీసం అమ్మ సొంత చెల్లెలు అయినప్పటికీ చూడడానికని వచ్చేవాడు కానేకాదు. వ్యవసాయం అంటే అంత ప్రాణం. అమ్మ సరేసరి. ఎప్పుడూ నాన్నగారు ఏ వూరు తీసికెళ్తే ఆ వూరే తప్ప ఇంక ఏ వూరూ చూసి ఎరుగదు. పెళ్ళయిన దగ్గరనుంచి కనీసం ఒకసారయినా పుట్టింటికి

వెళ్ళనే లేదట. ఎన్నోసార్లు ఆ మాట తనదగ్గర అనేది, ఎప్పుడైనా ఆ వూరు ఈ వూరు శలవులకి వెళ్ళొస్తానంటే. మామయ్యని 10 ఏళ్ళ క్రితం అంటే అప్పటికి 10 సంవత్సరాల వయస్సున్నప్పుడు చూడటం తటస్ధించింది. వున్న వారంరోజుల్లోనూ మామయ్య ఆప్యాయత తనని చాలా ఆకర్షించింది. అందుకనే మామయ్య అంటే చాలా గౌరవం పెరిగింది. 10 రోజులు శలవులు గనక మామయ్యని చూడాలనిపించి ప్రయాణమయ్యింది తను. బయలుదేరే ముందర స్నేహితులు చాలా మంది 'సుశీ ఆ పల్లెటూరి కెళ్ళితే ఏం తోస్తుందే నీకు. సరదాగా అలా ఏ కాశ్మీర్‌కో, ఊటీకో పిక్నిక్ వేసుకుందాం! ఆగిపో' అన్నారు కానీ తను ససేమిరా ఒప్పుకోలేదు. ఎందుకో తనకి మామయ్యని చూడాలనిపించింది. అమ్మకూడా '10 ఏళ్ళనించి లేనిప్రేమ నీకు ఇప్పుడు మామయ్య మీద పుట్టుకొచ్చిం దేమిటి?' అంటూ నిలదీసి అడిగింది. ఏమయినా సరే అని పట్టుబట్టి బయలుదేరింది.

ఏమీతోచక అటూఇటూ చూసింది ఎవరితోనైనా మాట్లాడుతూ కాలక్షేపం చేద్దామని. కానీ తనతో మాట్లాడడానికి ఎవరికీ ఖాళీ లేదన్నట్లు ఎవరిపనుల్లోవా రుండిపోయారు. ఏ థర్డు క్లాసులో ప్రయాణం చేసినా కాలక్షేపం ఐపోయేది. అనవసరంగా ఫస్టుక్లాసులో కూర్చున్నాను అనుకుంది. నిజంగా స్నేహితులతో ఏ కాశ్మీరుకో వెళ్ళివుంటే చాలా సరదాగా కాలయాపన జరిగిపోను అని అనుకుంటూ విసుగ్గా కిటికీల్లోంచి బయటకు చూడసాగింది. ఎంత సేపూ పచ్చని పొలాలూ, దూరంగా కొండలు, టెలిగ్రాఫ్ స్తంభాలు తప్ప ఏమీ కనబడక పోవడంతో చిరాకు పడసాగింది. ఇదంతా చూసి ఈ కాలేజీ అమ్మాయిలు ఒంటరిగా ప్రయాణం చేస్తూంటే ఇలాగే వుంటుందిలే అనుకుంటూ అప్పుడే పేపరు మడిచి ఎదురుగ్గా కూర్చున్న ఒక తాతగారు "ఏ మమ్మాయీ ఎంత వరకూ వెళ్ళాలి" అని అడిగేరు.

అమ్మయ్య కాలక్షేపానికి ఎవరో ఒకరు దొరికారు అనుకుంటూ "నూజివీడు వెళ్ళాలండి" అంది.

"అలాగా! అదిసరే ఒక్కర్తివే వెళుతున్నట్టున్నావు. అసలే స్టేషన్‌కి వూరు చాలా దూరంలోవుంది! ఒక్కదానివే వెళ్ళగలవా."

"నేను ఇదే మొదటిసారి ఆ వూరు వెళ్ళడం. మా మామయ్య స్టేషనుకి వస్తారండీ...ఏం పర్వాలేదు...ఏకొచ్చీ మా మామయ్యే నన్ను చూసి గుర్తుపట్టాలండీ."

తాతగారు ఆశ్చర్యంగా "అదేమిటి మీ మామయ్యని నువ్వు గుర్తుపట్టలేక పోవడ మేమిటి?"

"అదికాదండీ. నేను మా మామ




య్యని చూసి 10 ఏళ్ళయ్యింది. సరిగ్గా గుర్తుపట్టలేనేమో? చాలా చిన్నప్పుడు చూశాను."

"నువ్వే గుర్తుపట్టలేకపోతే నిన్ను చిన్నప్పుడు చూసిన మీ మామయ్యగారు మాత్రం గుర్తు పడతారని ధైర్యం ఏమిటి?''

"అందుకనే కదండీ నా ఫోటో మా మామయ్యకి పంపేను. అదిచూసి నన్ను తేలిగ్గా గుర్తుపట్టగలరు," అంది.

ఇలా సంభాషణ సాగిస్తుండగా రైలు నూజివీడు జేరింది. 'అమ్మయ్య' అనుకుంటూ తాతగారికి 'వెళ్ళొస్తానండీ' అని చెప్పేసి సూటుకేసు తీసుకుని తలుపు దగ్గరనిలబడి మామయ్యగురించి ప్లాట్ఫారం అంతా కలయజూసింది. జనం చాలా పల్చగా కన్పించసాగారు. ఎక్కడా మామయ్య వచ్చిన జాడ కనిపించలేదు. వుత్తరం పదిరోజుల ముందర రాసినా మామయ్య రాకపోవడంలో ఉద్దేశమేమిటీ అని కోపంతో మామయ్యని తిట్టుకుంటూ ప్లాట్ఫారం బాగా క్రిందకు వుందనే సంగతి గ్రహించకుండా మామూలుగా దిగబోయి పడిపోతుండగా ఒక ఆగంతకుడు హఠాత్తుగా పట్టుకోవడంతో సురక్షితంగా కిందకు దిగగలిగింది. ఎవరు చెప్మా ఇంత అందంగా వున్నాడు అని తేరిపార చూసి, ఛీఛీ ఈ పల్లెటూరి మొద్దుని చూసి తన్మయం చెందడం ఏమిటీ? అనుకుంటూ సుశీల అతన్ని విదిలించుకుని పక్కగా నిలబడి పమిట సర్దుకోసాగింది.

ఆ ఆగంతకుడు తన తప్పేమీ

లేదన్నట్లు "అదే టండమ్మాయిగారూ! కాసంత చూసుకు దిగ్గోదదా యేటి?" అని అడిగేడు.

సుశీల కంగారుగా "పొరపాటయింది. అయినా కానీ ఇంతకిందకి ఉందేమిటీ ఈ వూళ్ళో ప్లాట్ ఫారం" అని అడిగింది.

"భలే మంచోరే. మాది సిన్నూరు గన్క శానా కిందికి వుంద. మాదీ మీకు మల్లే పెద్దూరయితే పైకే వుండును."

"అదిసరే! మాది పెద్ద వూరంటున్నావు! నీ కెలా తెలుసు" అని నిలేసి అడిగింది.

"ఇది శానాబాగుంది. మీ యవ్వారం సూస్తుంటే మిది పెద్దూ రనిపించింది. ఇందులో తెలిసేదానికి పెద్ద యిశేస మేటుందమ్మాయిగారూ."

ఈ ఆగంతకునితో తన కేమిటిలే అనుకుని ప్లాట్ ఫారం అంతా మళ్ళీ తేరిపార మూడడం మొదలెట్టింది, ఎక్కడైనా మామయ్య వస్తున్న జాడ అగుపిస్తుందేమోనని. సుశీల పడుతున్న అవస్థచూసి, ఆ ఆగంతకుడు :

"ఓటమ్మాయిగారూ! ఓరిగురించి సూస్తుండారు," అని అడిగేడు.

అసలే తను మామయ్య రాలేదని విసుగులో వుందేమో "నే నెవరిగురించి చూస్తే నీ కెందుకు. నీ పని నువ్వు చూసుకో" అని కోపంగా అనేసింది.

"సర్లెండమ్మాయి గోరూ? యింతకీ మీ పేరు సుశీలమ్మ గోరేనా" అని అడిగేడు.

సుశీల కుతూహలంలో "అవును. నీ కెలా తెలుసు! నువ్వెవరు?" అంటూ నిలదీసి అడిగింది.

"అట్లా సెప్పండి. మీరే నన్నమాట సుశీ లమ్మగోరు. రండి నన్ను మీ మామయ్యగో రంపేరు. ఆయనిక్కా పొలం పనుండడంవలన రాలేకపోయి నన్నంపేరు."

"మరి యిందాకటినుంచి ఎందుకు చెప్పలేదు" అంటూ విసుక్కుంది.

"ఏదండమ్మాయిగోరూ మీరు సెప్పవి స్తేకదా!"

సుశీల ఆ ఆగంతకునికేసి తేరిపార జూసింది. మొహంచూస్తే చాలా అందగాడులా అగుపించేడు. కానీ నెత్తిన తలపాగా, పంచకట్టు, గళ్ళచొక్కా ఇవన్నీ చూసి పొలంలో రైతు ఐవుంటాడులే అనుకుంది. మామయ్య మీద చాలా కోపం వచ్చేసింది. అంతదూరంనించి తను వస్తూంటే, స్టేషనుకైనా రాకుండా పాలేరుని పంపినందుకు. ఆ కోపంలో అనవసరంగా ఈ వూరు వచ్చేను. హాయిగా తన స్నేహితులందరూ ఎక్కడికో పిక్నిక్ లకూ, షికార్లకూ వెళ్ళి కాలక్షేపం చేస్తూంటారు. నేనుకూడా ఇక్కడకు రాకపోతే వాళ్ళతో సరదాగా గడిపేదానిని కదా, అనుకుంటూ బాధ పడసాగింది.

"నడండమ్మాయిగోరూ" అంటూ ఆ ఆగంతకుడు అనేటప్పటికి, ఆలోచనలకి స్వస్తిచెప్పి, సూట్ కేస్ అతనికిచ్చి బయలుదేరింది స్టేషన్‌లోంచి.

ఇద్దరూ కలిసి బయటకు వచ్చేరు. ఎదురుగ్గా గుఱ్ఱబ్బండి కనబడింది. సుశీల కంగారుగా "ఏమిటీ ఇప్పుడు నువ్వు నన్ను గుఱ్ఱబ్బండిలో తీసుకెళతావా" అని అడిగింది.

"అవునండి."

"ఏం! మామయ్య కారు పంపలేదా?"

"ఇది శానా సిత్రంగా వుందండి. మామయ్యగోరికి కారు నేదుకదండీ! ఓరిదైనా తీసుకునేదానికి ఓరిదీ ఖాళీ నేదండి. అందుకనే గుఱ్ఱబ్బండి తీసుకెళ్ళమని సెప్పేరు. పాతబండి, ముసలి గుఱ్ఱం అని నన్ను టేషనుకి బండితీసుకెళ్ళమన్నారు. ఇంకోడయితే బండి సరింగా నడపలేడని."

"చచ్చానురా బాబూ! ఇప్పుడు ఈ గుఱ్ఱబ్బండిలో కూర్చుని లేనిపోని కష్టాలుపడాలి. ఒకటా రెండా, 5 మైళ్లు ప్రయాణం చెయ్యాలి" అని భయపడుతూండగా ఎదురుగుండా ఒక కారు కనిపించింది. అమ్మయ్య అనుకుని ఆ ఆగంతకునితో: "ఆ కారుగలాయనెవరో ఆయనతో మాట్లాడి రా. ఆ కారులో హాయిగా ఏ కష్టం లేకుండా వెళ్ళవచ్చును" అంది.

"అమ్మబాబోయి! ఇప్పుడు మావూరికి మినిష్టరుగా రొస్తున్నారు. ఆయన గురించి యీ కారొచ్చింది. అయినాకానీ, ఏటమ్మాయిగోరూ! బండిలో పోదాం పదండి. యిప్పటికే శానా ఆలస్యమయిపోయింది. ఆలిసమయితే మీ మామయ్యగోరికి కోపమొస్తుంది" అంటూ విసుక్కున్నాడు.

ఇంక ఈబాధ తప్పదురా అనుకుంటూ, తను ఈ వూరికని బయలుదేరి రావడం తనదేతప్పని తిట్టుకుంటూ చేసేదిలేక బండిఎక్కి కూర్చుంది. ఏదో విధంగా ఇంక ఈ ఆగంతకునితో సంభాషణ మొదలెట్టి కాలక్షేపం చేయాలి ఇల్లు జేరేంతవరకూ అనుకుని "ఇంతకీ నీపేరేమిటన్నావు?" అని అడిగింది.

"నేనేటీ అనలేదండి" అన్నాడు.

"చాలా ఘటికుడవే! నీపేరేమిటి?" అని అడిగింది.

"రాజంటారండీ!"

"ఎంతవరకు చదువుకున్నావు?"

"ఏటో వానాకాలం సదువండి! నాల్గువరకు సదివేనండి." ఇలా అనేక ప్రశ్నలు వేసి సంభాషణచేస్తూండగా, కొంతదూరం వెళ్ళేటప్పటికి రాజు గుఱ్ఱాన్ని ఒక చెట్టుక్రింద ఆపుచేశాడు. సుశీల కంగారుగా "ఏమిటి ఇక్కడ ఆపుచేసేవు" అంది.

"ముసలిగుఱ్ఱం కదండి. అలిసిపోయింది. కొంత ఆయాసం తీరిం తర్వాత మళ్ళీ బయల్దేరుద్దిలెండి"

అన్నాడు రాజు. సుశీల ఈ ప్రయాణంతో టి అలిసిపోయి, విసుగెత్తి, ఇంక లాభం లేదు నోరుమూసుకుని పడుండడమే మేలని కళ్ళుమూసుకుంది కళ్ళు మూసుకున్న దేకానీ ఆలోచనంతా రాజుగురించే- ఇంత అందగాడు పొలంపని చేయట మేమిటాఅని. చూస్తూంటే జమిందారులా వున్నాడు. కానీ వేషం, భాష చూస్తూంటే అలా అనిపించటంలేదు.

పదినిముషాలు పోయినతర్వాత బండి బయలుదేరింది. రాజు "మీకేం అభ్యంతరం లేకపోతే ఒక సిగరెట్టు కాల్చుకుంటానండీ" అన్నాడు.

సుశీల చిరాకుగా 'సర్లే' అంటూ అతని చేతిలోని సిగిరెట్ పేకెట్ చూసింది. ఎందుకో అనుమానమేసి "నేనొక ప్రశ్న అడుగుతాను నిజం చెబుతావా!" అంది.

రాజుకు మనసులో బిక్కు బిక్కుమంటున్నా "సెప్పండమ్మాయిగోరూ" అన్నాడు.

"నువ్వు ఏసగా మాట్లాడడం మానేసి మామూలుగా మాట్లాడు. తర్వాత నాప్రశ్నకి సమాధాన మిద్దువుగాని" అంది.

"అదేటండీ, మా భాసే అట్లాగుంటుంది"

"అది నీభాషకాదు! నువ్వు కేవలం అలా నటిస్తున్నావు! నిజంచెప్పు! నువ్వు ఎవరు? నాగురించి నీకెలా తెలిసింది! నిజంగా మామయ్య నిన్ను పంపేరా?" అంటూ నిలదీసి అడిగింది.

రాజు అమాయకంగా మొహంపెట్టి "ఏటండీ! మీరు నేనుసెప్పింది ఎందుకని నమ్మరు" అని అడిగేడు.

"నిన్ను ఇంకానమ్మితే నేను గోతిలో పడతాను! నీనిజస్వరూపం బయట పడేంతవరకూ నేను ఇక్కడనుంచి కదలను" అంటూ బండిలోంచి దిగిపోయింది.

రాజు తనని ఎలాగ కనిపెట్టిందా అని ఆశ్చర్యపోయి, "సుశీలాదేవిగారూ! మీరనుకున్నదంతా నిజమే! కానీ నాకు ఒక్క విషయం చెప్పండి. మీరు నన్ను ఎలా అనుమానించేరు?"

సుశీల తనేదో గొప్ప డిటెక్షన్ చేసినట్లు సంతోషపడుతూ "నటన అనేది ఒక కళ. అది ప్రతీవాళ్ళకీ అబ్బదు. చేతకానివాడు నటిస్తే అది బయటపడుతుంది. మిమ్మల్ని అనుమానించడానికి కారణం మీ సిగరెట్లు, మీ చేతులు. సాధారణంగా పొలంలో రైతులు చుట్టలు ఎక్కువగా వాడుతూంటారు. సిగరెట్లు వాడినా మీరు కాలుస్తున్నంత ఖరీదయిన సిగరెట్లు కాల్చరు. ఇహపోతే మీ చేతులు పొలం పనిచేసే వాళ్ళ చేతులంత మొరటుగా లేవు. చాలా సున్నితంగా వున్నాయి. దాన్నిబట్టి మీరు పాలేరుకాదని ఋజువు చెయ్యొచ్చు. అదీ కాకుండా మీరుమాట్లాడే

"నడండమ్మాయిగోరూ" అంటూ ఆ ఆగంతకుడు అనేటప్పటికి, ఆలోచనలకి స్వస్తిచెప్పి, సూట్ కేస్ అతనికిచ్చి బయలుదేరింది స్టేషన్ లోంచి.

ఇద్దరూ కలిసి బయటకు వచ్చేరు. ఎదురుగ్గా గుఱ్ఱబ్బండి కనబడింది. సుశీల కంగారుగా "ఏమిటీ ఇప్పుడు నువ్వు నన్ను గుఱ్ఱబ్బండిలో తీసుకెళతావా" అని ఆడిగింది.

"అవునండి."

"ఏం! మామయ్య కారు పంపలేదా?"

"ఇది శానా సిత్రంగా వుందండి. మామయ్యగోరికి కారు నేదుకదండీ! ఓరిదైనా తీసుకునేదానికి ఓరిదీ ఖాళీ నేదండి. అందుకనే గుఱ్ఱబ్బండి తీసుకెళ్ళమని సెప్పేరు. పాతబండి, ముసలి గుఱ్ఱం అని నన్ను టేషనుకి బండితీసుకెళ్ళమన్నారు. ఇంకోదయితే బండి సరింగా నడపలేడని."

"చచ్చానురా బాబూ! ఇప్పుడు ఈ గుఱ్ఱబ్బండిలో కూర్చుని లేనిపోని కష్టాలుపడాలి. ఒకటా రెండా, 5 మైళ్ళ ప్రయాణం చెయ్యాలి" అని భయపడుతూండగా ఎదురుగుండా ఒక కారు కనిపించింది. అమ్మయ్య అనుకుని ఆ ఆగంతకునితో: "ఆ కారుగలాయనెవరో ఆయనతో మాట్లాడి రా. ఆ కారులో హాయిగా ఏ కష్టం లేకుండా వెళ్ళవచ్చును" అంది.

"అమ్మబాబోయి! ఇప్పుడు మావూరికి మినిష్టరుగా రొస్తున్నారు. ఆయన గురించి యీ కారొచ్చింది. అయినాకానీ, ఏటమ్మాయిగోరూ! బండిలో పోదాం పదండి. యిప్పటికే శానా టేమయిపోయింది. ఆలిసమయితే మీ మామయ్యగోరికి కోపమొస్తుంది" అంటూ విసుక్కున్నాడు.

ఇంక ఈబాధ తప్పదురా అనుకుంటూ, తను ఈ వూరికని బయలుదేరి రావడం తనదే తప్పని తిట్టుకుంటూ చేసేదిలేక బండిఎక్కి కూర్చుంది. ఏదో విధంగా ఇంక ఈ ఆగంతకునితో సంభాషణ మొదలెట్టి కాలక్షేపం చేయాలి ఇల్లు జేరేంతవరకూ అనుకుని "ఇంతకీ నీపేరేమిటన్నావు?" అని అడిగింది.

"నేనేటీ అనలేదండి" అన్నాడు.

"చాలా ఘటికుడవే! నీపేరేమిటి?" అని అడిగింది.

"రాజంటారండీ!"

"ఎంతవరకు చదువుకున్నావు?"

"ఏటో వానాకాలం సదువండి! నాల్గవరకు సదివేనండి." ఇలా అనేక ప్రశ్నలు వేసి సంభాషణచేస్తూండగా, కొంతదూరం వెళ్ళేటప్పటికి రాజు గుఱ్ఱాన్ని ఒక చెట్టుక్రింద ఆపుచేశాడు. సుశీల కంగారుగా "ఏమిటి ఇక్కడ ఆపుచేసేవు" అంది.

"ముసలిగుఱ్ఱం కదండి. అలిసిపోయింది. కొంత ఆయాసం తీరింతర్వాత మళ్ళీ బయల్దేరుద్దిలెండి"

అన్నాడు రాజు. సుశీల ఈ ప్రయాణంతో టి అలిసిపోయి, విసుగెత్తి, ఇంక లాభం లేదు నోరుమూసుకుని పడుండడమే మేలని కళ్ళుమూసుకుంది కళ్ళు మూసుకున్న దేకానీ ఆలోచనంతా రాజుగురించే– ఇంత అందగాడు పొలంపని చేయట మేమిటా అని. చూస్తూంటే జమి.దారులా వున్నాడు. కానీ వేషం, భాష చూస్తూంటే అలా అనిపించట.లేదు.

పదినిముషాలు పోయినతర్వాత బండి బయలుదేరింది. రాజు "మీకేం అభ్యంతరం లేకపోతే ఒక సిగరెట్టు కాల్చుకుంటానండీ" అన్నాడు.

సుశీల చిరాకుగా 'సర్లే' అంటూ అతని చేతిలోని సిగిరెట్ పేకెట్ చూసింది. ఎందుకో అనుమానమేసి "నేనొక ప్రశ్న అడుగుతాను నిజం చెబుతావా!" అంది.

రాజుకు మనసులో బిక్కు బిక్కుమంటున్నా "సెప్పం డమ్మాయిగోరూ'' అన్నాడు.

"నువ్వు ఏసగా మాట్లాడడం మానేసి మామూలుగా మాట్లాడు. తర్వాత నాప్రశ్నకి సమాధాన మిద్దువుగాని" అంది.

"అదేటండీ, మా భాసే అట్లాగుంటుంది"

"అది నీభాషకాదు! నువ్వు కేవలం అలా నటిస్తున్నావు! నిజంచెప్పు! నువ్వు ఎవరు? నాగురించి నీకెలా తెలిసింది! నిజంగా మామయ్య నిన్ను పంపేరా?'' అంటూ నిలదీసి అడిగింది.

రాజు అమాయకంగా మొహంపెట్టి "ఏటండీ! మీరు నేనుసెప్పేంది ఎందుకని నమ్మరు" అని అడిగేడు.

"నిన్ను ఇంకానమ్మితే నేను గోతిలో పడతాను! నీనిజస్వరూపం బయట పడేంతవరకూ నేను ఇక్కడనుంచి కదలను" అంటూ బండిలోంచి దిగి పోయింది.

రాజు తనని ఎలాగ కనిపెట్టిందా అని ఆశ్చర్యపోయి, "సుశీలాదేవిగారూ! మీరనుకున్నదంతా నిజమే! కానీ నాకు ఒక్క విషయం చెప్పండి. మీరు నన్ను ఎలా అనుమానించేరు?"

సుశీల తనేదో గొప్ప డిటెక్షన్ చేసినట్లు సంతోషపడుతూ "నటన అనేది ఒక కళ. అది ప్రతీవాళ్ళకీ అబ్బదు. చేతకానివాడు నటిస్తే అది బయటపడుతుంది. మిమ్మల్ని అనుమానించడానికి కారణం మీ సిగరెట్లు, మీ చేతులు. సాధారణంగా పొలంలో రైతులు చుట్టలు ఎక్కువగా వాడుతూంటారు సిగరెట్లు వాడినా మీరు కాలుస్తున్నంత ఖరీదయిన సిగరెట్లు కాల్చరు. ఇహపోతే మీ చేతులు పొలం పనిచేసే వాళ్ళ చేతులంత మొరటుగా లేవు. చాలా సున్నితంగా వున్నాయి. దాన్నిబట్టి మీరు పాలేరుకాదని ఋజువు చెయ్యొచ్చు. అదీ కాకుండా మీరుమాట్లాడే




"అదికాదండీ! ఆ అమ్మాయికింకా తెలియదు."

"ఓహో అయితే వన్‌వే ట్రాఫిక్ అన్నమాట!"

"కరెక్ట్. ఆ అమ్మాయి తెలుసుకుంటుందేమోనని చాలా ప్రయత్నాలు చేసేను. కానీ ఏకోశానా ఆ అమ్మాయి నన్ను ప్రేమిస్తున్న సూచనలు కనిపించటంలేదు."

"ఓహో! అలాగా! అయినా ఆ అమ్మాయికి ఇష్టంలేనప్పుడు మీరు మాత్రం ప్రేమించడం ఎందుకు చెప్పండి? మీరు ఆ అమ్మాయిని ప్రేమించడం మానేసి మీతల్లి తండ్రులకి వదిలెయ్యండి ఆ భారం! వాళ్ళే మంచి పిల్లని ఏరిపెడతారు!"

"అదే శరణ్యంలా అనిపిస్తోందండి" అంటూ నసిగాడు. వీళ్ళిద్దరూ సంభాషణ సాగిస్తూండగా బండి వూళ్ళోకి ప్రవేశించింది. దారిలో కొంతమంది వీళ్ళిద్దరిని చూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు. సుశీలకిది ఆశ్చర్యం వేసింది. "ఏమిటీ! వీళ్ళేదో ముక్కున వేలేసుకుని విడ్డూరంగా చూస్తే ఏమైనా అర్థముండును, నవ్వడమేమిటీ అనుకుంది. మళ్ళీ "ఆఁ ఇంతేలే ఇలాంటి వూళ్ళలో ఇలానేవుంటారు." అని తనని తాను సంబాళించుకుంది. ఇంతలో బండి ఆగినట్లయి ఆలోచనలకి

స్వస్తిచెప్పి కిందకుదిగింది. రాజు "లోపలికివెళ్ళండి! మామయ్యగారు మీగురించి లోపల ఎదురుచూస్తుంటారు" అనేసి లోపలినుంచి పనివాడినిపిల్చి సామాను లోపలపెట్టమని తనుకూడా సుశీల ననుసరించేడు.

"ఏమమ్మా! ప్రయాణం సుఖంగా సాగిందా" అంటూ సుశీలమామయ్య ఎదురొచ్చేరు

"బాగానే జరిగింది మామయ్యా!" అంటూ సుశీల ఆయనకాళ్ళకి నమస్కారం చేసింది. మామయ్య అప్పటికీ ఇప్పటికీ ఒకే మాదిరిగా వున్నాడు, ఏం మారలేదు అనుకుంది మనసులో.

వీళ్ళిద్దరిమధ్య నేనెందుకులే అనుకుని "నే వెళ్ళొస్తానండీ" అన్నాడు రాజు.

"అదేమిటోయ్! అంతదూరంనించి తీసుకొచ్చేవు. భోజనంచేసి వెళ్ళు" అన్నారు పరంధామయ్యగారు.

"అల్పే మళ్ళీసారి వచ్చినపుడు చేస్తానండి" అంటూ సుశీలదగ్గర, పరంధామయ్యగారివద్ద శలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

సుశీల అతను వెళ్ళిపోయినవైపు తదేకంగా చూస్తూండడం గ్రహించి పరంధామయ్యగారు "ఏమమ్మా! ఇంత లేటయ్యింది; ట్రైన్ లేటయ్యిందా"? అని అడిగేరు.

"లేదు మామయ్యా! ట్రైన్ టయిముకే వచ్చింది. గుర్రబ్బండిలో రావడంవలన లేటయ్యింది" అంది.

పరంధామయ్యగారు ఆశ్చర్యంగా "ఏమిటీ గుర్రబ్బండిలో తీసుకొచ్చాడా! నేను కారిచ్చి పంపేనుగదా!" అన్నారు.

సుశీల "నాకేంతెల్సు! నీకసలు కారే లేదుటకదా!" అంది.

"సర్లే! ఆసంగతి నేను తేలుస్తాను. నువ్వువెళ్ళి స్నానంచేసిరా అమ్మా!" అన్నారు పరంధామయ్యగారు.

ఆరాత్రి భోజనాలదగ్గర పరంధామయ్యగారు "ఏమమ్మా! వూళ్ళో అంతా కులాసాగావున్నారా!" అన్నారు.

"అంతా బాగానేవున్నారు మామయ్యా!"

"అదిసరే! ఇంతకీ పెళ్ళిభోజనం ఎప్పుడు పెట్టిస్తావు!"

"పో మామయ్యా!" అంది సిగ్గుపడుతూ.

"పోఅంటే ఎలాగ!" నీకు మంచి సంబంధం చూసివుంచాను ఇక్కడ! అందుకనే మీఅమ్మకి వ్రాశాను ఇంతలో నువ్వు నీఅంతట ఇక్కడకి ప్రయాణం అవడం, పెళ్ళిచూపులుకూడా మాకు తెలీకుండా దారిలోనే జరిపేసుకోడం అన్నీ అయ్యాయి

సరే శుభస్య శీఘ్రం అని మీ నాన్నకి ఉత్తరం రాస్తాను..."






నీలిరంగు సిల్కు పాంటు, టకప్ చేసిన తెల్లని సిల్కు షర్టు. నడుముకు తెల్లని వైరుతో చేయబడిన బెల్టు! మెడనుంచి నీలిరంగు టై! నల్లగా నిగనిగ లాడుతున్న బూటు! తలకు చిన్నటోపి! ఇది రవిబాబు ముస్తాబు! తాతయ్య గదిలోకి వచ్చేడు ఠీవిగా చేతులూపుకుంటూ! ముందు గదిలో వాలుకుర్చీలో పడుకుని రామదాసు కీర్తనలు పాడుకుంటున్న తాతయ్యని పల్కరిస్తూ —

"తాతయ్యా! నా డ్రస్సు ఎలావుంది? ఇటుచూడు." రవి తాతయ్య చేతులుపట్టి గుంజుతూ ఉత్సాహంగా ఎంత ఠీవిగా వచ్చాడో, అంత ఠీవిగానూ అడిగేడు.

---

కుమారి ఎ. రంగనాయకి

---

బుల్లిసైజు దొరలావుంది. ముద్దులు మూటగట్టుతున్న మనుమడిని చూసే సరికి - తాతయ్యగుండెలు ప్రేమతో పొంగేయి.

"చాలా బాగున్నాయి! బాబూ!" అంటూ ఒడిలోకి తీసుకుని రవిబాబు బుగ్గలమీద ముద్దులవర్షం కురిపించేడు.

"తాతయ్యా! మరేం! ఎల్లుండి నాపుట్టిన రోజుకదా! అమ్మ నాకు ఇంకొక డ్రస్సు కుట్టించింది. అది పాంటుకూడా తెలుసే! ఇంకా అమ్మా - నాన్నకూడా కొత్తబట్టలు కొనుక్కున్నారు. మరి నీవుకూడా కొత్తబట్టలు కట్టుకుంటావా? ఆవేళ?" తాతయ్య ముఖంలోకి ఉత్సాహంగాచూస్తూ అడిగేడు.

"అలాగే బాబూ! తప్పకుండా కట్టుకుంటాను." తాతయ్య రవికి సమాధానం చెప్పేడు.

"తాతయ్యా! మరేం లడ్డూలు, జిలేబీలు చేసింది అమ్మ నాకిష్టమని. నాన్నగారు బిళ్ళలూ - బిస్కట్లూ అన్నీ తెచ్చేరు. నాక్లాసు పిల్లలందర్నీ పిలిచి వాళ్ళకి పంచిపెడతాను. మరి నీకు కూడా లడ్డూలు యిష్టమేనా? తింటావా?"

"అలాగే బాబూ! నాకన్నీ యిష్టమే." తాతయ్య రవిబుగ్గలను - మరోసారి ఆప్యాయంగా ముద్దు పెట్టుకున్నాడు.

"రవీ! బడికి టైము అయిందని వెళ్ళమనిచెప్పి ఎంతసేపు అయింది? పెద్ద కబుర్లాడుతూ కూర్చున్నావ్! ఆలస్యంగా వెడితే - మేష్టారు కొడతారనే భయమైనాలేదు వెధవకి. పోనీ మీరయినా చెప్పకూడదు టండీ, బడికివెళ్ళమని." కోడలు సీతగొంతులో ధ్వనించిన చిరాకుకి కోపానికి తాతయ్యచిత్తం చివుక్కుమంది. నిజంగా స్కూలుకి టైము అయిందని కాదు సీతకికోపం. కోడలు సీతకిష్టంకాని విషయాలలో తనూ, రవీ కలసి మాట్లాడుకోవటం ఒకటి. కోడలు విసుగుని గ్రహించిన తాతయ్య —

"మేష్టారు కోప్పడతారు బాబూ! ఆలస్యంగా వెళితే. వెళ్లుబాబు ఇంక!" తాతయ్య ఒడిలోంచి రవిని మెల్లగా దింపేడు.

"ఇంకా టైము కాలేదు. తాతయ్యా! ఛ. అమ్మ ఎప్పుడూ ఇంతే!"

"వెళ్లుబాబూ! అమ్మమాట చెప్పినట్లు వినాలి. అలా అనకూడదు." తాతయ్య మెల్లిగా అన్నాడు. రవి పుస్తకాల బేగ్‌ని తగిలించుకుని వెళ్ళిపోయేడు

ఆరోజు రవి పుట్టినరోజు! చిన్న పెళ్ళంత సంబరం! రవి స్నేహితులంతా వచ్చేరు. బిళ్ళలు - బిస్కట్లు అందరికి పంచిపెట్టేడు రవి. సీత పేరంటాళ్ళ హడావిడిలోవుంది.

స్నేహితులు వెళ్ళుతుంటే - వాళ్ళ వెనకవచ్చిన రవి. గమ్మున ఏదో జ్ఞాపకం వచ్చిన వాడిలా వంటగదిలోకి వెళ్ళి అలమారాతీసి - అలమారాలోని టిఫిన్ కారియరుల మూతలుతీసి — రెండు




లడ్డూలు - రెండు జిలేబీచుట్టలు పట్టుకుని సీతకి చాటుగా వచ్చేడు.

"తాతయ్యా! ఇవి తినిచూడు. ఎంత బాగున్నాయో!" తాతయ్య చేతిలో పెట్టేడు రవిబాబు!

రవిబాబు ఆప్యాయతకు - తాతయ్యకు మనస్సు పొంగిపోయింది తెల్లని తెలుపు డ్రస్సులో 'స్వచ్ఛత'కి చిహ్నంలా వున్న రవిబాబుని నిండు మనస్సుతో ఆశీర్వదిస్తూ, తాతయ్య లడ్డూని నోటిలో వేసుకున్నాడు.

"తాతయ్యా! మరి నీవుకూడా కొత్త బట్టలు కట్టుకోలేదేమి?" తాతయ్య కొత్త బట్టలమాట మర్చిపోని రవి అడిగేడు.

"కట్టుకుంటాలే బాబూ! తర్వాత!"

"ఇంకా ఎప్పుడు? అంతా అయిపోయేక? ఉండు నేతెచ్చియిస్తా." అంటూ రవి తాతయ్య పెట్టెదగ్గరకు వెళ్ళేడు. తాళంలేని పెట్టెనంతా వెదికేడు. కాని కొత్తబట్టలు ఎక్కడా కనుపించలేదు..

"తాతయ్యా! కొత్తబట్టలు కట్టుకుంటానన్నావ్? ఏవి? పెట్టెలోలేవు. ఎక్కడున్నాయి?" రవి అమాయకంగా నిలదీసుంటే - తాతయ్య చిక్కులో పడిపోయేడు.

"అదికాదు బాబూ! కొట్టులో వున్నాయి కొత్తబట్టలు. నాన్నజీతం అందేక తెచ్చియిస్తాడు, అప్పుడు కట్టుకుంటాను. అమ్మ పిలుస్తున్నట్లుంది. వెళ్ళుబాబూ!" తాతయ్య రవిని తప్పించుకుందుకు ప్రయత్నించేడు.

"ఏం? నీకు డబ్బుందా ఏం? కొనుక్కుందుకు?'' రవి తాతయ్యకేసి చూసేడు అమాయకంగా.

"ఊహుం! మరి నేను ఉద్యోగం చేయటంలేదు కదూ!" తాతయ్య రవి తల నిమురుతూ అన్నాడు.

ఇంతలో సీత 'రవీ' అని పిలవటంతో తాతయ్య రవిని పంపించివేసి తేలిగ్గా ఊపిరి తీసుకున్నాడు.

ఓపక్కనుంచి పుట్టినరోజు వేడుక జరుగుతున్నా తాతయ్య మనస్సు అంతరాంతరాలలోంచి అవ్యక్త ఆవేదనతో చుట్టబెట్టుకుపోతోంది. అందరికి అటువంటి అనుభవం అవుతుందో అవదో కాని తనకుమాత్రం ఎంతసంబరంలోనూ ఏదో వేదన అనుభవం అవుతుంది ఎప్పుడూ! అలాగా చెప్పరాని బాధ పడుతోంది మనస్సు.

"ఇంకా గోపీ, లక్ష్మి, బుజ్జి, మురళి, వాళ్ళంతా నీ ముఖ్య స్నేహితులు కదా! వాళ్ళు రాలేదేమిరా ఇంకాను?" సీత అడిగింది రవిని.

"వాళ్ళు ఇందాక లేరమ్మా. ఇప్పుడే వెళ్ళి పిలుచుకు వస్తాను.'' రవి మెరుపులా, వాళ్ళ నాన్న గదిలోకి వెళ్ళిపోయేడు. సీత అప్పుడే పేరంటానికి వచ్చిన సావిత్రిని పలకరిస్తూ, సావిత్రి కట్టుకున్న 'లేటెస్టు' బెనారస్ ఝరీచీర మీద పడగా - ఆ చీరమీదకు పోయేయి కళ్ళు.

సావిత్రి ఆ చీర రంగుకోసం, ఆ చీరకోసం తా నెంత అవస్త పడినదీ చెప్పుకొస్తోంది.

ఇంతలో రవి వాళ్ళ నాన్నగదిలోని స్టూలు స్టాండువైపుగా లాగి ఎక్కి, వరుసగా వున్న పాంటుజేబుల్ని తడిమేడు ఓ జేబులోంచి తనకు కావలసినది దొరకగానే, తీసుకుని దాన్ని జేబులోవేసుకుని స్టూలుదిగి దాన్ని యథాస్థానంలో వుంచి తాతయ్య గదిలోకివచ్చాడు.

"తాతయ్యా, మురళీ వాళ్ళు ఇంకా రాలేదు. వాళ్ళని పిలుచుకునిరమ్మందిఅమ్మ. నాతో సాయం వస్తావా? తాతయ్యా!" రవిబాబు తాతయ్యని అడిగాడు.

"అలాగే బాబూ" అంటూ తాతయ్య భుజాన కండువావేసుకుని చేతికర్రతీసుకుని రవిచెయ్యిపట్టుకునివీధిలోకినడిచాడు.

రవి ఏదో అడుగుతున్నాడు తాతయ్య సమాధానాలు చెప్పుతున్నాడు. కొంత దూరం నడిచినతర్వాత, రవిబాబు తాతయ్య చేతిని వదిలేస్తూ "అదిగో అక్కడ మురళీ వాళ్ళు వున్నారు. ఇప్పుడే పిలుచుకువస్తాను. ఇక్కడే వుండు తాతయ్యా! వెళ్ళిపోకు." అంటూ చెంగున పరుగుతీసాడు.




ఎదురుగా చెరకుగడలు నిండిన బరువైన లారీ అప్పటికే మంచి పొగరుగా వస్తోంది.

లారీదగ్గరగా వచ్చేస్తుంటే, రవిని లారీని చూస్తున్న తాతయ్య ఆదుర్దాగా 'రవీ' అంటూ రవికోసం అడ్డం పరుగెత్తాడు. 'బాబూ' అంటూ ఒక్కవురుకు ఉరికిన కిళ్ళీకొట్టు శేషయ్య రవిచెయ్యి పుచ్చుకు రోడ్డుపక్కగా లాగిపారేశాడు.

కాని రవికోసం అడ్డం పరిగెత్తిన తాతయ్యనులారీ ఒక వైపునవిసరిపారేసింది

క్షణంలో జరిగిన దారుణానికి జనం గుమిగూడేరు. స్పృహలేకుండా రోడ్డు ప్రక్క పడివున్న తాతయ్యని మాత్రం బిక్కచచ్చి బేలగా చూస్తూ వుండిపోయేడు రవిబాబు.

కబురు తెలిసిన సీతా, మూర్తీ వచ్చేరు ఇంటిదగ్గర్నించి. 'బాబూ' అంటూ సీత బాబుని గుండెల కదుముకుంది గట్టిగా వణికిపోతూ. భార్యానీ కొడుకునీ ఇంటికి వెళ్ళమని చెప్పి మూర్తి టాక్సీలో ముసలి తండ్రిని ఆస్పత్రికి తీసుకుపోయినాడు

సీత రవి జేబులోంచి కనిపిస్తున్న నోటుని తీసి చూస్తూ... "ఇది ఎవరిచ్చేరు బాబూ! ఎక్కడిది నీకు?" అని అడిగింది.

"మరి తాతయ్యకు కొత్త బట్టలు లేవని, కట్టుకోలేదని, కొత్తబట్టలు కొందామని... నాన్నగారి పాంటుజేబులోంచి తెచ్చానమ్మా!" ఏదీ తెలియని బాధతో బేలగా ఏడుస్తూ చెపుతుంటే. సీత బాబుని గుండెల కదుముకుని - ఇంటివైపుగా దారితీసింది

——

# అతను

"అయితే నేను చేసిందాంట్లో తప్పే ముంది రంగా?"

"తప్పే ముందని మెల్లగా అడుగుతావా? నువ్వు చేసిందంతా తప్పేనని నే మొత్తుకుంటూంటే! ... చూడు రామూ పచ్చగా మిసమిసలాడే పచ్చటి పంట చేను ఉందనుకో! ఆ పంటచేలోనే ఆకు పచ్చరంగుతో అంతకంటే పచ్చగా పెరిగే గడ్డిమొక్క ఉందనుకో! పచ్చటి మొక్కని వదిలేస్తే పంట పాడవుతుందా, పాడవదా?"

"అంటే?"

"ఇంకా అర్థమయేట్లు చెప్పాలా? అయితే విను పచ్చగా పెరిగే పంటచేనే సమాజం. అందులో దొంగలు ద్రోహులు గడ్డిమొక్కలు. వాళ్ళని ఏరి పారేయక పోతే సమాజానికే నష్టం. వాళ్ళూ మానవులేనని ఊరుకోగలమా?"

"కానీ నే చెప్పేదికూడా విను రంగా! ఆ చేలోని గడ్డిమొక్కల్ని ఏరి జాగ్రత్తగా పూడ్చి కొంతకాలం తరువాత ఆ మట్టి పంటచేనుకు వేస్తే ఎరువుగా పని చేసి ఫలాభివృద్ధికి దోహదం చేస్తుంది. అలాగే దొంగలనూ తీవ్రంగా శిక్షించకుండా సన్మార్గంలో పెట్టడానికి ప్రయత్నించి సమాజానికి వారు పనికివచ్చే విధంగా మార్చాలని నా అభిమతం!"

"నువ్వెన్నైనా చెప్పు! ఒకసారి దిగజారిన మనిషి కొంతకాలానికి తన తప్పు తెలుసుకొని ఎగబ్రాకుతాడనే నమ్మకం నాకు లేదు!"

"ఒక మంచి చేయడానికి ఎంతేని ఆత్మధైర్యం అవసరం. ఎన్నో ఆటంకాలను తొలగించుకొని ముందుకు చొచ్చుకు పోవాలి. అయినా ఇది నా మొదటి ప్రయోగం! కాబట్టి నన్ను ప్రోత్సహించటమే నీ విధి."

ఈ సంభాషణ ఈనాటిది కాదు.

ప్రదేళ్ళక్రిందట నేనూ నా నేస్తం రంగ కలిసి పనిచేసిన ప్రథమరోజుల్లోనిది.

ఈ సంభాషణ నాకూ రంగకూ పది సెకండ్లలో జరిగినా, పదితరాలవారికి కూడా సరిపోయే సందేశం దీనిలో ఉందని నాకిప్పటికి తెలిసింది.

అసలీ సంభాషణ నాకు జ్ఞప్తికి రావడానికి కారణం?

అతడు రాసిన ఉత్తరం!

అతడు నా జీవితంలో అడుగుపెట్టి నాతో గడిపిన కాలం సుమారు పది నిముషాలు. కాని ఈ పదినిముషాలే నేను నా జీవితంలో సరిగా ఖర్చుపెట్టానేమోననిపిస్తుంది.

పదేళ్ళక్రిందట పదినిముషాలు నాతో గడిపిన వ్యక్తి తిరిగి పదేళ్ళ తరువాత ఉత్తరం రాస్తాడని, ఆ ఉత్తరం నాకు బ్రహ్మానందదాయకమౌతుం దనిగాని

మారేమండ సీతారామయ్య



ఊహించలేదు। అతని ఉత్తరం నా కందటంతో నా మనస్సు ఒక్కసారి కాలచక్రాన్ని పదేళ్ళ వెనక్కి త్రిప్పింది।

* * *

"అమ్మోయ్। నాకు ఉద్యోగం వచ్చిందేవ్!!" అంటూ వీధి చివరినుంచి పొలికేక పెడుతూ తలుపు తోసుకెళ్ళి ఎదురుగావచ్చే వసుంధరను ఒక్క 'ధీ'

ఇచ్చి నిలుచున్నాను నుదురు తడుము కుంటూ!

"ఏవిటిరా ఆ పొలికేకలూ నువ్వూనూ?" వంటింట్లోంచి వచ్చింది అమ్మ.

"అదికాదత్తయ్యా! బావకు ఉద్యోగం వచ్చింది! నెలకు మూడొందలిస్తారు! రేపే వెళ్ళి జాయిన్ కావాలి!" నా దగ్గర్నుంచి కాగితం లాక్కొన్న వసుంధర గడగడా వివరాలు అమ్మకు అప్పజెప్పింది. ఇంకోవేపు కొంగుతో నుదురు రాసుకొంటూనే!

"సంతోషం బాబూ!" అంటూ అమ్మ పెద్ద అట్టహాసంతో ఇంకో పెద్ద విందు చేసింది నాకూ మా వసుంధరకూ!

ఆ మర్నాడు వెళ్ళి నేను డ్యూటీలో జాయినయ్యాను.

నేను పనిచేస్తున్న ఆఫీసులోనే మా కాలేజీ క్లాస్‌మేట్ రంగ పన్జేస్తున్నాడు. కాబోయే గృహస్థులం కాబట్టి ఇద్దరం ఒక రూము తీసికొని వంటాధ్యయనం కూడా మొదలుపెట్టాం.

ముప్ఫైసార్లు సూర్యుడు వెలిగి ఆరిపోయాడు.

ఆరోజు ఒకటో తారీఖు!

ఉద్యోగస్తులందరకూ ఆ రోజు పండగ!!

ఇంకా చెప్పాలంటే పర్వదినం!!!

కానీ నాకారోజు అంతకంటే ఎక్కువే!

జీవితంలో ప్రప్రథమంగాగా కష్టార్జితం అందుకోబోతూంటే ఎవరి కానందం ఉండదూ?

సరిగ్గా ఐదుగంటలు కొట్టంగానే రాస్తున్న ఫైలు ధనాలున మూసేసి వెళ్ళి హుందాగా డబ్బుతీసుకుని సైకిలుమీద బయల్దేరాను.

"డబ్బంతా ఇంటికి మనియార్డరు కట్టేస్తే? పోనీ అమ్మను పిలిపిస్తే!... వసుంధరకో బ్యూటిఫుల్ సారీ కొనాలి! పెళ్ళికాకముందే ఏంవిటీ ప్రజంట్లని పదిమందీ నవ్వరూ! ... పోనీ చక్కటి చీరలు రెండుకొని అమ్మకు పంపితేసరి ఒకటితను కట్టుకుంటుంది .... ఇంకోటి వసుంధర కిస్తుంది!"

వివిధ ఆలోచనల్తో వెళ్తూంటే ఆనంద విలాస్ స్వాగతం పలికింది. రోజూ కంటే మరీ అందంగా కనపడ్తోంది!

ఓకప్పు కాఫీ తాగుదామని లోపలికి వెళ్ళాను. కాఫీతాగి కిళ్ళీనవుల్తూ ఏదైనా పుస్తకం కొందావంని నిలబడి చూస్తున్నా.

నా బాక్‌పోకెట్‌లో ఏదో పురుగు దూరడం ప్రారంభించింది, వెంటనే చెయ్యి వెనక్కుపెట్టాను. పురుగు దొరకలేదు కాని ఓహస్తం దొరికింది.

గిర్రున వెనక్కితిరిగి చూశాను.

పదహారు వసంతాలు నిండీనిండని యువకుడు తల దించుకుని నిలబడిపోయాడు. జేబులు కత్తిరించడానికి ప్రయత్నించి విఫలుడైనాడని అతనివాలకం తెలియ జేస్తూంది.

అతన్ని పోలీసుల కప్పగిద్దామను కున్నాను

కానీ నా మనస్సంగీకరించలేదు.

పదిమందీ పోగవటం ప్రారంభించారు.

వెంటనే అతని చేయి పుచ్చుకొని నా సైకిలెక్కమని రూముకి తీసుకెళ్లాను

* * *

"నీపేరు ?"

"......."

"పోనీ నీపేరు చెప్పొద్దులే. దొంగ తనం ఎందుకు చెయ్యబోయావు ?"

"........."

"నువ్వు సమాధానం చెప్పకపోతే పోలీసులకు వప్పగించవలసి వస్తుంది !" తీవ్రంగా హెచ్చరించాను.

అతను తల యెత్తాడు. బొటబొటా కన్నీరు బుగ్గలపైనుంచి భూమిమీదకు కారడం మొదలెట్టింది.

నిర్ఘాంతపోయాను ! చేతికి దొరికి నందుకు సిగ్గుపడుతున్నాడనుకున్నాను గాని, దుఃఖిస్తున్నా డనుకోలేను !

నిక్కరుమీద చింకి చొక్కా ! తైలసంస్కారంలేని జుట్టు!! లోతుకు పోయినకళ్లల్లో దారిద్ర్యం తొంగి చూస్తోంది. కన్నీటితో తడిసి ఎఱ్ఱబడ్డ మొహం.

అతన్ని చూడగానే విపరీతమైన జాలి కలిగింది.

"చూడు తమ్ముడూ, నీ పేరు చెప్ప నక్కరలేదు. నిన్ను ఎవరికి అప్ప జెప్పను. నువ్వు ఎందుకు దొంగతనం చేయబోయావో చెప్పు వదిలేస్తాను" అంటూ అనునయంగా అడిగాడు.

"నిజంగానే వదిలేస్తారా ?" కొంచెం బెదురుగానే చొక్కాతోటి మొహం తుడుచుకుంటూ అడిగాడు.

"తప్పకుండా."

"నేను ఎస్సెల్సీ ఫేలయ్యానండీ. నాకు నాన్నగారు లేరు. అమ్మే నన్ను చదివించింది. నేను ఉద్యోగం గురించి ప్రయత్నించాను. ఓ కొట్లో నౌఖరుగా కుదిరాను. కాని మొన్న కొట్లో డబ్బు పోతే నేనే తీసానని అనుమానంకొద్ది ఉద్యోగం తీసేసారు. ఇంతలోకి అమ్మకు జ్వరం వచ్చింది. డాక్టరుగారికి చూపిస్తే ఇంజక్షన్ ఇవ్వాలనీ, పది రూపాయలవుతుందనీ చెప్పారు. ఉద్యోగం లేదు. డబ్బూలేదు. కనిపించిన ప్రతి ఒక్కడినీ అడిగానండీ సహాయం చెయ్యమని. ఫలించలేదు. ముష్టెత్తాను. అర్ధరూపా యొచ్చింది. నా కాఫీ ఖర్చుకికూడా కాదంటూ డాక్టరు గారు వైద్యం చేయనన్నారు. ఇంక గతిలేక జేబులోంచి మీ పర్సు తీసేసు కుని అమ్మకు వైద్యం చేయిద్దామను కున్నానండీ కాని మీరు నన్ను పట్టేసు కున్నారు. నన్ను వదలరాండీ?" మెల్లగా ఒక్కో విషయం చెప్పాడతను.

"అదిసరే! నువ్వు యింతకుముందు వరకూ దొంగతనం చెయ్యలేదా ?"

"అమ్మతోడుగా చెయ్యలేదండీ! అసలా నైజం మా జాతిలోనే లేదండీ! కానీ పరిస్థితుల ప్రభావంవల్ల వెధవ పని చేయబోయానండీ! మా అమ్మకు తెలిస్తే ఇంక నాతో మాటాడదండీ. నన్ను వది లేయండీ!" దీనంగా అడుగుతున్నా డతను.

పరిస్థితుల ప్రభావం మానవుడిలోని మానవత్వాన్ని మృగ్యంచేసి, దానిస్థానే దానవత్వాన్ని సృష్టిస్తుంది. అమాయక జనులచేత నేరాలు మోయిస్తుంది. నిజా యితీపరులను వక్రమార్గాల పట్టిస్తుంది ఆలోచిస్తున్న నాకు మళ్ళీ అతని మాటలు వినబడ్డాయి.

"ఏమండీ! వదిలేయండి త్వరగా. దొంగతనం ఎందుకు చేయబోయానో చెప్పానుగా."

'అవును! అమ్మకోసం దొంగతనం చేయబోయాడు నవమాసాలు నవరంధ్ర కాయాన్ని మోసిన అమ్మకోసం దొంగ తనం చేయబోయాడు. తను అతని స్థితిలో ఉంటే ఏం చేసేవాడు ? ఇంతే చేసివుండేవాడు లేకపోతే అంతకంటే ఇంకేం చేయగలడు.. ?'' ఆలోచనలు కట్టిపెట్టి నిశ్చితాభిప్రాయానికి చేరు కున్నాను.

''చూడు తమ్ముడూ, తల్లిపై నీకు గల భక్తిశ్రద్ధలకు నాకు చాలా ఆనం దంగా ఉంది. కాని నువ్వు నేచెప్పినట్టు చేసావంటే మరీ సంతోషిస్తాను."

"ఏం చెయ్యమంటారండీ ?" ఆత్రంగా అడిగాడు అతను.

''దొంగతనం నీచమైంది. అది మానవ లక్షణంకాదు. మంచి మనిషిగా మన పేరు చెప్పుకోపోయినా పరవా లేదు. కాని చెడ్డవాడని ఒకర్చిడిచేత కూడా అనిపించుకోకూడదు. అదుగో అతను దొంగ అని వేలెత్తి చూపించు కుంటే ఎంత అవమానమో ఆలోచిం చుకో. పరిస్థితులకు మనం తల వంచాలి. అంటే బానిసలుగా ఆ పరిస్థితులకింద పని చేయమనికాదు. మనిషిగా రాణించ డానికి సమాజంలో ఎన్నో మార్గా లున్నాయి. త్వరలో మంచి మార్గం ఎన్నుకో. ఇదిగో ఏభై రూపాయలు తీసుకెళ్ళి మీ అమ్మగార్కి వైద్యం చేయించు. తరువాత నువ్వింకెప్పుడు దొంగతనం చేయనని ప్రమాణంచేయి."

నిర్ఘాంతపోయా డతను!

రెండు క్షణాల్లో తేరుకుని చేతిలో ప్రమాణం చేశాడు, ఇంకెప్పుడూ దొంగ తనం చేయబోనని. తరువాత అడిగాడు.

"మీ పేరేమిటండీ ?"

"రాము."

"నా పేరు..."

"ఇప్పుడు చెప్పవద్దు! సమాజంలో




ఒక ఉత్తమ పౌరునిగా గుర్తించబడి పదిమందిలో మంచివాడిగా పేరు తెచ్చుకున్ననాడు చెబుదువుగాని."

"మళ్ళా ఎప్పుడు కనబడనండీ?"

"కనిపించనవసరంలేదు! నీ పేరు నాకు తెలిసిననాడే నీ వద్దకు నేను వస్తాను."

"మరి నే వస్తానండీ!"

"మంచిది."

అతను వడివడిగా వెళ్ళిపోయాడు.

రంగ రూముకి వచ్చింతరువాత ఈ విషయం చెప్పాను. దొంగతనం చేయబోయినవాళ్ళను వదలివేయటం అవివేకమని, అతడు నన్ను నమ్మించేవిధంగా నటించాడని వాదించాడు. కాని నాకు అది నటననిపించలేదు. అమ్మకు వసుంధరకు ఈ విషయం వ్రాస్తే మంచిపని చేసావని మెచ్చుకున్నారు.

* * *

ఈ సంఘటన జరిగి పదేళ్ళయింది. ఈ పదేళ్ళలో నా జీవితంలో అనేక మార్పులు జరిగాయి. నాకూ వసుంధరకూ వివాహం అయింది. మా ఊరుకు నేను బదిలీ అయ్యాను! ఒక ప్లస్, ఓ మైనస్ పుట్టారు. నేను అతన్నిగురించి పూర్తిగా మర్చిపోయాను. రంగకూడా ముగ్గురు పిల్లల తండ్రి అయ్యాడు. ఇన్నాళ్ళకు నేను మర్చిపోయిన 'అతను' ఉత్తరం రాసాడు.

ఉత్తరం పదోపర్యాయం చదివాను.

పూజ్యులైన రామంగారిక్కి.

పదేళ్ళక్రిందట మీ ప్రబోధంవల్ల నేడు ఒక నిజాయితీపరునిగా చెలామణీ అవుతున్న నేను వ్రాసుకొను విషయములు సావధానముగా చదవగలరని ఆశిస్తాను. ఒక ఉత్తమ పౌరునిగా నేడు నేను సమాజంలో గుర్తించబడ్డాను. కనుక నా పేరు మీకు తెలియపరచటం నా విధి. నా మిత్రులు నన్ను 'శేఖర్' అంటారు. అమ్మ నన్ను 'చంద్ర' అంటుంది. నా పై ఆఫీసర్లు 'మిస్టర్ చంద్రశేఖర్' అంటారు. నా పేరు తెలిసిన గజదొంగలు నన్ను "అమ్మో! ఆయన!" అంటారు. దొంగ అనే పదంతో మీరు ఏవో శంకిస్తున్నారు కాబోలు, సందేహాలు ఏం పెట్టుకోకండి

ఆనాడు మీరిచ్చిన ధనంతో అమ్మకు వైద్యం చేయించాను। కొద్దికాలం ఓ మిల్లులో పనిచేసాను। తరువాత పోలీస్ కానిస్టేబుల్‌గా చేరాను. మెల్లిగా రాత్రిళ్ల కష్టపడి చదివి డిగ్రీ సంపాయించుకుని ఇన్స్పెక్టరు నయ్యాను. నేను ముట్టుకున్న ప్రతికేసు నెగ్గింది. ఈమధ్య అంటే రెండేళ్ళక్రితం దొంగనోట్ల కేసులో ముగ్గురు ఘరానా పెద్దమనుషులను పట్టుకున్నాను. వెంటనే సర్కిలు ఇన్స్పెక్టరు నయ్యాను. ప్రస్తుతం ప్రమోషన్ లిస్టులో నా పేరు పైన వ్రాయబడి ఉందని తెలిసింది. ఇదంతా మీ చలవే నండీ।

'అడుగో వాడే దొంగ' అనబడవలసిన నేను 'అదుగో ఆయనే సర్కిలిన్స్పెక్టరుగారు' అని పిలువబడుతున్నాను. 'చంద్రశేఖరం ఒకడు న్యూసెన్స్‌గా తయారయ్యాడు' అంటూ విసుక్కోవాల్సిన పోలీసు ఆఫీసర్లు 'మిష్టర్ చంద్రశేఖరం ఈజ్ ఏన్ ఇంటెలిజంట్ అండ్ ఇండస్ట్రియస్' అనంటున్నారు. దొంగకావాల్సిన శేఖరు దొంగలను పట్టుకొనేవాడయ్యాడు।।

మీ చిరునామా ఎంక్వయిరీ చేసి ఉత్తరం వ్రాస్తున్నాను. మనం కల్సుకున్నపుడు మీరు నన్ను మీవద్దకు రావద్దన్నారు. స్వయంగా మీరే వస్తానన్నారు. ఇందుతో నా పెళ్ళి శుభలేఖ పంపుతున్నాను. వదినగారు మీరు తప్పక వచ్చి మీ చేతులమీదుగా ఈ శుభకార్యం జరిపించాలి అమ్మకూడా మరీమరీ చెప్పింది. మా కారు పంపుతున్నాను. వస్తారుకదూ! సమక్షంలో వివరాలు అనేకం-ఉంటా!

—చంద్రశేఖర్.





విమల్ చట్టోపాధ్యాయ డాక్టరు. ఆరు సంవత్సరాలు చదివి, ఎం. బీ. పాసయ్యాడు.

ఆ ఆరు సంవత్సరాలలో శరీర ధర్మాలను గురించీ, వ్యాధులను గురించీ, శస్త్ర చికిత్స గురించీ చాలా విషయాలు తెలుసుకున్నాడు. ఏదో విధంగా డిగ్రీ సంపాదించటమే ఈనాడు ముఖ్యమనీ, పని నెరవేరటానికి ఏ మార్గంతొక్కినా తప్పు లేదనీకూడా తెలుసుకున్నాడు.

విమల్ మెడికల్ కాలేజీలో చేరటం అంత సులువుగా జరగలేదు. కర్నల్‌దొర అతని తండ్రికి మిత్రుడు, గట్టి రికమెండేషను ఇచ్చాడు. అయినా సీటు దొరకటం కష్టమే అయింది. సీటు ఇచ్చేవాడు పెద్దదొర. ఇంటినుంచి బయలుదేరి పట్టణానికి వచ్చి విమల్ పెద్దదొరగారిని చూడబోయాడు. వాకిలివద్ద ఉండే కింకరుడు, దొర గారు చాలా పనిమీద ఉన్నారనీ, కొంచెం ఆగమనీ అన్నాడు. విమల్ పక్కనే ఉన్న బెంచీమీద గంటకు పైగా కూర్చున్నాడు

అదృష్టవశాన అనాదిబాబు అనే ఆయన అటుగావచ్చి, విమలుణ్ణి చూసి, వచ్చిన పని తెలుసుకుని, అతని అవతారాన్ని ఎగాదిగా పరిశీలించి, సమీపంలో ఉన్న తమ యింటికి తీసుకుపోయి, అతని మాసిన ఖద్దరు చొక్కా, అతుకుల చెప్పులూ విడిపించి, మంగలిచేత అతనికి ముందు క్రాపు వేయించి, తానే కోటూ, కాలరూ, టై వగైరాలు సరఫరాచేసి, విమల్‌ను ముస్తాబుచేసి, తానే స్వయంగా అతన్ని పెద్దదొర దగ్గిరికి తీసుకుపోయి, వాకిలి కింకరుడి చెయ్యి తడిచేసి, అతనికి సీటు సంపాయించిపెట్టాడు. కర్నల్‌దొర రికమెండేషనుకూడా పనిచేసింది.

మెడిసిన్ పూర్తిచేశాక విమల్ ఆరు మాసాలు హౌస్ సర్జన్‌చేసి, తరువాత ఒక ఏడాదిపాటు గోళ్ళుగిల్లుకుంటూ ఇంటివద్దనే ఉన్నాడు. తల్లీ, తండ్రీ పోయారు. అక్కచెల్లెళ్ళు కాపరాలకు వెళ్ళిపోయారు. అతని భార్య మణిమాల ఇంకా కాప రానికి రాలేదు, పుట్టింటనే ఉంటూ చదువుకుంటున్నది.

ఈ స్థితిలో అతనికి ఉద్యోగం దొరికింది. జీతం డెబ్బయ్యయిదే. కాని ఇల్లు ఇస్తారు. అతను హాస్పటలు నిర్వహణ చూడాలి. అతను సంతోషించి, తన సూట్ కేసూ, బెడ్డింగూ, మైక్రోస్కోపూ తీసుకుని రైలెక్కాడు.

రాత్రి పదిగంటలవేళ రైలు అతను దిగవలసిన స్టేషను చేరింది. మరీ చచ్చు స్టేషను. ప్లాట్‌ఫాం లోతుగా ఉంది. అతను పోర్టరు సహాయంతో తన హాస్ప టలు చేరుకుందా మనుకుంటుండగా స్టేషనులో చిన్న అలజడి జరిగింది. ఒక ముసలిది గాయపడి ప్లాట్‌ఫాంమీదనే పడిపోయింది. స్టేషను మాస్టరు చేతి లాంతరు సహాయంతో విమల్ ఆమెను చూసి, నాడి పరీక్షించాడు. రక్తం చాలా పోయింది.

రెండుమైళ్ళ దూరాన ఉన్న రైల్వే హాస్పటల్‌కు ఆ మనిషిని స్ట్రెచరుమీద పంపటానికి స్టేషనుమాస్టరు ఉద్యుక్తుడవుతుంటే, "ఈమెకు వెంటనే చికిత్స జరగాలి. మునిసిపల్ హాస్పటల్ ఎక్కడ?" అన్నాడు విమల్.

"దగ్గిరే. ఆ కనిపించేదే. అక్కడొక డాక్టరున్నాడు. ఆ ఆస్పత్రి గొడ

వంతా అదో మోస్తరు. డాక్టరుంటే మందు ఉండదు, మందులుంటే డాక్టరు ఉండడు. వెర్రిడాక్టరును తీసేశారుట," అన్నాడు స్టేషన్‌మాస్టరు.

"అక్కడ ఇక నేనే డాక్టరును. నేనింకా హాస్పటలు మొహమన్నా చూడలేదు. ఈ బండికే వచ్చాను. దారిచెబితే నేను ముందు వెళతాను. ఈమెను అక్కడికే పంపండి," అన్నాడు విమల్.

సామాను ఎత్తుకున్న పోర్టరు అతన్ని తనవెంటే రమ్మన్నాడు. అతను పోర్టరు వెంట స్టేషను దాటి కొద్దిదూరం వెళ్ళేసరికల్లా, అతని మొహాన టార్చిలైట్ వేసి, "విమల్, వచ్చావా?" అన్నాడు పరేశదాదా.

పరేశదాదా కొద్దికాలంక్రితం అక్కడికి పోస్టుమాస్టరుగా వచ్చాడు. ఆయన విమల్‌ని ఎరుగును. అతను ఆస్పత్రి చార్జి తీసుకుంటున్నాడనికూడా ముందుగానే తెలిసింది.

ఆయన విమల్‌ను తన ఇంట రెండురోజులు ఉండమన్నాడు. ఏమంటే పాత డాక్టరు ఇంకా బస ఖాళీ చెయ్యలేదు. విమల్‌కు చార్జి ఇచ్చి మరీ ఖాళీచేసి వెళ్ళిపోతాడు.

అయితే విమల్ ముందు హాస్పటల్‌కు వెళ్ళి ముసలిదానికి చికిత్స చెయ్యాలి గనక, పరేశదాదా పోర్టరును సామానుతో తన యింటికి మళ్ళించి, తాను విమల్ వెంట ఆస్పత్రికి బయలుదేరాడు.

ఆస్పత్రి చేరుతూనే తోటీవాణ్ణి కేకపెట్టాడు. కాంపౌండరు గోపీబాబు ఆస్పత్రిలో ఉండడనీ, చౌధరీగారింట పాచికలు ఆడుతూంటాడనీ ఆయనకు తెలుసు. ఆస్పత్రిలో ఇరవై బెడ్లు ఉన్నాయిగాని, ఒకరిద్దరికన్నా రోగులుండరు.

పరేశదాదా కొత్త డాక్టరును పరిచయంచేసిన మీదట తోటీవాడు జానకీ ఆఫీసు గది తెరిచి, లాంతరు వెలిగించి, చౌధరీగారింటినుంచి కాంపౌండరు గోపీబాబును పిలవటానికి వెళ్ళాడు.

ఆస్పత్రిలోవున్న ఒక రోగి మూలుగుతున్నాడు. విషజ్వరం. ఒక పనివాడు లేడు, కాంపౌండరు లేడు, దీపమన్నా లేదు! రోగులవద్ద వుండవలసిన దీపాన్ని తోటీవాడి భార్య వుపయోగించుకుంటున్నది.

ముసలిదాన్ని చేర్చారు. ఆమెకు ఇంకా రక్తస్రావం అవుతూనే వుంది. ఆపరేషన్ చేసి స్రావం ఆపాలి. శస్త్రాలు స్టెరిలైజు చేస్తే ఆలస్యమవుతుంది. లైసాల్ కూడా లేదు. టించర్ అయొడీన్‌తో వాటిని శుభ్రంచేసి, విమల్ ఆపరేషన్ చేశాడు. అతను కట్టు కడుతుండగా కాంపౌండరు వచ్చాడు. విమల్‌కు నమస్కారంచేశాడు

ముసలిదానికి ఆంటీటిటనస్ సీరం ఇంజక్షను నివ్వాలి. అటువంటిది ఆస్పత్రిలో లేదనీ, జగదీశబాబుగారి షాపులో దొరుకుతుందని, వారు మందులు అరువివ్వరనీ కాంపౌండరు చెప్పాడు. విమల్ తన పర్సులోనుంచి పదిరూపాయల కాగితం యిచ్చి, కాంపౌండరును పంపేశాడు.

ముసలిదానికి తాగించవలిసిన మందు రాసి, కాంపౌండరు కివ్వమని తోటీ జానకికి ఇచ్చి, విమల్ పరేశదాదా ఇంటికి బయలుదేరాడు.

మర్నాడు ఉదయం విమల్ పరేశదాదాను వెంట బెట్టుకుని, గంగ ఒడ్డున వున్న తన బసకు వెళ్ళాడు. ఇల్లు బాగానే వున్నదిగాని, బస్తీపిల్ల మణిమాలకు నచ్చుతుందో, నచ్చదో!

పరేశదాదా, "ప్రకాశబాబూ!" అని కేకలు పెట్టాక, "వెర్రి" డాక్టరు విద్ర కళ్ళతో బయటికి వచ్చాడు. విమల్ తన స్థానంలో వచ్చాడని తెలియగానే లోపలికి ఆహ్వానించాడు. విమల్ని "వెర్రి" డాక్టర్కు పరిచయం చేసి, పరేశదాదా తన యింటికి వెళ్ళిపోయాడు.

లోపల ఒక మంచమూ, బల్లా, కుర్చీ తప్ప వేరే ఫర్నిచరులేదు. "వెర్రి" డాక్టరు తనవాళ్ళనూ, సామాన్నూ ముందుగానే పంపేసి, "రాజ్యాధికారాన్ని" విమల్కు అప్పగించటానికి ఎదురు చూస్తున్నాడట.

"మీ రెందుకు వెళ్ళిపోతున్నారు?" అని విమల్ అడిగాడు.

"మీ రామాట అడుగుతున్నారుగాని, నేను ఇంతకాలం ఎలా ఉన్నానా అని ఆశ్చర్యపోతున్నాను నా కాలమంతా వ్యర్థం చేసుకున్నాను," అన్నాడు ప్రకాశబాబు ఆయన అక్కడ ఆరుమాసాలుగా ఉంటున్నాడు. అంతకుపూర్వం టీ ఎస్టేట్స్లోనూ, ఓడల్లోనూ, జిల్లా బోర్డుల్లోనూ, పనిచేశాడు. మాటిమాటికీ వెర్రినవ్వు నవ్వుతూ అకారణంగా "వెర్రి" డాక్టరనే పేరు తెచ్చుకున్నాడు. తన భోజనం కుక్క తినెయ్యకుండా చూసుకోలేదు. డబ్బు ఉండే ట్రంకుపెట్టెకు తాళం వెయ్యడు.

"ఇక్కడ కుక్కలూ, పిల్లులూ, మనుషులూ—అన్నీ దుర్మార్గమే!" అన్నాడాయన విమల్తో. ప్రకాశబాబు బాగా తెలిసినవాడేననీ, వైద్యవృత్తిలోకి రాకుండా ఎక్కడన్నా లెక్చరరుగా చేరితే రాణించేవాడని విమల్ గ్రహించాడు.

విమల్ తిరిగిరాగానే పరేశదాదా అతన్ని బడీబాబు దగ్గిరికి తీసుకుపోయాడు. పరేశదాదాకు అందరి పరిచయమూ కావాలి, అన్నింటా ఆసక్తి వున్నది. ఆయన బడీబాబుగురించి దారిలోనే కొన్ని విషయాలు విమల్కు చెప్పాడు. ఆయనకూడా చటర్జీయే. శాఖాభిమాని. అదీకాక హాస్పటల్ కమిటీకి సెక్రటరీ. విమల్కూడా




చటర్జీ కావటంచేత అతన్ని నియమించాలని బదీబాబు దెబ్బలాడి నెగ్గాడు. హరీన్ బోసు అనే మరో కమిటీ సభ్యుడు తన మనిషిని నియోగించాలని యత్నించి విఫలుడయాడు బదీబాబు పలుకుబడి గల క్రిమినల్ లాయరు.

ఆయన క్లయింట్లలో ధనికులయిన మార్వాడీ లున్నారు. బదీబాబు సహాయంతో విమల్ సొంత ప్రాక్టీసు ఎంతయినా పెరుగుతుంది.

"వారిని చూడగానే పాదాభివందనం చెయ్యి." అన్నాడు పరేశదాదా.

బదీబాబు తరవాత విమల్ చూడవలసినవాళ్ళు చైర్మన్ రాఖాల్‌నందీ అనే ధనికుడూ, డాక్టరు జగదీశబాబు అనే హాస్పటల్ కమిటీ సభ్యుడూ, ఇతర సభ్యులూ ఉన్నారు

వాళ్ళు వచ్చేసరికి బదీబాబు బయటే నిలబడి వున్నాడు. ఆజానుబాహువు. ఖద్దరు చొక్కా, ఖద్దరు లుంగీ ధరించి, దంతధావనం చేసుకుంటూన్నాడు. విమల్ ఆయన పాదాలు తాకి నమస్కరించాడు. అతన్ని పరేశదాదా పరిచయం చేశాడు.

బదీబాబు విమల్‌ను వీపుమీద తట్టి ప్రశంసిస్తూ, "భేష్! నీ పేషంటును చూసి వచ్చాను. బాగానే వున్న దిప్పుడు. చటర్జీ అంటే అలా వుండాలి!" అన్నాడు

ఆయన వాళ్ళను లోపలికిపంపి, ముఖం కడుక్కు వస్తానని వెళ్ళాడు. ఆయన కోసం రకరకాలవాళ్ళు వచ్చారు - కాంగ్రెసు కార్యకర్తలూ, రైతులూ, ఎవరో యువకులూ మునిసిపాలిటీకి చెందిన మహేశబాబూ...

ఆరోజే విమల్ హాస్పటల్‌చార్జీ పుచ్చుకున్నాడు.

ఆసాయంకాలం పరేశదాదా విమల్‌ను చైర్మన్ రాఖాల్‌నందివద్దకు తీసుకుపోయాడు. చైర్మన్ స్థూలకాయుడు. అయినా విమల్ బ్రాహ్మడన్న భావంతో లేచి నిలబడ్డాడు. పరేశబాబు కూర్చోమన్నా కూర్చోలేదు. తోటలో చెట్టుకింద తాను కూర్చున్నచోటికి మరిరెండు కుర్చీలుతెప్పించి వేయించి, బ్రాహ్మలిద్దరితోబాటే తానూ కూర్చున్నాడు.

చైర్మన్‌గారికి ఇద్దరు నౌకర్లు విసురుతున్నా చెమట ఆరటంలేదు. ఊరికి ఎలెక్ట్రిసిటీ రావాలి. దానికిగాను పథకంకూడా తయారుచేశాడు రాఖాల్‌నందీ; కాని మధురబాబు అడ్డు పడుతున్నాడు.

"విద్యుచ్ఛక్తి వస్తే మీహాస్పటల్‌కు కూడా సౌకర్యం," అన్నాడాయన.

"అవునండీ. ఎమర్జెన్సీ ఆపరేషన్లూ అవీ చెయ్యటానికివీలు," అన్నాడు విమల్.

"ఆముక్కే కాస్త ఓ కాగితంమీద రాసి ఇవ్వండి," అన్నాడు రాఖాల్.

విమల్ ఈమాటకు ఆశ్చర్యపడుతూ, అలాగేనన్నాడు.

రాఖాల్‌నందీ అతిధులకు కొబ్బరిబొండాలు తెప్పించి, వారు వెళ్ళిపోయేటప్పుడు విమల్‌తో, "అదివరకు డాక్టరుగారి మూలాన ఆస్పత్రికి చాలా అపఖ్యాతి వచ్చింది. మీరుకాస్త జాగ్రత్తగా చూసుకోండి," అని హెచ్చరించాడు.

విమల్ పరేశదాదావెంట డాక్టరు జగదీశబాబునుకూడా చూశాడు. ఆయన అందరితోనూ, నవ్వుతూ తియ్యగా మాట్లాడతాడు. ఎవరిమనసు ఎక్కడ నొచ్చుకుంటుందోనని జాగ్రత్త పడుతున్నట్టు కనబడతాడు. ఎవరేదిచెప్పినా ఖండించడు.

విమల్ వెళ్ళేసరికి జగదీశబాబువద్ద రోగులున్నారు. విమల్‌ను ఆయనకు పరిచయంచేసి, టపావచ్చే టయిమయిందని పరేశదాదా వెళ్ళిపోయాడు. రోగులను సాగనంపి జగదీశబాబు విమల్‌వద్దకు వచ్చాడు. ఒక యువకుడు, "డాక్టరుగారూ, ఇది చేదుమందు కాదుగద? చేదుమందయితే నాభార్య తాగలేదు." అంటే, "నీభార్యసంగతి నాకు తెలీదూ? ఆమె తాగేమందే ఇచ్చాను" అంటూ జగదీశబాబు మందహాసం చేశాడు.

తరవాత జగదీశబాబు విమల్‌తో మాట్లాడుతూ భూధరబాబు అనే మరొక డాక్టరున్నట్లు చెప్పాడు. వాళ్ళు విడిపోయేసమయంలో అమర్ అక్కడికి వచ్చాడు. ఖరీదైన పలచనిచొక్కా, ఖరీదైనబూట్లూ, చేతికి రవ్వటుంగరమూ ధరించాడు.

విమల్ ఆశ్చర్యంగా, "ఇక్కడున్నావేమిటి, అమర్?" అన్నాడు. అమర్ కూడా విమల్‌నిచూసి ఆశ్చర్యపోయాడు. వాళ్ళిద్దరూ సహాధ్యాయులు. ఐ. ఎస్సీ.

దాకా కలిసి చదివారు. అదే అమర్ స్వగ్రామం. అతనొక సంపన్న జమీందారు కొడుకు. మధురబాబే ఆ జమీందారు. అమర్ జగదీశబాబు దగ్గర చికిత్స పొందుతున్నాడు.

ఇద్దరూ గంగానదిఒడ్డున కూర్చోవటానికి బయలుదేరాక, "నీకేంజబ్బు?" అని విమల్ అమర్‌ను అడిగాడు. అమర్ రహస్యం చెప్పేశాడు. ఒకసారి కాలుజారిన ఫలితంగా అతనికి సుఖరోగం సంప్రాప్తమయింది. రోగంమాట అలా ఉంచి అతనికి తనభార్యతో చిక్కువచ్చింది. తల్లి దండ్రులకు సమ్మతంకాదని తెలిసి, అతను వారికి తెలియకుండా 'బీనా'అనే కాలేజీ అమ్మాయిని పెళ్ళాడాడు కాని ఈరోగం మూలాన అతను ఆమెతో దాంపత్యం నెరపటానికిలేదు.

"ఏవో మాయమాటలు చెప్పాను. ఎవరో సాధువువద్ద ఉపదేశంపొంది బ్రహ్మచర్యం అవలంబించానని బీనాతో చెప్పాను. నువ్వేదన్నా ఉపాయంచెప్పు." అన్నాడు అమర్ విమల్‌తో.

"రేపు ఆలోచించి చెబుతాను," అన్నాడు విమల్.

అమర్ అతన్ని గంగ అవతలఉన్న తమఇంటికి రమ్మన్నాడు. మర్నాడు మధ్యాన్నం వస్తానన్నాడు విమల్. మర్నాడుదయం ఆస్పత్రికి వస్తానన్నాడు అమర్. విమల్ తన స్నేహితుడితో తనభార్య బియ్యే పరీక్షకు కూర్చుంటున్నదనీ, పరీక్షలుకాగానే వస్తుందనీ చెప్పాడు. తన భార్యకు తోడులభిస్తుందని అమర్ సంతోషించాడు.

ఆరాత్రే విమల్ తనభార్యకు అన్నిసంగతులూ పూసగుచ్చినట్టురాసి, "నువు లేకపోతే నాకేమీ తోచటంలేదు," అని ముగించాడు.

*　　　　*　　　　*　　　　*

మర్నాడు ఉదయం ఆరున్నరకే విమల్ ఆస్పత్రికివెళ్ళాడు. ఇంకో అరగంటలో ఆస్పత్రిపని ప్రారంభంకావాలి, కాని ఇంకా ఎవరూరాలేదు. తోటీవాడు జానకి ఆస్పత్రి ఊడుస్తున్నాడు. ముసలిది బాగానేఉన్నది. విషజ్వరం రోగితోమాట్లాడి విమల్ అతని మలమూత్రాలను తన మైక్రోస్కోపుతో పరీక్షించాలని నిశ్చయించాడు.

దులూ అనే కుర్రాడు వచ్చాడు. పద్దెనిమిది, పందొమ్మిదేళ్ళవాడు. చురుకైనవాడుగానే కనిపించాడు. కాంపౌండరు గంగాస్నానానికి వెళ్ళాడని చెప్పాడు.

కాంపౌండరు గోపీబాబు వచ్చేసరికి ఎనిమిది అయింది. విమల్ అతనిమీద ఎగిరిపడి, రోజూ వేళకు రావాలన్నాడు. తొమ్మిది అయితే గాని ఆస్పత్రికి రోగులు

రారుట. వచ్చినా రాకపోయినా, ఉదయం ఏడు నుంచి పన్నెండుదాకానూ, సాయం కాలం మూడునుంచి అయిదుదాకానూ ఆస్పత్రి తెరిచి ఉండాలని విమల్ శాసించాడు.

తొమ్మిదయాకనే రోగులు వచ్చారు. అంతా సాదా జబ్బులవాళ్ళు - గాయాలూ, గజ్జి, చెవిలో చీమూ, మలేరియా జబ్బులవాళ్ళు. పది పదిహేను మంది. అందరూ పేదవాళ్ళు.

స్టాక్ రిజిష్టర్ తీసి చూస్తే ఆస్పత్రిలో మందులు దాదాపు ఏమీ లేవు. ముఖ్యమైన మందులు అసలే లేవు. పైపెచ్చు, బి. కె. పాల్ అనేవాడికి ఆస్పత్రి అయిదు వందలు బాకీ ఉన్నది. బాకీ చెల్లించమంటూ ఉత్తరం వచ్చి ది. ఆస్పత్రి పరిస్థితి చూస్తూంటే విమల్‌కు విస్పృహ కలిగింది.

అమర్ రానే లేదు.

కాని నందీబాబుగారు రమ్మంటున్నారని కబురు వచ్చింది. వారింటో డెలివరీ కానున్నది. లేడీ డాక్టరూ, భూధరబాబు వచ్చారట. జగదీశబాబు అందకపోతే విమల్‌కోసం కబురు చేశారు.

భూధరబాబు పరిచయం అతనికి నందీబాబు ఇంట్లోనే అయింది. భూధరబాబు వయసు ఏమంత హెచ్చుకాదు. ఎర్రగా, పొట్టిగా ఉంటాడు. బడాయి జాస్తి. వ్యంగ్యంగా నవ్వుతాడు, నొసలు చిట్లిస్తాడు

విమల్ వచ్చినా జగదీశబాబు రానందుకు రాఖాల్‌నందీ విచారం వెలిబుచ్చాడు. ఏం చెయ్యాలి? జగదీశబాబుకు క్షణం తీరదు!

"నాకూ తీరదు. మీ యింటికంటె మరి రాక తప్పలేదు," అంటూ భూధరబాబు ఏదో పట్టీతీసి లెక్కించసాగాడు.

విమల్ అడిగినమీదట, నొప్పులు కిందటి ఉదయమే ఆరంభమయినట్టు తెలిసింది.

"ఎందుకొచ్చిన శ్రమ? ఫోర్సెప్స్‌తో లాగేస్తేసరి!" అన్నాడు భూధరబాబు.

ముందు రోగికి నిద్రపట్టించాలన్నాడు విమల్. "బ్రొమైడ్ మిక్శ్చర్ ఏమైనా ఇచ్చారా?" అని అతను భూధరబాబు నడిగాడు

హోమియో ఇచ్చానన్నాడు భూధరబాబు.

బ్రొమైడ్ ఇవ్వొచ్చుగాని, ఫోర్సెప్స్ తప్పదేమోనన్నది లేడీ డాక్టర్. కాని గర్భిణిని చూశాక విమల్‌కు ఫోర్సెప్స్ ఉపయోగించరాదనిపించింది. బ్రొమైడ్ ఇవ్వమని అతను గట్టిగా చెప్పాడు. ఇందుకు భూధరబాబు సమ్మతించాడు గాని, లేడీ డాక్టరు చిరాకుపడింది. ఫోర్సెప్స్ కేసయితే ఆమెకు యాభై రూపాయలు ముట్టుతాయి. మామూలు డెలివరీకి నాలుగు పైన రాలవు.




లేడీ డాక్టరు వెళ్ళిపోయింది నాలుగు రూపాయలూ పుచ్చుకుని.

భూధరబాబు ఫీజుమాట ఎత్తకుండానే వెళ్ళిపోయాడు.

"తమ ఫీజు ఎంతో చెబితే ఇస్తాను," అన్నాడు రాఖాల్‌నందీ.

తరవాత చూద్దాం లెమ్మని విమల్ వెళ్ళిపోయాడు.

అందరూ వెళ్ళాక జగదీశబాబు ఆదరా బాదరా వచ్చి, "రమేన్ భార్యకు నొప్పులుటగా?" అన్నాడు.

నందీబాబుకు ధైర్యం వచ్చినట్టయింది. జరిగినదంతా ఆయన చెప్పాక జగదీశబాబు, "మందు సరిగానే ఉంది. అయినా పెద్దవాణ్ణి చెబుతున్నాను. చండీ ఆలయం నుంచి కొంచెం మట్టి తెప్పించి, పొట్టమీద వేయించండి. అంతా సవ్యంగా జరుగుతుంది," అన్నాడు,

మట్టికోసం వెంటనే మనిషి వెళ్ళాడు.

* * *

విమల్ తన బసలో ప్రవేశించాడు. ఇంటి పనీ, వంట పనీ చెయ్యటానికి పరేశ దాదా యోగేన్ అనేవాణ్ణి ఏర్పాటు చేశాడు. వాడి అన్న ఆస్పత్రిలో పని చేస్తాడు. లోగడ ఆస్పత్రిపనివాళ్ళే డాక్టరుగారి ఇంటిపనులు చేస్తూ, తృణమో పణమో పుచ్చుకోవటమే గాక, కొనే వస్తువులమీద చేతివాటుకూడా వేసే వాళ్ళు. అందుచేత

ఈ కొత్త డాక్టరు గురించి వాళ్ళు కొంత దుష్ప్రచారానికి దిగారు. కాంపౌండరు కూడా వాళ్ళతో చేరాడు, ఎందుకంటే విమల్ అతన్ని ఏడింటికల్లా రమ్మని శాసించాడు. ఏడు లోపుగా గంగాస్నానమూ, పూజా ముగించటం కష్టం. కష్టపడి వస్తే రోగులుండరు, మందులు లేవు.

అదీగాక గోపీబాబుకు చిన్న సొంత ప్రాక్టీసుండేది. తీరిక సమయంలో బీదా బిక్కీ అతని దగ్గిర మందులుపుచ్చుకుని, ఆస్పత్రినుంచి సంగ్రహించి మంచి మంచి మందులిస్తున్నాడనుకుని, బేడా పావలా అతని చేతిలో పెట్టేవాళ్ళు. విమల్ వచ్చి అందరి భ్రమలూ పోగొట్టుతున్నాడని గోపీబాబుకు మంట.

గోపీబాబు పౌరోహిత్యం కూడా చేస్తాడు. చౌధరీగారికి ఇంటి పురోహితుడు. చౌధరీబాబంటే, హాస్పటల్ కమిటీ మెంబరూ, ధనిక వ్యాపారీ, బోలెడంత పలుకుబడి గలవాడూనూ. సాయంత్రం చౌధరిగారింట పాచికల ఆట సాగేటప్పుడు గోపీబాబు విధిగా అక్కడే ఉండి, చౌధరీబాబుకు చాలా ఆత్మీయుడుగా ఉంటాడు. అందుచేత గోపీబాబు తలుచుకుంటే విమల్ మీద చౌధరిబాబుచేత దెబ్బతీయించగలడు.

కాంపౌండరు వ్యతిరేకతను విమల్ గ్రహించికూడా లక్ష్యపెట్టలేదు. నందీబాబుగారింట ప్రసవం సజావుగా జరిగిపోయింది. ఆస్పత్రికి అవసరమైన మందులు ఏర్పాటు చెయ్యటానికి నందీబాబు సహాయపడవచ్చునని అతను ఆశపడ్డాడు. పరేశదాదా పోస్టాఫీసులో లేడు. ఎక్కడో సారస్వత సమితి సమావేశానికి వెళ్లాడట. అందుచేత విమల్ ఒంటరిగానే నందీగారింటికి వెళ్ళాడు.

నందీబాబు అతన్ని ఆదరించి ఆహ్వానించి, టీ ఇచ్చి సత్కరించాడు. టీ తాగి విమల్ ఆస్పత్రి పరిస్థితి అంతా చెప్పాడు. నందీబాబు చాలా ఆశ్చర్యపడ్డాడు. నందీబాబు ఈ ఆస్పత్రి రోగులకు ఉచితంగా భోజనం ఇస్తూ గొప్ప ధార్మికుడనిపించుకుంటున్నాడు. కాని అతనిలో ధర్మగుణం ఏమీ లేదని విమల్ అక్కడ ఉన్న కాస్సేపట్లో గ్రహించాడు. నందీబాబుకు మందులనుగురించికూడా ఏమీ తెలీదు! క్వైనైన్ భయంకరమైన విషమని ఆయన నమ్మకం!

"మీరు చెప్పిందంతా జ్ఞాపకం ఉంటుంది. ఈసారి మీటింగులో ఏదో ఏర్పాటు చేద్దాం. చిక్కేమిటంటే, మునిసిపల్ పన్నులు సరిగా వసూలుకావటం లేదు. బిల్లు కలెక్టరు లంచాలు తినేసి పన్నులు వసూలుచెయ్యకుండా ఉంటున్నాడు. నీచుడు. కమీషను కోసం బదీ బాబుకు పార్టీలను వెతుకుతూ కాలయాపన చేస్తాడు. ఈ మాట మళ్ళీ బదీబాబుతో అనేరు! వారికి అనవసరంగా కోపం తెప్పించటమవుతుంది," అన్నాడు.

విమల్ ఇంటికి తిరిగి వచ్చేసరికి బదీబాబు అతనికోసం చూస్తున్నాడు. నది అవతల సతీశబాబుగారి సోదరుడికి జబ్బుగా ఉందట, విమల్‌ను తీసుకుపోదామని వచ్చాడు. రోగికి మూడు మాసాలుగా జ్వరం. వైద్యం చేసే డాక్టరు కదిలొంగ లేదు.

బదీబాబుకూ కూడా అక్కడ పని ఒకటి ఉన్నది. సతీశబాబుగారి జమీందారీలో కొట్లాట జరిగి ఒక మనిషి చనిపోయాడు. పోస్ట్‌మార్టెమ్ రిపోర్టు వచ్చిందట. దాన్ని బదీబాబు చూసి, ఎలా కేసు వాదించాలో చెప్పాలట.

నది దాటి, నాలుగుమైళ్ళు కారులో ఇద్దరూ సతీశబాబుగారింటికి వెళ్ళారు. రోగి రక్తాన్ని పరీక్షించాలన్నాడు విమల్. బదీబాబుకూడా ఒత్తిడి చెయ్యగా రక్తాన్ని తియ్యటానికి అనుమతి లభించింది. ఆ సమయంలో ఇంటిల్లిపాతీ, ఏదో ఘోరం జరిగిపోతున్నట్టుగా చూశారు.

తరవాత విమల్ శవపరీక్ష రిపోర్టు చదివి, ఎలా వాదిస్తే లాభించేదీ బదీబాబుకు చెప్పాడు. సతీశబాబు బలవంతంమీద విమల్ ఆ రాత్రికి అక్కడే భోజనంచేసి, అర్ధరాత్రివేళకు ఇంటికి చేరుతూ, ఆస్పత్రిలో ప్రమాదం కేసు వచ్చినట్టు నౌకరు చెప్పేసరికి, అక్కడికి పరిగెత్తాడు.

ఒక యువతి నల్లమందు తిని ఆత్మహత్య చేసుకొన యత్నించింది. విమల్ ఆమె పొట్టను రబ్బరుగొట్టంతో కడిగి, చెయ్యవలసినదంతా చేశాడు. ఆత్మహత్యకు కారణం? ఆమె చీర కొనుక్కునేటందుకు దాచుకున్న డబ్బు రెండురూపాయలు ఆమె మొగుడు కాజేసి తాగేశాడట.

"నల్లమందు తిన్నదంటే ఎందుకు తినదూ? చీరెకోసం దాచుకున్న డబ్బు తాగెయ్యటం అదేంపనీ?" అన్నారు ఆమె బంధువులు.

రోగిచేత స్ట్రాంగ్ కాఫీ తాగించి, రాత్రంతా ఆమెను జాగ్రత్తగా చూసే ఏర్పాట్లుచేసి, విమల్ ఇల్లు చేరాడు. ఇంటికి వచ్చేసరి మణిమాలనుంచి ఉత్తరంవచ్చి ఉన్నది. ఆమె పరీక్ష బాగానే రాసిందట.

*  *  *

అదృష్టం బాగుంటే అన్నీ కలిసివస్తాయి. సతీశబాబు సోదరుడి జ్వరం విమల్ చికిత్సతోనే తగ్గింది. సతీశబాబు చుట్టుపట్ల అతనికి మంచిపేరు వచ్చింది. రెండు మూడు పెద్దకేసులుకూడా వచ్చాయి. విమల్ చటర్జీలపేరు నిలబెట్టుతున్నందుకు బదీబాబు ఆనందం చెప్పశక్యంకాదు.

ఆస్పత్రికి మందులు ఏర్పాటు కాలేదు. మునిసిపల్ కమిటీవారు అనుకూలంగానే

తీర్మానాలు చేశారు; ఆస్పత్రి మందులకుగాను కొంత డబ్బు శాంక్షన్ చెయ్యమని తీర్మానించారు. కాని మునిసిపాలిటీకి డబ్బులేదు; జిల్లా పెద్దాసుపత్రి ముఖ్యమైన మందులను అప్పుగా ఇవ్వవలసిందని మరొక తీర్మానం చేశారు. అది అమలు జరగటానికి ఉన్న అడ్డంకి అప్పుడున్న సివిలుసర్జను. అతను జగదీశబాబు మనిషి. వాళ్ళిద్దరిదీ ఒకే కులం; పైన కలిసి చదువుకున్నారు; ఆపైన జగదీశబాబు సివిలు సర్జనుకు డబ్బు బాగా రాల్చేకేసులు ఇప్పిస్తాడు. విమల్ మంచి పేరు తెచ్చుకోవటం జగదీశబాబుకు కంటకింపుగానే ఉన్నదిమరి. ఇదంతా చూశాక, సివిలుసర్జను పెద్దాసుపత్రిలో అప్పిచ్చేటంత మందుల స్టాకు లేదని రాస్తే, విమల్ ఆశ్చర్యపడలేదు.

ఈ పరిస్థితిలో అమర్ అనుకోకుండా విమల్‌వద్దకు వచ్చాడు. తాను కలకత్తా వెళ్ళి, చాలాడబ్బు తగలేసి, ఆశవదులుకుని వచ్చినట్లు చెప్పాడు.

"ఇంతకూ నా జబ్బు నయమవుతుందా, కాదా నిజంచెప్పు," అని అతను అడిగాడు.

"నయంకాదు. మొదట్లోనే చికిత్స జరిగితే ఏమోగాని నువుదాన్ని కొంత కాలం దాచావు" అన్నాడు విమల్.

ఇంతకూ అతను చికిత్సకోసం రాలేదు, "బలిదానం" అనే నాటకంలో విమల్ చేత ఒకవేషం వేయించటానికి వచ్చాడు. అతనా పాత్రను కాలేజీ నాటకంలో లోగడ ధరించాడు. ప్రదర్శన ఏటవతల క్లబ్బులో.

"ఆస్పత్రి చూస్తూ నేను రోజూ రిహార్సల్‌కు ఎలారాను?" అన్నాడు విమల్.

"రోజూ సాయంకాలం అందరమూ మీ యింటికేవస్తాం."

"ఇక్కడ జనం డబ్బిచ్చి నాటకాలు చూస్తారా?"

"కిందటిసారి మా నాటకానికి రెండువందల యాభైరూపాయలు వచ్చాయి - ఇళ్ళకుతిరిగి టిక్కెట్లు అమ్మితే."

"సరే, ఈసారికూడా అలాగే డబ్బు పోగుచేసేట్టుంటే నేను వేషం వేస్తాను. వచ్చినడబ్బు ఆస్పత్రికివ్వాలి," అన్నాడు విమల్.

అమర్ సరేనన్నాడు. పదిహేను రోజుల్లో ప్రదర్శన ఉన్నది. వెంటనే టిక్కెట్లు అమ్మేపని ప్రారంభిస్తానని అతను అన్నాడు. తన ఇంటిపక్కన హైస్కూలు ... యిడ్ పేషంటు ఉండటంచేత తానే రిహార్సల్సుకు వస్తానని విమల్ అన్నాడు.

అమర్ వెళ్ళాక పక్కవాటాలోవాళ్ళు విమల్‌ని రోగిని చూడటానికి రమ్మని పిలిచారు. రోగిని భూధరబాబుతోబాటు విమల్‌కూడా చూస్తున్నాడు. తేడా ఏమంటే భూధరబాబు ఫీజుపుచ్చుకుని, అడ్డదిడ్డంగా వైద్యం చేస్తున్నాడు. విమల్ డబ్బు

తీసుకోవటం లేదుగాని, భూధరబాబు చేసేదానికి అభ్యంతరం చెప్పటంలేదు. టైఫాయిడు రోగికి మకరధ్వజం ఇద్దామన్నాడు భూధరబాబు. విమల్‌వద్దనలేదు. మకరధ్వజంగురించి అతని కేమీతెలీదు.

ఆస్పత్రిలో ఇద్దరు, ముగ్గురు కొత్తరోగులుచేరారు. విషజ్వరంవాడు క్రమంగా కోలుకుంటున్నాడు. గోపీబాబు పాచికలాటకు- రోజూపోతూనే ఉన్నాడు. వెళ్ళకుండా ఆపితే చౌధరీగారికి కోపం రావచ్చునని పరేశదాదా హెచ్చరించాడు. కాంపౌండరు లేనిసమయంలో అప్రెంటిస్ కుర్రాడు దులూ రోగుల్ని చూస్తున్నాడు. ఆ కుర్రాడు డ్రెసర్‌పరీక్షకు చదువుతూ, అప్పుడప్పుడూ విమల్ సహాయం తీసుకుంటున్నాడు.

నల్లమందుతిన్న ఆడది డిశ్చార్జి అయింది. ఆమెకు చీరకొనిపెట్టమని విమల్ ఆమె భర్తకు రహస్యంగా డబ్బిచ్చాడు.

రోగు లందరినీ చూసి ఆ రాత్రి విమల్ ఇంటికి బయలుదేరబోతుండగా ఒక ఘోరాకారుడు అతనికి ఎదురై నమస్కరించి, తనకు జబ్బుగా ఉన్నదనీ, ఆస్పత్రిలో చేర్చుకోమనీ వేడుకున్నాడు. గోచీమాత్రం ధరించాడు. జుట్టురేగి ఉన్నది. కటికదరిద్రుడు. అతనిది భయంకరమైన క్షయవ్యాధి. అతన్ని ఆస్పత్రిలో చేర్చటం నిరుపయోగమూ, ప్రమాదమూకూడానూ. తాను ఆస్పత్రి కెదురుగా చెట్టు కిందపడి ఉంటాననీ, ఆకలి కింతతిండీ, రోగానికింతమందూ దయచేయించమని వాడు కాళ్ళావేళ్ళాపడ్డాడు.

విమల్‌కు ఏమనటానికీ పాలుపోలేదు. అలాటి దౌర్భాగ్యులు ఈ నిర్భాగ్య దేశం నిండా ఉన్నారు. ఎందరికని ఆశ్రయం ఇవ్వగలడు? చేసేదిలేక అతను సరే నన్నాడు.

అదేసమయంలో టార్చివేసుకుంటూ పరేశదాదా వచ్చి, చైర్మను నందీబాబు విద్యుచ్ఛక్తిమీద వ్యాసం కావాలన్నారని చెప్పాడు. మునిసిపాలిటీ విద్యుచ్ఛక్తి తీర్మానం నెగ్గితే ప్రభుత్వాన్ని అప్పు అడుగుతారుట.

"దేశంలో ప్రజలకు తినతిండిలేదు. ఆస్పత్రిలో మందుల్లేవు. మందులు కొనటానికి డబ్బులేదు. విద్యుచ్ఛక్తికి తొందరా?" అన్నాడు విమల్.

"నీ కివన్నీ అర్థంకావులే. పెద్దవాళ్ళ అభిప్రాయ పడ్డప్పుడు_"

"వ్యాసం రాస్తే ఏం చేస్తారు?"

"నందీబాబు మీటింగులో చదువుతాడు. అంతమాత్రాన తీర్మానం నెగ్గుతుందిట్లే? మధురబాబు ముఠా కలిసిరావాలి?"

"మధురబాబు విద్యుచ్ఛక్తి వ్యతిరేకా?"

"విప్లవశక్తికికాదు, నందీబాబుకు వ్యతిరేకి. నందీబాబు తలపెట్టినదాన్ని వ్యతిరేకించటమే మధురబాబు పార్టీపని."

"మధురబాబంటే అమర్‌బాబు తండ్రేనా ?"

"అవు నవును. మీ రిద్దరూ స్నేహితులు కాబోలు. 'ఇద్దరూ దోస్తీగా ఉంటే నందీబాబుకు కోపం వస్తుందేమో !"

"నేను డాక్టరును. నాకే పార్టీతోనూ సంబంధంలేదు."

వాళ్ళదారికి స్టేషనుమాస్టరు అడ్డంగా నిలబడి, ఇద్దరికీ నమస్కారం చెప్పి, విమల్‌ను తనయింటికి రమ్మనికోరాడు. వాళ్ళ రెండో అబ్బాయి వంటిన పొక్కులేవో లేచాయిట.

"రైల్వే డాక్టరు జగూబాబున్నా రంటే, ఆయన డ్యూటీ ప్రకారం చూస్తారు. ఆయన ఒక్కకేసుకూడా నయం చేసినట్టు వినలేదు. మీరురావటం మా కెంతో మేలయింది," అన్నాడు స్టేషనుమాస్టరు.

స్టేషనుమాస్టరు పిలవటం విమల్‌కు కొత్తకాదు. వాళ్ళమ్మాయి పొట్టజబ్బు అతనే కుదిర్చాడు. ఇలాటి అనేకచోట్ల అతను డబ్బు తీసుకోకుండానే వైద్యం చేస్తున్నాడు. సతీశబాబు సోదరుడికి తానువైద్యం చేస్తున్నందుకు అతనికి ఏమీ ముట్టలేదు. ఏంచేస్తే బాగుంటుందో బదీబాబు నడిగి తెలుసుకోవటం మంచిది. అందుకని అతను స్టేషనుమాస్టరు ఇంటినుంచి బదీబాబు ఇంటికివెళ్ళితే, ఆయన కాంగ్రెసు పనిమీద ఎటో వెళ్ళారనీ, మూడు నాలుగురోజులదాకా రారనీ తెలిసింది.

* * * *

మధురమోహనముఖర్జీగారు సంపన్నులు. వారివంశం ఢిల్లీ నవాబుల నాటినుంచీ ప్రసిద్ధిగలది. మధురబాబు తండ్రి పాశ్చాత్య సంస్కృతిని అమలుచేశాడు. రిహార్సల్‌కు వెళ్ళిన మొదటిరోజే విమల్‌కు మధురబాబు పరిచయం కలిగింది. అతను ఊహించినట్టు ఆయన భీకరంగా ఉండక, చాలా నిరాడంబరంగానూ, సౌమ్యంగానూ కనిపించాడు. తెల్లదోవతీ, కాళ్ళకు చెప్పులూ, చేతులులేని పొట్టిచొక్కా ధరించాడు. ఆయన మొహాన మందహాసం తాండవిస్తూనే ఉంటుంది. అయినా నది అవతలివాళ్ళు ఆయన పేరువింటేనే ఉలికిపడతారు.

మధురబాబు విమల్‌తో, "మీరు మా అమర్ స్నేహితుడని తెలిసివుంటే ఇక్కడికి రాకుండా చూసి ఉందును. 75 రూపాయల జీతంమీద గౌరవంగా బతకటం సాధ్యంకాదు. ఎంతమంచివాడైనా త్వరలోనే తప్పుదార్లు తొక్కుతాడు," అన్నాడు.



మునిసిపాలిటీ అంతకన్న హెచ్చుజీతం ఇవ్వలేదన్నాడు విమల్.

"అవును. నన్నడిగితే ఆస్పత్రిని మూసెయ్యాలి. దాన్ని ఇలానడిపేకన్న మూయటం మేలు," అన్నాడు మధురబాబు. ఆయన విమల్‌ని హెచ్చరించుతూ, "గుర్తుంచుకోండి. నేను మీ శత్రుపక్షంవాణ్ణి. 75 రూపాయల జీతంమీద మీరు ఏదో ఒకతప్పుడుపని చెయ్యకపోరు. అప్పుడు నేను అంతుతేలుస్తాను." అన్నాడు.

మునిసిపల్ కౌన్సిలర్లలో లంచాలు తీసుకోనిది మధురబాబు ఒక్కరే ననీ, అందుకే ఆయనను చూసి అంతా భయపడతారనీ విమల్‌కి అమర్‌ద్వారా తెలుసు

కున్నాడు. బదీబాబుకూడా మునిసిపాలిటీని దోచుకుతింటున్న వాడేనని తెలిసి అతనికి బాధకలిగింది.

అమర్, విమల్ రిహార్సల్‌కుగాను క్లబ్బుకు బయలుదేరాక మధురబాబు స్నానం చెయ్యటానికి వెళ్ళిపోయాడు. ఆయన భార్య మందాకిని భారతం తీసి, తాను చదవ లేననుకుని తన కోడలు వినోదినిని పిలిచింది. ఆమె వచ్చింది.

వినోదినిని (బీనూను) చూసి అత్తగారు, "అదేమిటమ్మాయ్? జుట్టుకు నూనె అయినా రాచుకోలేదేం? ఇదేం ఫాషనూ!" అన్నది.

వినోదిని మాట్లాడలేదు. ఆమె తన భర్త చెప్పిన అబద్ధాలు నమ్మి తాను కూడా బ్రహ్మచర్యవ్రతం పట్టింది. ఆమె కాలేజీలో చదివిందని తెలిసి అత్తమామలు ఏమేమో ఊహించుకున్నారు గాని, తీరా చూస్తే చాలా సంసారపక్షం మనిషి. వ్రతాలూ, నోములూ, పూజలూ సైతం ఎంతో శ్రద్ధగా చేస్తుంది. ఆమెకు సరదాలూ, విలాసాలూ లేవు.

వినోదిని విమల్‌ను పూర్వం చూసింది. అమర్ వెంట అతను చాలాసార్లు వినోదిని ఇంటికి వచ్చాడు. ఆ రోజుల్లో అతను అమిత బిడియస్థుడు. ఎప్పుడూ తల వంచుకునే ఉండేవాడు. ఇప్పు డతన్ని ఒకసారి చూడాలనిపించింది వినోదినికి. అందుచేత ఒక వెన్నెలరాత్రి అమర్ తన భార్యతోసహా నది దాటివచ్చి, నది ఒడ్డునేవున్న విమల్ ఇంటికి వచ్చాడు...

విమల్ మంచితనంవల్ల రోగులు జాస్తిగానే వస్తున్నారు. విషజ్వరం కేసులు జాస్తి. కాని ఆస్పత్రిలో రోగానికి కావలిసిన ఇంజెక్షన్లు లేవు. విమల్ తన మొదటి నెలజీతంలో నుంచి కొన్ని ఇంజెక్షన్లు కొన్నాడు. అందు కతను వెనకాడలేదు. మంచి పేరుతెచ్చుకుని ప్రాక్టీసు పెంచుకోవటాని కది అవసరమైన పెట్టుబడే. సొంత డిస్‌పెన్సరీ పెట్టుకుంటే ఈ ఖర్చు తప్పదుగద! ఇంజెక్షన్లతో విషజ్వరాలు పోగొట్టుకున్నవాళ్లు అతనికి మంచి ప్రచారం చేశారు.

ఒక్కొక్కసారి రోగులను మోసగించడం తప్పనిసరి అవుతుందని విమల్ తెలుసుకున్నాడు. అతన్ని ఒక ముసలిది పట్టుకుని, తన తలనొప్పికి సూదిమందు ఇవ్వమని రోజులతరబడి పోరింది. తలనొప్పికి సూదిమందు ఉండదంటే వినక, తనను కోడలుపెట్టే కష్టాలూ, కొడుకు నిర్లక్ష్యమూ చెప్పి ఏడ్చింది. ఆమెను వది లించుకోవటానికి అతను కాచి చల్లార్చిన నీళ్ల ఇంజెక్షనిచ్చి పంపేశాడు.

ఆస్పత్రి వంటవాడి భార్య, నలుగురైదుగురు తినే అన్నాన్ని పట్టుకుపోతుండగా ఒకనాడు విమల్ పట్టుకున్నాడు. రోగులంతా కలిసి పది, పన్నెండుమందికి మించరు.

అంత అన్నమూ, కూరలూ, పప్పూ ఎలా మిగిలాయి? విచారించగా ఏ రోగికి కూడా ఒక్కపూట అయినా కడుపునిండా తిండి ఉండటం లేదని తెలిసింది. రోగుల భోజనంలోనుంచే భైరవుడనే నౌకరికి కూడా వాటా ఉంటున్నది.

విమల్ వెంటనే వంటవాణ్ణీ, నౌకరునూ పనిలోనుంచి తొలగించి, కొత్తవాళ్ళను ఏర్పాటుచెయ్యమని గోపీబాబుతో చెప్పాడు.

అనాధాశ్రమంనుంచి ఒక పిల్ల నుమోనియాతో వచ్చి స్త్రీల వార్డులో చేరింది. చెట్టుకింద ఉండే క్షయరోగి, కాంపౌండరు మాట లక్ష్యపెట్టక, ఆ వార్డులోకి వచ్చి ఆ పిల్లదగ్గర కూర్చోసాగాడు. విమల్ అది చూసి, వాడి మీద మండిపడి, వాణ్ణి చెట్టుకిందికి తరిమాడు. తరవాత అస్పత్రినుంచి వెళ్ళిపోయేటప్పుడు వాడు దీనంగా, "ఆపిల్లకు నయమవుతుందా, బాబూ?" అని అడిగాడు. వాడి కూతురు మందూ, మాకూ లేకుండా చనిపోయిందిట!

విమల్ పక్కవాటాలో ఉంటున్న టైఫాయిడ్ రోగికి విరేచనంలో రక్తం పడింది. విమల్ అతన్ని పరీక్షించి, ఇంటర్నల్ హిమొరేజ్ అని సంశయించాడు. రోగితండ్రి భూధరబాబుకోసమూ, జగదీశబాబుకోసమూ కబురుపెట్టాడు. ఇద్దరూ అందలేదు. విమల్ రాసి ఇచ్చిన ఇంజెక్షన్ దొరకలేదు. అందుచేత అతను రోగికి మార్ఫియా, కాల్షియం ఇంజెక్షన్లు ఇచ్చాడు. రోగి నిద్రపోయి, మరి లేవలేదు.

విమల్ రోగికి మార్ఫియా ఇచ్చినట్టు విని జగదీశబాబు, "ఎంత అజ్ఞానం!" అన్నట్టుగా చూశాడు.

"రక్తస్రావంలో మార్ఫియా ఇవ్వచ్చు." అన్నాడు విమల్.

"పుస్తకాలలో చాలా ఉంటాయి," అన్నాడు జగదీశబాబు.

"నా కొడుకును డాక్టరు సూది మందిచ్చి చంపాడో!" అని రోగితల్లి ఎలుగెత్తి ఏడ్చింది.

ఆ రాత్రే నుమోనియారోగి మసకవెల్తురులో తన మంచం పక్కన ఎత్తుగా ఒక భయంకరాకారం ఉండటం చూసి కెవ్వున అరిచి, ఆయాసంతో రొప్పసాగింది. దులూ వెళ్ళి విమల్‌ను లేపుకొచ్చాడు. అతను వచ్చి చూసేసరికి, భయంతో గుండె ఆగిపోయికాబోలు, రోగి మరణించింది. క్షయవాడు వరండా స్తంభం పక్క నిలబడి ఉన్నాడు. విమల్ వాణ్ణి చెంపమీద కొట్టి, "ఫో అవతలికి!" అన్నాడు. ఆ తరవాత వాడు అస్పత్రిచాయల కనిపించలేదు...

విమల్ మధురబాబు క్లబ్బులో చేరటం బదీబాబుకు నచ్చలేదు.

"అది తప్పుఎత్తు. జీవితం ఒక చదరంగం ఆట. అందులో ఒక పొరపాటు ఎత్తువేశామో, ఓడిపోతాం," అన్నా డాయన.

"అమర్ నాకు కాలేజీ స్నేహితుడే ననుకోండి. కాని నేను నాటకంలో వేషం వేస్తున్నది ఆస్పత్రిలో మందులకోసం. నా జీతంతో మందులు కొంటున్నాను, మీ రెరుగుదురుగద!" అన్నాడు విమల్.

బదీబాబు అతని చేతికి 500 రూపాయల చెక్ ఇచ్చి, దానితో మందులు కొనుక్కో_మన్నాడు. నందీబాబుతో చేరి అయిదుగురు తలా ఒక వందా చందాలు వేసుకున్నారుట.

విమల్ చాలా సంతోషించాడు.

"మందులకు డబ్బు దొరికింది గనక, నాటకంలో వేషం వెయ్యకపోతేనేం? నాటకంలో వేషం మానుకున్నట్టు నందీబాబుతో చెప్పనా?" అన్నాడు బదీబాబు.

"క్షమించండి. అమర్‌కు మాట ఇచ్చాను. ఇదివరకెన్నడూ ఇచ్చిన మాట తప్ప లేదు," అన్నాడు విమల్.

"ఆల్‌రైట్!" అని బదీబాబు వెళ్ళిపోయాడు.

తరవాత విమల్ పోస్టాఫీసుకు వెళ్ళాడు. పరేశదాదా అతనికి ఉత్తరం ఇచ్చి, "ఆ మూల కూచుని చదువుకుంటూ ఉండు. టీ తయారవుతున్నది?" అన్నాడు.

మణిమాల రాసిన ఉత్తరం. పరీక్షలకు చదవటంలో సినిమాలూ అవీ చూడటం పడలేదుట. నెలాఖరుదాకా ఆ పని చేసికాని రానన్నది. అతన్ని అక్కడికి రమ్మ న్నది. రాలేకపోతే ఇరవై రూపాయలు పంపమన్నది. బాజు బందులు కావాలిట. డబ్బేమైనా వెనకవేశారా అని అడిగింది. అమర్‌నూ, వినోదినినీ తాను ఎరుగునుట. అతను మంచివాడు కాడని విన్నదిట, అతనితో అంత స్నేహంగా ఉండవద్దన్నది. వచ్చేటప్పుడు తన కుక్కనుకూడా వెంట తెచ్చుకుంటుందిట. దాన్ని వదిలి ఉండలేదుట...

విమల్ టీ తాగుతూండగా, ఉత్తరాలు సార్ట్ చేసే యోగేన్ అతనికి మరో కార్డు ఇచ్చాడు. అతని తండ్రి తాతల భూమికి శిస్తు నలభై రూపాయలు చెల్లించాలిట. వెంటనే చెల్లించకపోతే వేలం వేస్తారుట.

మణిమాలకు ఇరవై పంపాలి. బాజుబందులు కొనాలి. శిస్తు నలభై. అంతా డబ్బుతో కూడినపని.

విమల్ లేచాడు. పరేశబాబుకూడా, నాటకం మానుకున్నట్టేనా అని అడిగాడు. లేదన్నాడు విమల్. "నందీబాబుకు కోపం వస్తుంది," అన్నాడు పరేశదాదా.




నందీబాబును సంతోష పెట్టటానికి విద్యుచ్ఛక్తిమీద వ్యాసం రాయటం తప్ప విమల్‌కు మరో మార్గం లేదు. వ్యాసం చూసి నందీబాబు సంతోషించాడుకూడా. అయితే కౌన్సిల్ సమావేశంలో. విద్యుచ్ఛక్తికోసం ప్రభుత్వ ఋణం సంపాదించే తీర్మానం నెగ్గలేదు. మధురబాబు రాహువల్లే అడ్డుపడ్డాడు.

నందీబాబుకు చాలా చిరాకుగా ఉంది. మధురబాబు తన ఇంటికి డైనమో సొంతాన పెట్టుకుని విద్యుచ్ఛక్తి వాడుకుంటున్నాడు. తానూ ఆ పని చెయ్యగలడు. కాని అలా చేస్తే మధురబాబును చూసి చేశాడంటారు. డాక్టర్ విమల్ రిహార్సల్సుకు రోజూ అక్కడికి వెళుతున్నాడు. బదీబాబు కులాభిమానంకొద్దీ ఈ మొసలిని ఇక్కడికి చేర్చాడు. మనిషి మంచివాడే. వైద్యంలో గట్టివాడే. ఆస్పత్రిని కాస్త బాగుచేశాడు—కాని విభీషణుడు.

అయితే, నందీబాబుకు విమల్‌మీద పూర్తి ద్వేషం కలగలేదు. అందుకు రెండు కారణాంతరాలు ఏర్పడ్డాయి.

అందులో ఒకటి ఏమిటంటే - విమల్ ఆస్పత్రిలో పనిచేసే వంటవాణ్ణి తీసెయ్యటంద్వారా హరేన్‌బోస్ అనే కంట్రాక్టరుకు ఆగ్రహం తెప్పించి, నందీ అభిమానానికి పాత్రుడయ్యాడు.

దీని వెనక కొంత భాగోతం వున్నది. హరేన్ బోస్ మునిసిపాలిటీలో ఒక "స్వతంత్ర" గ్రూపుకు నాయకుడు. ఈ గ్రూపు ఒకసారి మధురబాబుతో చేతులు కలిపి నందీబాబును ఓడిస్తుంది. మరొకసారి నందీబాబుతో చేరి మధురబాబును ఓడిస్తుంది. ఈ గ్రూపు ఏ సమయంలో ఎటు చేరుతుందో, నిర్ణయించటానికి బల మైన కారణాలే వుంటాయి. ఉదాహరణకు, విద్యుచ్ఛక్తి కంట్రాక్టు హరేన్ బోసుకు లభించే అవకాశా లుండినట్లయితే నందీబాబు తీర్మానం నెగ్గి వుండేది. కాని నందీ బాబు ఆ కంట్రాక్టును తన కొడుక్కి ఇప్పించాలనుకున్నాడు. హరేన్ బోస్ గ్రూపు మధురబాబు పక్షాన ఓటు చేసింది.

ఈ గ్రూపు చిన్నదయినా త్రాసు పళ్ళాలను తలకిందులు చెయ్యగలది. అందుకనే మధురబాబుగాని, నందీబాబుగాని హరేన్ బోస్‌తో విరోధం పెట్టుకోరు. నందీబాబు చెయ్యలేని పని విమల్ చేశాడు. అతను పంటవాణ్ణి తీసేస్తే హరేన్ బోస్‌కు ఎందుకు కోపం రావాలీ అంటే, అందుకు కారణం అందరూ ఎరిగినదే అయినా, పైకి చెప్పదగినదికాదు.

విమల్ మూలాన నందీబాబుకు మరో ఉపకారం ఈ విధంగా జరిగింది. ఉపకారం జరిగినా, జరగకపోయినా, కనీసం విమల్ మీద నందీబాబుకు దురభి ప్రాయం పూర్తిగా పోయింది.

మునిసిపల్ కౌన్సిలు బడ్జెటు మీటింగు జరగబోతున్నది. మెంబర్లకు నోటీసులు వెళ్ళాయి. ఆ సమయంలో బదీబాబు నందీబాబు దగ్గిరికి వచ్చి, మీటింగు వాయిదా వేయమనీ, తనకు జిల్లా కోర్టులో రెండు కేసులూ, ఇతర అర్జంటు పనులూ తగిలాయనీ, తాను పైమాసం మూడో తేదీదాకా రాలేననీ అన్నాడు.

నందీబాబు దిగ్భ్రాంతు డయాడు. బదీబాబు లేకుండా తాను బడ్జెట్ మీటింగు నిర్వహించలేడు. నోటీసులు వెళ్ళి వున్నందున మీటింగు వాయిదా వెయ్యటం అసంభవం.

బదీబాబు కొంచెం ఆలోచించి, "అయితే మీటింగు జరపండి. కోరమ్ లేకుండా చూద్దాం," అన్నాడు నందీబాబు గ్రూపులో నందీబాబు తప్ప మరెవరూ రాకుండా చూడటం తేలిక. హరేన్ గ్రూపుకూడా రాకుండా చూస్తాననీ, మధురబాబు గ్రూపులో ఒకరిద్దరు రాకుండా చూస్తే కోరమ్ వుండదు.

"మధురబాబు గ్రూపులో వాళ్ళని ఆపే దేలా ?" అని నందీబాబు అన్నాడు.

"మన డాక్టరున్నాడుగా ? రిహార్సల్స్ వంకన ఒకరిద్దర్ని మీటింగుకు రాకుండా ఉంచేస్తాడు," అన్నాడు బదీబాబు.

ఆ మాటతో నందీబాబుకు విమల్ తమ పక్షాన గూఢచారిగా శత్రుపక్షంలో మసలుతున్నట్టు అర్థమై, కోపం పూర్తిగాపోయింది...

తలవని తలంపుగా సివిల్ సర్జన్ ఆస్పత్రి తణిఖీ చెయ్యటానికి వచ్చాడు. హరేన్‌బోస్ విమల్‌మీద ఆకాశరామన్న వుత్తరం. రాశాడట. జగదీశబాబు సివిలు సర్జన్ను వెంటబెట్టుకు వచ్చాడు. రిజిస్టరులో పేషంట్ల సంఖ్య క్రమంగా పెరుగుతూండటమూ, విమల్ మైక్రోస్కోపు పరీక్షలు చేస్తూ వుండటమూ, ఆస్పత్రిలో మందులు లేకపోవటమూ, ఆపరేషన్ శస్త్రాలూ మొదలయినవన్నీ పరీక్షించి మంచి రిపోర్టు రాసి సివిలు సర్జను వెళ్ళిపోయాడు.

హరేన్‌బోస్‌కూ విమల్‌కూ ఏనాడూ పడలేదు. కాని స్టేషను మాస్టరు ఘోషాలుతో అతను పనిపెట్టుకుని విరోధం పెట్టుకోవలసివచ్చింది. ఘోషాలు పట్ల అతనికి స్నేహభావం లేకపోయినా, ఆయన చీటికీమాటికీ కబురు పెట్టటమూ, విమల్ వెళుతూండటమూ జరుగుతూ వచ్చింది. ఘోషాలుకు కుచేల సంతానం. అస్తమానమూ ఎవరికో ఒకరికి ఏదో వస్తూనే ఉంటుంది. ఆయన రైల్వేడాక్టరు జగమోహన్ (జగూబాబు)ను తిట్టిపోస్తూనే ఉంటాడు. జగూబాబుతో పరిచయం అయాక విమల్ తెలుసుకున్న దేమంటే, ఆయన ఎంతో సజ్జనుడు, ఎంతో తెలిసినవాడు. అందరికీ అందుబాటులో ఉండి ఆయన తనను తాను చౌకపరుచుకున్నాడు. జగూబాబును తిడితే తాను సంతోషిస్తాడని స్టేషనుమాస్టరు ఉద్దేశమై ఉండవచ్చు.

ఒకరోజు జోరున వర్షం కురుస్తున్నది. విమల్ రిహార్సలుకైనా ఇల్లు కదిలి బయటికి వెళ్ళలేకపోయాడు. ఇల్లు ఒకపక్క కురుస్తున్నది. అక్కడినుంచి పెట్టే బేడా అవతలికి సర్దవలసివచ్చింది. ఈ పరిస్థితిలో రైలుస్టేషను నుంచి పాయింట్స్ మన్ ఒకడు వచ్చి, స్టేషనుమాస్టరు కొడుకు స్పృహతప్పి పడిపోయాడనీ, బాబుగారు వెంటనే రమ్మన్నారనీ, గొడుగు పంపారనీ అన్నాడు.

విధిలేక విమల్ ఆ వానలో పడి వెళితే, కుర్రవాడికి స్పృహ తప్పటమూ లేదు, ఏమీలేదు. మంచంలో పడుకుని నిద్రపోతున్నాడు. కుర్రాళ్ళు కొట్టుకున్నారుట. ఒకడు క్రిందపడ్డాడు. ఒకసారి డాక్టరును పిలిపించి, నాడీ, రొమ్మూ పరీక్షిస్తే మంచిదనుకుని ఘోషాల్‌గారు విమల్ వద్దకు మనిషిని పంపి, తాను స్టేషనులో డ్యూటీకి వెళ్ళిపోయాడు.

మర్నాడు విమల్ ఘోషాలుకు నలభై రూపాయలకు బిల్లు పంపాడు. ఘోషాల్ అది ఇవ్వలేదు. విమల్ దానికోసం వత్తిడి చెయ్యలేదు. ఘోషాల్ అతన్ని మళ్ళీ

పిలవలేదు. "డబ్బిచ్చుకునేకాడికి పనికిమాలిన డాక్టరును పిలవటం దేనికి?" అని కూడా ఆయన విమల్ గురించి అక్కడక్కడా అన్నాడట.

* * *

బలిదానం నాటకం బాగా జరిగింది. అన్ని పాత్రలూ బాగా వున్నాయి. ఆడ వేషం వేసిన కుర్రాడూ, విమల్ మరింత బాగా ప్రేక్షకులను ఆకర్షించారు. స్త్రీలు చాలామంది వచ్చి, ఘోషా స్థలంలో కూర్చున్నారు. ప్రేక్షకులలో ముగ్గురు దొరసానులుకూడా ఉన్నారు. వాళ్లు కొద్దిసేపు వుండి వెళ్ళిపోయారు. మధురబాబు కొత్తగా తెప్పించిన డైనమో లైటింగుకు ఉపయోగపడింది.

ఖర్చులుపోగా మూడువందల రూపాయల చిల్లర మిగిలింది.

"ఇదంతా నీ కివ్వను. రెండువందలయాభై తీసుకో. మిగతాదీ, మరికొంత నా చేతిదీ వేసి మేం పార్టీ చేసుకుంటాం." అన్నాడు అమర్. అతను బీరువాలో నుంచి బ్రాందీసీసా తీస్తుంటే, ఆ పార్టీ ఏమిటో విమల్ అర్థం చేసుకున్నాడు. అమర్ చికిత్సలేని వ్యాధితోబాటు పాడు అలవాట్లుకూడా చేసుకుని చాలా దిగజారి పోయాడు. అతని భార్య వినోదిని గురించి విమల్ చాలా జాలిపడ్డాడు. ప్రేమావేశంలో అతన్ని పెళ్లాడి, పాపం ఆమె చాలా దగాపడింది. ఎప్పటికయినా ఈ సంగతిని ఆమె తెలుసుకోకపోదు.

ఇలా ఆలోచించుకుంటూ అతను ఇల్లు చేరేసరికి ఇంటిదగ్గిర మణిమాలా, ఆమె తమ్ముడూ వచ్చి ఉన్నారు. అతన్ని ఆశ్చర్యపరచాలని ఉత్తరంముక్క రాయకుండా దిగిన మణిమాల, అతను లేకపోయేసరికి నొచ్చుకున్నది. అతను ఏదో కేసుమీద వెళ్ళిఉంటా డనుకున్నది, కాని అతని మొహంమీద సరిగాపోని మేకప్ కనిపించింది.

బలిదానం నాటకం ఆడివొస్తున్నాననీ, మేకప్ సరిగా కడుక్కోలేదనీ విమల్ చెప్పాడు. నాటకం జరిగినది అమర్ ఇంటివద్దనని అతను చెప్పేసరికి మణిమాల ముఖంమీద చిన్న మబ్బు క్షణంపాటు కనిపించింది.

"ఉత్తపుణ్యానికి అకస్మాత్తుగా నాటకం ఎందుకు జరిగిందీ?" అని ఆమె అడిగింది.

విమల్ నిజంగానే ఏదో చేయరానిపని చేసినవాడిలాగా భావించుకుంటూ, ఆస్పత్రి మందులకోసం టిక్కెట్లు పెట్టి నాటకం ఆడినట్టు చెప్పాడు.

ఆ తరవాత ఆమె ఇంటినీ, ఫర్నిచరునూ, గోడలనూ, అతను వేసుకున్న బనీనునూ విమర్శించి, "ఛీ, ఛీ! ఏమిటిదంతా?" అన్నది. ఆమె విమర్శించే ఒక్క విషయం గురించీ అతను అంతకుపూర్వం పట్టించుకోలేదు. కాని ఇక పట్టించుకోవాలి, ఆమె తన అర్ధాంగి.



ఆమె తనవెంట చాలా సామాను తెచ్చింది. అదికూడా అతను ఊహించలేదు. ఎందులో ఏమిఉన్నదీ ఆతను భార్యనడిగి తెలుసుకున్నాడు. ఆమె వొస్తూవొస్తూ కుట్టుమిషను ఒకటి కొనితెచ్చింది. నెలనెలా అయిదేసి రూపాయలు కట్టాలి.

నాటకం అడుతున్నరాత్రే ఆస్పత్రికి ఒక కలరా కేసు వచ్చింది. కలరా ఆని తెలియక గోపీబాబు వాంతులకూ, భేదులకూ మామూలు వైద్యం చేశాడు. రోగి చచ్చాడు. కలరామందు ఇద్దామన్నా తాళపుచెవులు విమల్‌వద్ద ఉండిపోయాయి. గోపీబాబు సొంత ప్రాక్టీసు మాన్పించాలని తాళపుచెవులు విమల్ తనవద్దనే ఉంచుకుంటున్నమాట నిజమే.

ఆ సాయంకాలం అమర్ వచ్చి విమల్‌కు మూడువందల చిల్లరా ఇస్తూ, "నిన్న హాస్యమాడాను. డబ్బంతా తీసుకో. నాన్నగారు నీకు బంగారుపతకం ఇవ్వటానికి ఆర్డరిచ్చారు. ఆయన ఇంకోపనికూడా చేశారు — నిన్నరాత్రి ఆస్పత్రిలో వైద్య సహాయం సరిగాలేక ఒక పేషంటు చనిపోయాడని సివిలుసర్జనుకూ, మేస్ట్రేటుకూ రిపోర్టిచ్చారు," అన్నాడు

విమల్ నోటమాటలేదు.

ఈసారి బదీబాబు అతన్ని కాపాడాడు. ఆయన చెప్పినప్రకారమే అతను అధికార్లకు సంజాయిషీ ఇచ్చుకుంటూ, తాను చైర్మన్ అనుమతితోనే నాటకంలో పాల్గొన్నట్టూ, నాటకం ఆడింది ఆస్పత్రి సహాయార్థమేగాని వినోదంకొరకు కానట్టూ, తాను లేనిసమయంలో కాంపౌండరు ఆస్పత్రిలోనే ఉన్నట్టూ, రోగికి సరయిన చికిత్స జరగలేదన్నమాట అభూతకల్పన అయినట్టూ రాశాడు. నందీబాబు నాటకంగురించి అనుమతించుతూ విమల్‌కు రాసిన ఉత్తరాన్నికూడా బదీబాబు తెచ్చి యిచ్చాడు.

మొత్తంమీద విమల్ తప్పించుకున్నాడు. "ఈకుర్రడాక్టరు జాతకంలో బృహస్పతి కేంద్రస్థానంలో ఉన్నట్టున్నాడు," హరేన్ బోస్ చౌధరీబాబుతో.

"మధురబాబంటే ఏమిటో ఇప్పుడు తెలిసిందా? నల్లతాచు!" అన్నాడు నందీబాబు విమల్‌తో.

"ఇప్పుడు మందులకు మరి లోటులేదు. పని చురుకుగా సాగించు. భూధరబాబుతోనూ, జగదీశబాబుతోనూ విరోధం పెట్టుకోకు," అన్నాడు బదీబాబు.

* * *

కలరా వ్యాపించింది. ఆస్పత్రినిండా కలరా పేషంట్లే. ఆస్పత్రిలో చోటుచాలక, ఎదురుగా ఉన్న ఖాళీజాగాలో విమల్ పాకలు వేయించాడు. నాటకం డబ్బు ఇందుకు ఉపయోగపడింది. పాకలూ నిండిపోయాయి. విమల్ రోగుల ఇళ్ళకే వెళ్ళవలిసి వచ్చింది. స్నానపానాలకైనా అతనికి వ్యవధి లేదు.

విమల్ చేస్తున్నపని చూసి మణిమాల భయపడింది. అతను అనవసరంగా ప్రాణంమీదికి తెచ్చుకుంటున్నా డన్నది. విమల్ వినలేదు. అతని శ్రమఫలితంగా, అందరూ కాకపోయినా, కొందరు రోగులన్నా బతికారు. దీని ఫలితంగా అతనికి చాలా మంచిపేరు వచ్చింది.

అతను వచ్చి ఆరుమాసాలు కాకుండానే మంచి ప్రాక్టీసు అందుకున్నది. ఆస్పత్రి పరిస్థితికూడా బాగుపడింది. ఆస్పత్రిలో రోగులు చాలామంది వస్తున్నారు.

వాళ్ళు విమల్‌గురించి మంచి ప్రచారం చేస్తున్నారు. నందీబాబూ, బదీబాబూ ఎప్పుడూ అతనివక్షమే. హరేన్‌బోసూ, చౌధరీల గ్రూపుకూడా అతనికి అంత విముఖంగాలేదు. ముఖ్యంగా చౌధరీగారి కటాక్షంకోసం విమల్ ఎదురుచూడ సాగాడు. అతనికి కావలసిన అవకాశం రానేవచ్చింది.

చౌధరీగారి మనమడికి జబ్బుచేసింది; జగదీశబాబు వైద్యం సాగలేదు. నానాటికీ కుర్రవాడి పరిస్థితి చెడిపోవటం చూసి, విమల్‌చేత రక్తపరీక్ష చేయించటం మంచి దని జగదీశబాబే అన్నాడు. విమల్ రక్తపరీక్ష చెయ్యకుండానే డిఫ్తీరియా అని చెప్పి, తనవద్ద అదివరకే ఉంచుకున్న సీరం ట్యూబులు వాడి, కుర్రవాడికి నయం చేశాడు. చౌధరీగారు ఎంత బలవంతంచేసినా ఫీజు తీసుకోలేదు.

విమల్ జగదీశబాబును మంచిచేసుకున్నాడు. ధనికుల ఇంటికేసులు వచ్చినప్పుడు, అవసరం ఉన్నా, లేకపోయినా జగదీశబాబునుకూడా పిలిపించి, ఆయనక్కూడా కొంత ముట్టేటు చూసేవాడు.

సివిల్‌సర్జనుతోకూడా అతనికి స్నేహం ఏర్పడింది. విమల్ ఆస్పత్రిని నిర్వ హించే పద్ధతి సివిల్‌సర్జన్‌కు చాలానచ్చింది. అదీగాక ఆయన కుమార్తె తరంగిణి, మణిమాలతోబాటు పరీక్షకు కూర్చున్నది, ఇద్దరూ స్నేహం కలిపారు. ఒకసారి విమల్ మణిమాలను వెంటబెట్టుకుని, తరంగిణిని చూడటానికి వెళ్ళి, వారి కుటుం బంతో పరిచయం చేసుకున్నాడు. అదీగాక అతను ఎప్పుడన్నా తన కేసుకు సివిల్ సర్జన్‌నుకూడా పిలిచేవాడు. ఒక అపరేషన్ కేసులో ఆయన్ని సహాయం పిలిచి, రెండువందల రూపాయలు ఇప్పించాడు.

విమల్ మునిసిపల్ కౌన్సిలర్లదగ్గిర డబ్బు పుచ్చుకోడు. వాళ్ళు అందరికన్నా బాగా ఇవ్వగలవాళ్ళే అయినా భూధరబాబుగాని, జగదీశబాబుగాని, వాళ్ళకు వైద్యం చేసి డబ్బు పుచ్చుకోరు. అలాటప్పుడు విమల్ ఎందుకు పుచ్చుకుంటాడు? అందుచేత వాళ్ళందరికీ అతనంటే ఇష్టమే. అతని ప్రాక్టీసు అడ్డంలేకుండా సాగిపోసాగింది.

బాఘ్‌మారీ జమీందారు సీరమోహన్ కబురంపితే విమల్ వారి కారులో పన్నెండు మైళ్ళు ప్రయాణంచేసి వెళ్ళాడు. వారి కుటుంబంలో సుప్రియసర్కార్ అనే యువతికి జబ్బుగా ఉన్నదని అతను అర్థంచేసుకున్నాడు. కాని తనకేమీ జబ్బు లేదన్నది సుప్రియ. ఆమెను కలకత్తా వైద్యులు పరీక్షించి రిపోర్టు ఇచ్చారు. దానిలో ఆమెకు ఫలానా జబ్బు అని లేదు. డాక్టర్లు ఏవో ఇంజెక్షన్లు రాసి ఇచ్చారు. విమల్ ఆమెకు ఆ ఇంజెక్షనే ఒకటి ఇచ్చి తిరిగి వచ్చేశాడు.

మణిమాల కోరిన బాజూబందులు పేరుమోసిన కంసాలిచేతనే చేయించాడు.

కాని ఆమె కవి నచ్చలేదు. వాటిలో లోపం ఏమిటో విమల్ తెలుసుకోలేక పోయాడు.

*  *  *

ఒకనాడు విమల్, భూధరబాబు వెంట పడవలో కమర్ ఖాలీలోని అఖిలచౌధరీగారింటికి బయలుదేరాడు. ఆయన చౌధరీగారి తమ్ముడే. అందుచేత విమల్‌కుకూడా పిలుపు వచ్చేట్టు చేశాడు.

భూధరబాబు ఆహారంతోబాటు రెండు సీసాలుకూడా తెచ్చాడు. విమల్‌కు అలవాటు లేకపోయినా, కంపెనీకోసం రెండు గుక్కలు పుచ్చుకోవటానికి ఒప్పుకున్నాడు. తాను తాగకపోతే భూధరబాబు తాగటానికి సంకోచిస్తాడు. తానేమో సాధువు పోజు వేసినవాడై, భూధరబాబు స్నేహానికి దూరమవుతాడు.

ఆ వెన్నెలరాత్రి పడవ ప్రయాణంలో భూధరబాబు విమల్‌కు లౌకికవిజ్ఞానం కొంత చెప్పాడు : బిజినెస్ ఈజ్ బిజినెస్. ప్రపంచంలో చాలా డబ్బుంది. దాన్ని రాబట్టి సొంతం చేసుకోవటమే వ్యాపారం. డబ్బు దానంతట అదివచ్చి మనజేబులో పడటంకల్ల. మామూలు బెల్లాన్నే కాస్త శుద్ధిచేసి, విటమినులపేర అందులో అదీ ఇదీచేర్చి, సీసాలకెక్కించి అమ్మి హెచ్చులాభం గడంచవచ్చు. ఎడ్వర్టయిజ్ చేస్తే ఏదన్నా అమ్ముతుంది. రోజుకో కొత్తమార్గం తొక్కండి కాలు విలదొక్కుకోలేం. రాఖాల్‌నందికి ఏముంది ? కులం గొప్పలేదు, చదువులేదు; కాని ఎంతెంత చదువుకున్నవాళ్ళూ అతని వాకిలిదగ్గిర పడిగాపులు కాస్తారు. ఎందుకు ? జనపనార వ్యాపారంలో ఒకలక్ష సంపాదించాడు. డబ్బుతో ఖ్యాతీ, గౌరవమూ వచ్చాయి. చైర్మను అయాడు. కొండమీదకోతిని తేగలడు .. వైద్యంతో పొట్టగడిచేకాలం వెళ్ళిపోయింది. ఎక్కడచూసినా డాక్టర్లే - హోమియో వైద్యులు, యూనానీ వైద్యులు, నాటువైద్యులు, భూతవైద్యులు ! అందాకాదేనికి ? సీనియరు డాక్టరు జగదీశబాబు మూడువందలు మించి సంపాదించలేదు.

"కాంపెటీషను ! అందుకే నేను మామూలు వైద్యంతోబాటు హోమియో, ఆయుర్వేదమూ కూడా చేస్తాను. ఎక్కడ ఏది అవసరమైతే అదే వాడతాను. హోమియోమందుల్లో ఉన్న మేలేమంటే, పనిచెయ్యకపోతే హానిచెయ్యవు, తియ్యగా ఉంటాయి. పని చేశాయంటే అమోఘంగా చేస్తాయి," అన్నాడు భూధరబాబు.

వాళ్ళు వెళుతున్న ఊళ్ళో ఉండే డాక్టరొకడు గొప్ప ఘటికుడుట. ఇల్లూ, వాకిలీ, పొలమూ, పుట్రా పుష్కలంగా సంపాదించుకున్నాట్ట. రోజూ రెండణాల బార్లీగింజలతో గంగాళం జావకాచి పేదరోగులకుపోసి గొప్పకీర్తి సంపాదించాట్ట.

ఎం. బీ. కాదట. ఇతరులు మాట్లాడుతుంటే తానేమీ అనడుట. ముఖంచిట్లించి చూస్తాట్ట, లేదా చిరునవ్వు నవ్వుతాట్ట. మాట్లాడేవాడు వెళ్ళిపోయాక ఎంతైనా మాట్లాడతాట్ట. ఒకసారి ఆవూళ్ళో ఒకామెకు జ్వరం తగులుతుంటే, ఇతన్ని కాదని సివిల్ సర్జన్‌ను పిలిపించారట. ఆయనగారు క్వినైన్ మిక్శ్చర్ ఇచ్చాడు. ఆయన వెళ్ళిపోయాక ఈ డాక్టరు ఆమందును గచ్చుమీదవేసి, అది బుసబుసా పొంగటం చూపించి, "ఈమందా ఈ అమ్మాయికిస్తారు?" అన్నాడు. రోగి బంధువులు భయపడి దాన్ని వాడటం మానేశారు.

భూధరబాబు ఆ డాక్టరుకు తనఫీజులో నాలుగోవంతు ఇస్తాట్ట. అందుచేత అతను ఈయనకు అడ్డుతగలడు!

ఈసంగతివిని విమల్ నిర్ఘాంతపోయాడు.

అఖిల చౌధరిగారింటి రోగికి నాలుకమీద కేన్సరు పుట్టింది. కాని భూధరబాబు ముఖంచూస్తే ఆమాట పైకి అనరాదని విమల్‌కుతోచింది. కాని అఖిలచౌధరీ అతన్ని తన అభిప్రాయం అడిగితే, విమల్ బుర్రగోక్కుని, "కష్టమే," అన్నాడు.

వెంటనే భూధరబాబు, "కష్టమని చుక్కాని వదిలివెయ్యంగా! చాతనైన ప్రయత్నం చెయ్యాలిసిందే," అన్నాడు. ఆయన కాగితంమీద పెద్దమందులజాబితా - ఒక్కొక్క వ్యాధి లక్షణానికీ వేరే వేరేమందు - రాసియిచ్చాడు. రోగిని కలకత్తా తీసుకువెళ్ళే విషయం సలహా అడిగితే, "మంచిదే. కాని ప్రయాణం చాలాకష్టం. పది పదిహేను రోజుల్లో రక్తస్రావం ఆగి, బలంకాస్త చేకూరితే అప్పుడాలోచిద్దాం" అన్నాడాయన.

తిరుగు ప్రయాణమప్పుడు భూధరబాబు విమల్‌తో, "కేన్సరు నయంకాదని చెబితే మనకేం ఒరుగుతుంది? మనం వదిలేస్తే చుక్కాని మరొకరు పట్టుకుంటారు. చెయ్యగలిగినమటుకు వారు ఖర్చుచెయ్యాలి, రాబట్టిన మటుకు మనం రాబట్టాలి," అన్నాడు.

విమల్ కూడా తనవంతుఫీజులో స్థానిక డాక్టరుకిచ్చాడు. అతనికిదంతా చాలా గొడవగాఉన్నది.

*　　　*　　　*　　　*

మణిమాలకు అరణ్యంలో ఉన్నట్టున్నది. పాతఇల్లు. నేలా, గోడలూ పెచ్చు లూడాయి. వానకురిస్తే దొడ్డియావత్తూ బురద. ఇల్లు ఊరికి ఒకచివర. ఊర పొద్దూక్కుమునుపే నిర్జనంగా అవుతుంది. నక్కలుకూడా తిరుగుతాయి. విమల్ సహచరుల భార్యలందరూ నగలనుగురించీ, చీరెలనుగురించీ "అడ" ప్రశ్న లడుగు

తారు. ఆమెకు శరత్‌గురించీ, టాగూరు కవిత్వంగురించీ చర్చించాలని ఉంటుంది. దీనికితోడు భార్యాభర్తలమధ్య కీచులాటలుంటాయి. విమల్ ఒకరోజు ఆస్పత్రి నుంచి చచ్చిచెడి వచ్చి కాస్త పడుకుందామనుకుంటే మణిమాల కుట్టుమిషను దడదడ లాడించింది. "ఇది ఇల్లా, దర్జీదుకాణమా?" అని అతను చిరాగ్గా అడిగాడు.

ఒకనాటి అర్ధరాత్రి విమల్‌ఇంట దొంగపడ్డాడు. నౌకరు సహాయంతో దొంగ పట్టుపడ్డాడు గాని, భయంతో మణిమాల మూర్ఛపోయింది. తరవాత ఒళ్ళుతెలిసి ఆమె, "ఇక్కడ చచ్చిపోతాను, ఒక్కక్షణం ఉండను," అని రాగాలుపెట్టింది. అతను సమదాయించచూచాడుగాని ఆమెకు భయమూ, ఒణుకూ పోలేదు.

దొంగ మరెవడోకాదు, విమల్ ఆస్పత్రినుంచి పంపిన భైరవుడు అనేవాడు. వాడి భార్యవచ్చి, "ఈసారికి విడిచిపెట్టండి," అని విమల్‌ను బతిమాలింది. అర్ధరాత్రివేళ తనభర్తను కాపాడటానికి వచ్చిన ఆక్షుద్రస్త్రీలో అతనికి తనభార్యలో లేని గొప్పతనం కనిపించింది. ఆస్పత్రిలో పని ఉన్నదని భార్యతో అబద్ధంచెప్పి, అతను తిన్నగా పోలీసు ఇన్‌స్పెక్టరు దగ్గిరికివెళ్ళి, భైరవుణ్ణి వదిలిపెట్టమని కోరాడు. విమల్‌దగ్గిర ఉచితంగా వైద్యంపొందే ఇన్‌స్పెక్టరు, "సరే,మీయిష్టం!" అని దొంగను వదిలేశాడు...

హీరాలాల్ మల్లిక్‌ను విమల్ బాఘమారీ జమీందారింట కలుసుకొన్నాడు. హీరాలాల్‌కు మధుమేహం. విమల్‌ను చికిత్సచెయ్యమన్నాడు. తీపి సరుకు తినటం మానాలంటే హీరాలాల్ వినడు. తన ఇష్టం వచ్చినది తినేపక్షంలో రోజూ ఇన్సులిన్ ఇంజెక్షన్లు తీసుకోవటానికి సిద్ధమయాడు.

హీరాలాల్ అన్నకు కుష్ఠు. అతనికికూడా విమల్‌నే వైద్యం చెయ్యమన్నాడు హీరాలాల్. తరవాత తన కూతురునుపిలిచి, ఆమె ముఖంమీది మొటిమెలకుకూడా వైద్యం చెయ్యమన్నాడు.

అతను ఇంటికి వచ్చేదారిలో అతనికి ఒక ఉత్తరం అందింది. అది వినోదిని రాసింది. ఆమె భర్త అమర్ సంఘసేవలోపడి ఇల్లుపట్టకుండా తిరుగుతున్నాడు. అతను ఏదో మందు రహస్యంగా తినటం ఆమె కంటపడింది. జబ్బేమిటంటే అతను సరిగా చెప్పక, అజీర్తికి విమల్ ఏదో ఇచ్చాడని చెప్పాడట. అతనికేమి జబ్బో స్పష్టంగా తెలపమని వినోదిని విమల్‌ను ఉత్తరం ద్వారా కోరింది.

ఆమెకు అమర్ రహస్యం చెప్పటం అసంభవం. విమల్ ఆస్పత్రిలో ఒక ప్రాక్చరుకేసు చూసి వస్తుండగా అమర్ బృందం గానాబజానాతో క్షామపీడితుల కోసం చందాలు వసూలుచేస్తూ ఎదురయింది. విమల్ తనవంతు చందావేసి,



అమర్‌ను తనవెంట గంగాతీరానికి తీసుకుపోయి, వినోదిని రాసిన ఉత్తరాన్ని అతనికి చూపాడు.

"నే నేం చెయ్యను ? ఆమెకు దూరంగా పారిపోవటం తప్ప నేనేమీ చెయ్యలేను," అన్నాడు అమర్. ఆమెతో నిజం చెప్పటమే మంచిదన్నాడు విమల్. అందుకు అమర్ ఒప్పుకోలేదు.

కాని తన వృత్తిలో నిజం చెప్పటం వల్ల ఏమీ ప్రయోజనం లేదు. నిజాన్ని కప్పితేనే లాభిస్తున్నది. జమీరుద్దీన్ భార్యకు జబ్బు, ఘోషాస్త్రీ. నాడిచూసి రోగం తెలుసుకుని వైద్యం చెయ్యాలి. అది సాధ్యమయ్యే పనికాదు. ఆ మాట జమీరుద్దీనుకు



చెప్పి లాభం లేదు. పూర్వకాలంలో ఘోషాస్త్రీల చేతికి దారం కట్టి ఆ దారాన్ని వైద్యులు పట్టుకుని రోగనిదానం చేసి చికిత్స చేసేవారట. గడిచిన కాలం ముందు వర్తమానం ఎందుకూ పనికిరాదు. అందుచేత రోజూ జమీరుద్దీన్ ఇంటికి వెళ్ళి, తోచిన మందిచ్చి. ఫీజు పుచ్చుకుంటూ ఉండటం తప్ప విమల్‌కు మరో మార్గం లేదు.

మళ్ళీ కౌన్సిలు మీటింగు జరగబోతున్నది. విద్యుచ్ఛక్తి సమస్య వస్తుంది. కిందటిసారి నందీబాబుకు అపజయం తటస్థించింది. ఈసారైనా గెలవకపోతే నందీబాబుకు మతిపోతుంది. ఇప్పుడు కౌన్సిలర్లంతా విమల్ మిత్రులే గనక, అందరినీ విద్యుచ్ఛక్తి తీర్మానాన్ని బలపరచమని కోరాలని బదీబాబు విమల్‌ను కోరాడు.

"తీర్మానం నెగ్గితే ప్రభుత్వం అవసరమైన ఋణం ఇస్తుందా?'' అని విమల్ అడిగాడు.

బదీబాబు కాస్సేపు ఆలోచించి, "విద్యుచ్ఛక్తి రావటం ప్రధానం కాదు, నందీబాబు పరువు నిలబడటమే ప్రధానం. ఈ తిప్పలన్నీ దానికే," అన్నాడు...

విమల్ సుప్రియసర్కారుకు ఇంజెక్షన్లు ఇస్తూనే ఉన్నాడు. ఆమెలో మార్పేమీ లేదు. అప్పుడప్పుడూ గుండెదడ వస్తూనే ఉన్నది.

ఒకనాడు ఆమె భర్త విమల్‌ను, "ఇంతకూ ఆమె అసలు జబ్బేమిటి?" అని అడిగాడు.

"సంతానం లేకపోవటమే ఆమె జబ్బు," అన్నాడు విమల్.

కాని సంతానం కనటం సుప్రియకు ఇష్టం లేదట. దానికి కారణం ఆమె భర్త ఇల్లరికపు టల్లుడు కావటమే.

ఈ సంగతి విమల్‌కు లోగడ తెలీదు. సుప్రియభర్త ఎమ్మే ఫస్ట్‌క్లాసులో పాసైనాడు. కాని అతనికి ఎక్కడా ఉద్యోగం దొరకలేదు. ఇంకా ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఒక కాలేజీలో ఖాళీ ఉన్నదని తెలిసి అప్లికేషను వేశాడు. కాని ఇలా చాలాసార్లు నిరాశ అయింది.

"ఖాళీ ఉన్న కాలేజి ఏది?" అని విమల్ అడిగాడు. సుప్రియ భర్త చెప్పాడు. అది విమల్ మామగారు ప్రిన్సిపల్‌గా పనిచేస్తున్న కాలేజీయే.

"కాలేజీ కమిటీలో ఒకరిద్దరు మెంబర్లుకూడా నాకు తెలుసు. తప్పక ప్రయత్నిస్తాను," అన్నాడు విమల్...

ఘోష్‌గారి కుటుంబంలో పదిహేడు, పద్దెనిమిదేళ్ళ వయస్సుగల ఒక పిల్ల తన బట్టలమీద కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకున్నది. ఆమె అతనితో, "నన్ను బతికించకండి. నాకు జీవించాలని లేదు," అన్నది. చివరకామె చనిపోయింది. నందీబాబుకొడుక్కూ, ఆమెకూ, ఏదో సంబంధం ఉందన్నారు. దాన్ని గురించి విమల్ పట్టించుకోలేదు. మానవ జీవితంలో కలిగే దుష్పరిణామాలే అతన్ని బాధించాయి. చదువులూ, ఉపదేశాలూ; ఏవీకూడా మానవుడిలోని రాక్షసత్వాన్ని నిరోధించటం లేదు. పూర్వం మూఢవిశ్వాసాలు కొన్ని మనుషులను కొంత వరకు హద్దులో ఉంచేవి. ఈనాడు అవి పోయాయి. ఇప్పుడందరూ తెలివి మీరారు. దాని ఫలితం స్త్రీలు అనుభవిస్తున్నారు ధనికులు చేసే వ్యభిచారం లాంటి పనులు దరిద్రులు చేసి నిందమోస్తున్నారు. సమాజానికి ధనమే భగవంతుడయింది.

తానూ డబ్బునే పూజిస్తున్నాడు. సంపాదనలోపడి తానుకూడా ఆస్పత్రిని నిర్లక్ష్యం చేస్తున్నాడు. తీరిక చిక్కినప్పుడు ఆస్పత్రికి వెళతాడు. పాతరోగులకు "అదే మందు" ఇస్తుండమని కాంపౌండరుతో చెబుతాడు. ఆస్పత్రిలో చికిత్సలు అవకతవకగా జరుగుతున్నాయి ...

నందీబాబుకు ఒక గురువు ఉన్నాడు. ఆయన వచ్చి, నందీబాబు ఇంట జబ్బు పడ్డాడు. నందీబాబు విమల్‌కోసం మనిషిని పంపాడు. ఆ మనిషివచ్చి, నందీబాబు గురువుకు జ్వరం వస్తున్నదనీ, భూధరబాబూ, జగదీశబాబూ అక్కడే ఉన్నారనీ, విమలబాబునుకూడా నందీబాబు పిలుచుకురమ్మంటున్నారనీ చెప్పాడు.

అదేసమయంలో అక్కడికి వచ్చి నిలబడి భైరవుడిభార్య, తనబిడ్డకు రెండు

రోజులనుంచీ జ్వరంగా ఉందనీ, ఒకసారి చూడమనీ, తనచంకన ఉన్న పిల్లవాణ్ణి చూపింది.

"నేను ఆస్పత్రికి వచ్చిచూస్తాను. అక్కడికిపద," అని విమల్ నందీబాబు ఇంటికి వెళ్ళాడు. ముగ్గురు డాక్టర్లూ కన్సల్టేషన్ పెట్టారు. ఫ్లూలాగున్న దన్నాడు భూధరబాబు. ఎలా చెప్పగలమన్నాడు జగదీశబాబు. విమల్ పరీక్షచేశాడు. గురువుగారిలో ఏ రోగమూ ఉన్నట్టు అతనికి తోచలేదు. ఫ్లూయేకావచ్చు నను కున్నాడు.

టీతో అల్లపురసం చేర్చి తాగవచ్చునా అని గురువుగారడిగాడు. తాగమన్నాడు విమల్.

జగదీశబాబు రోగి వీపుకింద కుడిపక్క కొంచెం ఫ్లైపిటేషన్ ఉన్న దన్నాడు.

"ఇన్‌ఫ్లూయెంజా నుమోనియా అయివుండవచ్చు." అన్నాడు విమల్.

డాక్టర్ల సంభాషణ వింటున్న నందీబాబుకు మతిపోతున్నది.

చివరకు, విమల్ రక్తపరీక్ష చేసేటట్టూ, భూధరబాబు ఒకదోసు హోమియో మందు ఇచ్చేటట్టూ తీర్మానం అయింది.

విమల్ ఆస్పత్రికి తిరిగివచ్చేసరికి చాలా ఆలస్యమయింది. అంతసేపూ భైర వుడి భార్య వేచివున్నది. ఆమెచంకలో బిడ్డకు సరిగా ఊపిరి ఆడటంలేదు. విమల్ వాణ్ణి పరీక్షించి డిఫ్తీరియాకేసని తెలుసుకున్నాడు. ఆస్పత్రిలో ఉండిన రెండు సీరమ్‌గొట్టాలూ చౌధరీగారి మనమరాలికి వాడేశారు. జగదీశబాబు షాపుకు మని షిని పంపితే అక్కడా ఆ మందులేదు. భైరవుడి బిడ్డ బతకడు.

విమల్ ఆ మందుకోసం కలకత్తాకు తంతి ఇచ్చాడు. కలకత్తానుంచి మందు రాగానే తన బిడ్డకు చికిత్స చేస్తానని విమల్ అన్నప్పుడు, అతను మనిషికాదనీ, నిజంగా దేవుడనీ భైరవుడి భార్య అనుకున్నది.

తరవాత అతను బ్రాందీసీసా తీసి, నీళ్లు కలపకుండానే తాగేశాడు. సీసా ఖాళీ కావస్తున్నది.

చావబోతున్న భైరవుడి కొడుకును అతను మరవలేకుండా ఉన్నాడు. వాడు పేదవాడు గనక చనిపోతాడు. కాలు నిలవక విమల్ భైరవుడి ఇంటికి వెళ్ళి పిల్ల వాణ్ణి మరొకసారి చూసి, "బిడ్డ ఊపిరిపీల్చటం కష్టమైతే నాకు కబురుచెయ్యి," అన్నాడు.

అతను తిరిగివచ్చేటప్పుడు తనను గురించి ప్రజలు అనుకునే గుసగుసలు వినిపించాయి.



"భైరవుడి కొడుకు గురించి ఎంత శ్రద్ధ! తన సొంత డబ్బుతో మందుకోసం కలకత్తాకు వైర్ ఇచ్చాట్ట! భైరవుడి పెళ్ళాం అదృష్టం!...అంత చక్కని పెళ్లాం ఉండగా ఈ కునిష్టిదాన్ని ఎందుకు పట్టుకున్నాడు!..."

విమల్ గోపీబాబుద్వారా భైరవుడి ఇంటికి మూడుడోసులు స్టిములెంట్ మిక్శ్చర్ పంపించి, గంటకొక డోసు ఇవ్వమనీ, వాడి స్థితి గురించి తనకు గంటగంటకూ తెలపమనీ అన్నాడు.

* * * *

నందీబాబు గురువుగారి రక్తాన్ని ఎంత పరీక్షించినా మలేరియా లక్షణాలు ఏమీ

కనిపించలేదు. కలకత్తా నుంచి వచ్చిన ఒక డాక్టరు ఒక డోసుమందు ఇవ్వగానే జ్వరం తగ్గనారంభించింది. ఆ డాక్టరే సాయంకాలం అయిదుగంటలకు మధుర బాబుగారింటికి, శేఫాలీ ఉబ్బసాన్ని చూడటానికి వస్తున్నాడనీ, విమల్‌బాబు ఈ లోపలే అక్కడికి రావాలనీ వర్తమానం వచ్చింది.

విమల్ వెళ్ళేసరి కింకా ఎవరూ రాలేదు. మధురబాబు ఒక్కడే ఉన్నాడు. అమర్ క్షామబాధ నివారణచేసి, స్పోర్ట్సు చూడటానికి కలకత్తా వెళ్ళాడట.

మధురబాబు విమల్ గురించి మరొక వార్త చెప్పాడు. అతను సొంత ప్రాక్టీసులోపడి ఆస్పత్రి గురించి పట్టించుకోవటం లేదనీ, ఆస్పత్రిలో కూడా డబ్బివ్వని వాళ్ళకు చికిత్స చేయకపోగా, గాయాలు మరింత రేపుతున్నారనీ హరేన్‌బోసు సివిల్‌సర్జనుకు రిపోర్టిచ్చాడట, దాని పైన మధురబాబు కూడా సంతకం చేశాట్ట.

ఉన్నతాదర్శాలకు పోతే జరుగుబాటు కాదని విమల్ తనను తాను సమర్థించుకో జూశాడు.

"ఉన్నతాదర్శాలమాట దేనికి? అసలు మనకే ఆదర్శాలున్నాయి. అవకాశవాదం తప్పిస్తే మనకున్న ఆదర్శమేమిటి? ఎక్కడబడితే అక్కడ ఉమ్మెయ్యకుండా ఉండటంలాటి అల్ప ఆదర్శాన్నికూడా మనం పాటించం," అన్నాడు మధురబాబు.

విమల్ చివరకు, "జరిగేది జరగనివ్వండి. నాకూడా ఉద్యోగం చెయ్యాలని లేదు," అన్నాడు.

కలకత్తా డాక్టరు మధురబాబు కుమార్తెను పరీక్షించి ఇరవైనాలుగు ఇంజెక్షన్లు రాసి ఇచ్చాడు. ఆ ఇంజక్షన్లు కలకత్తాలోనో, తప్పిస్తే బొంబాయిలోనో దొరుకు తాయని ఆయన చెప్పాడు. ఇంతకూ ఆయన ఆ ఇంజెక్షనును ఎన్నడూ వాడి చూడ లేదుట, కొత్తగా వచ్చిందిట. కాని చాలామంచిదిట. డాక్టరు వెళ్ళిపోయాక ఆయన రాసిఇచ్చిన మందుచీటిని చింపి పారేశాడు...

సుప్రియభర్త సువ్రతబాబుకు కాలేజీలో ఉద్యోగం ఇప్పించటానికి విమల్‌కూడా వెళ్ళవలసి వచ్చింది. సుప్రియా, సువ్రతబాబూ, విమల్, మణిమాలా కలకత్తా వెళ్ళారు. విమల్ కృషి ఫలించి సువ్రతబాబుకు కాలేజీలో పని కుదిరింది.

మణిమాలను ప్రసవం అయినదాకా ఉండనివ్వమని విమల్‌ను అత్తగారు కోరింది. మణిమాలకు మూడునెల్లు నిండాయి. ఇప్పటినుంచీ దేనికంటే అత్తగారు విని పించుకోలేదు. మణిమాలకుకూడా కలకత్తాలో ఉండాలనే ఉన్నది. భర్తకు కోపం వస్తుందేమోనని భయపడుతూ, "ఎప్పుడు తోచకపోతే అప్పుడు మీదగ్గిరికి వచ్చేస్తాను," అన్నది.



విమల్ ఒంటరిగా తిరిగి వెళ్ళిపోయాడు.

రెండునెల్లు గడిచింది.

హరేన్ బోస్ రిపోర్టువల్ల విమల్‌కు ఏమీ నష్టంజరగలేదు. సివిల్ సర్జన్ అతన్ని పిలిచి మాట్లాడాడు. అంతావిని, కొంచెం జాగ్రత్తగా ఉండమని హెచ్చరించి పంపేశాడు.

మధురబాబు భార్యాసమేతంగా మధురలో నివాసంపెట్టుకున్నాడు. నందీబాబు చైర్మన్‌గా ఏకచ్ఛత్రాధిపత్యం వెలిగిస్తున్నాడు. విద్యుచ్ఛక్తి తీర్మానం నెగ్గింది. పరేశదాదాకు బదిలీ అయింది.

అమర్ తనభార్యకు తనరోగం గురించి చెప్పనేలేదు.

మణిమాల వద్దనుంచి ఉత్తరాలు వస్తున్నాయి.

విమల్ ఆందోళనతో ఉన్నాడు. అతని అభిప్రాయాలకూ, ఆచరణకూ పొంతన లేకుండా ఉన్నది. కాని తన జీవితవిధానంలో అక్రమాలను వదులుకో లేకుండా ఉన్నాడు. బీదరోగులను గోపీబాబు పిండేస్తున్నాడు. కాని విమల్ తన సొంత ప్రాక్టీసుమూలంగా గోపీబాబుకు రోగులను వదలిపెట్టక తప్పటంలేదు.

ఈ స్థితిలో ఒకనాడు విమల్ అద్దంలో తనముఖంచూసి దడుచుకున్నాడు. ముఖంనిండా ఎర్రనిమచ్చలు ఏర్పడ్డట్టు కనబడింది। ముఖంమీది మచ్చలను దాచ టానికికూడా లేదు.

"పాపం ఊరికే పోతుందా? భైరవుడి భార్యతో తిరిగితే ఏమవుతుంది? మధుర బాబు కోడలిని కారులో వేసుకుతిరుగుతున్నాడు. అడిగేవాళ్ళులేరు," అన్నాడు హరేన్ బోస్. డాక్టరు కుష్ఠురోగి గనక అతన్నివెంటనే తొలగించాలని సివిలుసర్జనుకు ఆయన విజ్ఞాపన పంపాడు.

తాను వైద్యవృత్తిలో చేసిన అపచారాలకు ఇది శిక్ష అనుకున్నాడు విమల్. అతని భవిష్యత్తు దగ్ధమైపోతున్నది. అతను చేయగలిగింది ఏమీలేదు. అకస్మా త్తుగా అతనికి పనిలేకుండా పోయింది — కొద్దిరోజులక్రితం తీరికఉండేది కాదు। అతను ఆస్పత్రికి వెళ్ళటంలేదు. ఆ ముఖంతో ప్రజలకెలా కనిపించటం? నౌకరు యోగేన్‌కూడా పనిలోకి రావటం మానుకున్నాడు.

జగదీశబాబు వచ్చిచూసి, కలకత్తాలో పరీక్ష చేయించుకురమ్మని విమల్‌కు సలహా ఇచ్చాడు.

భూధరబాబు వచ్చి, "మీరు మాంసంతప్ప ఏ కూరలూ తినరు. లివర్‌చెడి ఇలా జరిగింది. కాల్షియం ఒక కోర్స్ తీసుకోండి. రెండురోజుల్లో తగ్గుతుంది," అన్నాడు. అతనికి బయటికి రావటం ఇష్టంలేకపోతే మైక్రోస్కోపు పరీక్షలుచేస్తూ ఇంట్లో కూర్చోమనీ, తాను కేసులు పంపుతాననీకూడా ఆయన అన్నాడు.

విమల్‌ను సివిల్‌సర్జన్‌కూడా పరీక్షించాడు.

"ఆరుమాసాలు శెలవుపెట్టి ఎక్కడికైనా వెళ్ళండి. కుష్ఠు అయిన పక్షంలో ఆరు మాసాలలోగా తెలిసిపోతుంది," అన్నాడాయన.

విమల్ ట్రాపికల్ స్కూలుకు వెళ్ళి పరీక్ష చేయించుకున్నాడు. ఏమీ నిర్ధార ణగా తేలలేదు. పైకి రాయటాని కేదో మందిచ్చి, మళ్ళీరమ్మన్నారు. అతనుతిరిగి ఆస్పత్రికి వెళ్ళలేదు. నందీబాబుకు శెలవుచీటీపంపి తనస్వగ్రామానికి వెళ్ళిపోయాడు.

* * *

విమల్ తన గ్రామానికి వచ్చి సంవత్సర మయింది.

కుష్ఠురోగికి వైద్యంచేస్తూ అతను తనకు కుష్ఠు తెచ్చుకున్నాడు. శంభుచాచా అనే సజ్జనుడు ఆతని కేవో ఇంజక్షను లిస్తున్నాడు. విమల్ తనకు గల కొద్దిభూమిలో వ్యవసాయం చేసుకుని జీవిస్తున్నాడు. పరిశుభ్రమైన గాలి, పైన స్వేచ్ఛాకాశం— అతను సుఖంగానే ఉన్నాడు. వ్యవసాయంతోబాటు అతను వైద్యంకూడా చేస్తూనే ఉన్నాడు. డబ్బిచ్చేవాళ్ళకు వైద్యం చెయ్యటంలోఉన్న కష్టం అతనికి తెలిసివచ్చింది. తా మిచ్చే కొద్దిడబ్బుతో వైద్యుడు మృత్యువును జయించాలంటారు. పేదవాళ్ళు అలా అనరు; వాళ్ళు వైద్యాన్ని డాక్టరు చేతిలోపెట్టి, భగవంతుణ్ణి నమ్ముకుంటారు; ప్రాణమూ, మరణమూ భగవంతుని అధీనమని అంగీకరిస్తారు. ధనికులు పైకి దేవుణ్ణిగురించి మాట్లాడతారుగాని, అంతరంగంలో నాస్తికులే.

ఒకనాడు తలవనితలంపుగా పరేశదాదా వచ్చి కొన్నివార్తలు తెలిపాడు.

సుప్రియసర్కారు తల్లి అయింది.

బదీబాబు చనిపోయాడు.

అమర్ పూర్తిగా తాగుబోతు ఆయాడు. అతని జమీందారీ అప్పులలో తల మునకలుగా ఉన్నది.

"ఇది మరీ కుగ్రామమే! మణిమాల ఇక్కడ ఉండగలుగుతుందా?" అన్నాడు పరేశదాదా.

"మీరు వినలేదా? ప్రసవించినప్పుడు చనిపోయింది." అన్నాడు విమల్. ★



# ముందు-వెనక

*** డి. కామేశ్వరి ***

సుమిత్ర, సుదర్శన్ పోర్టికోలో కారు దిగేసరికే లోపట్నుంచి నవ్వులు, మాటలు అట్టహాసంగా వినిపిస్తున్నాయి. ఇల్లంతా దీపాలతో కళకళ లాడుతూంది.

గుమ్మంలోనే ఎదురు వచ్చి చేతులు కలిపి సాదరంగా ఆహ్వానించాడు జార్జి. "మీట్ మై కొల్లీగ్ అండ్ డియరెస్ట్ ఫ్రండ్ సుదర్శన్, ఎనీజ్ మిసెస్ సుదర్శన్" అంటూ లోపల మిగతా అతిథులకి అందరికి పరిచయం చేశాడు జార్జి. నమస్కారాలు, ప్రతినమస్కారాలు, పలకరింపులు ఫార్మాలిటీస్ అయ్యాక ఇద్దరికి కుర్చీలు చూపించి ఇంకెవరో వస్తే ఎదురెళ్ళాడు జార్జి.

సుమిత్ర చుట్టూ చూసింది. అందంగా, ఆధునికంగా అలంకరించిన డ్రాయింగు రూము, పార్టీకోసం వేసిన కుర్చీలతో నిండివుంది. గుమ్మాలకి తెరలు, గోడలకి పెయింటింగులు. బుక్ కేసుమీద డెకరేషను పీసెస్. అంతా జార్జి అభిరుచినే కాక అంతస్థునికూడా చాటుతూంది. బ్రహ్మచారైనా యిల్లు చక్కగానే పెట్టుకున్నాడనుకుంది సుమిత్ర.

జార్జి ఎంగేజ్‌మెంట్ పార్టీ యిది. పార్టీ అంటే పెద్ద ఎక్కువ మందిలేరు. సుదర్శన్ దంపతులు కాక యింకో ఆరేడు జంటలు వున్నారు.

సుమిత్రకి అందరూ క్రొత్తవాళ్ళే, ఒక్క మిసెస్ నంబియార్ తప్ప.

సుదర్శన్, జార్జి ఇద్దరూ డాక్టర్లు! ఫారెన్ రిటర్న్‌డ్ డాక్టర్లు! యిద్దరూ ఒకే మందుల కంపెనీలో పెద్ద జీతాల మీద పనిచేస్తున్నారు మద్రాసులో.

రావలసిన అతిథు లందరూ వచ్చినట్లున్నారు.

"ఏరోయ్ నీ ఫియన్సీ. దాచేసావా మాకు చూపిస్తే దిష్టి తగులుతుందనీ, లేక ఒక్కసారిగా సర్‌ప్రైజ్ చేయాలనా...." సుదర్శన్ మిత్రుడిని హాస్యంగా అడిగాడు.

జార్జి చిరునవ్వు నవ్వి లోపలికెళ్ళాడు. మరు నిమిషంలో కాబోయే భార్యతో చేతిలో చేయికలిపి నెమ్మదిగా వచ్చాడు. అందరూ ఒక్కసారిగా చప్పట్లు కొట్టారు ఇద్దరూ గదిలోకి రాగానే. జార్జి వంగి అందరిని ఉద్దేశించి "మిస్ నీరజ! మై వుడ్‌బి వైఫ్" అని



పరిచయం చేశాడు అందరికి. నీరజ రెండు చేతులు కలిపి అతిథులకి నమస్కారం చేసింది నునుసిగ్గుతో ఎర్రబడిన మొహం కొంచెం దించుకుని. తరువాత జార్జి ఎంగేజ్‌మెంట్ రింగ్ నీరజ వేలికి తొడిగాడు. అందరూ మళ్ళీ చప్పట్లు కొట్టారు. కాబోయే వధూవరులకి తమ అభినందనలు తెలిపారు.

తెల్లబట్టలేసుకున్న బేరర్ ట్రేలో డ్రింక్స్ తీసుకువచ్చాడు. హాట్ కావల్సినవారు హాట్ తీసుకున్నారు. ఆడవాళ్లు అందరూ సాఫ్ట్ డ్రింక్స్ తీసుకున్నారు. సుదర్శన్ విస్కీ అందుకున్నాడు. సుమిత్ర ఎంచుకుని ఆరెంజ్ తీసుకుంది.

కాబోయే దంపతుల ఆరోగ్యాన్ని, ఆనందాన్ని, సుఖాన్ని కోరుతూ గ్లాసులు తాటించి డ్రింక్స్ త్రాగడం మొదలు పెట్టారు అందరూ.

సుమిత్ర నెమ్మదిగా ఆరెంజ్ సిప్ చేస్తూ నీరజ వంక చూసింది. మల్లెపూవులా వుంది నీరజ. తెల్లటి సిల్కు చీరమీద వెండి జరీబోర్డరు, తెల్ల స్లీవ్‌లెస్ బ్లౌజు, ఆధునికంగా నడినెత్తిన చుట్టిన సిగ. ఒంటిపేట ముత్యాల హారం. తెల్లచెప్పులు...అన్నీ తెలుపే! మల్లెపువ్వంత స్వచ్ఛంగా నవ్వుతూంది. ప్రపంచంలోని ఆనందానికంతా ప్రతినిధిలాగుంది. ఆమె మొహం సంతోషంతో, ఆనందంతో తృప్తిగా వెలుగుతూంది.

తనూ యింతకి ఎన్నోరెట్లు ఆనందం అనుభవించింది తన ఎంగేజ్‌మెంట్ నాడు. తమదీ లవ్ మేరేజే! ఇంతకంటె గ్రాండ్‌గానే పార్టీ యిచ్చారు ఆనాడు తాము. మెడికల్ కాలేజి స్టాఫ్ అందరూ వచ్చారు.

సుదర్శన్ నీరజతో ఏదో చెపుతూ నవ్వుతున్నాడు.

అతని నవ్వు! అదే.. ఆ నవ్వే ఆమెని లోబరుచుకుంది ఆనాడు. అతని అందచందాలకంటె, అతని డిగ్రీం కంటె, అతనిహోదాకంటె...అన్నింటి కంటె ఎక్కువ నచ్చింది అతని నవ్వు! ప్రొఫెసరు సుదర్శనం చెప్పేపాఠం మీదకంటె అతని నవ్వుకోసం శ్రద్ధగా కాచుకుచూడడం తన కిష్టం అప్పుడు.

దానికోసమే నా అన్నవాళ్ళందరినీ కాదని. అందరి మాటలు నిర్లక్ష్యంగా పెడచెవిని పెట్టి, మెడిసిన్ చదువుకూడా సగంలో మానేసి పెళ్ళాడింది అతన్ని.

'రాక్‌హడ్సన్'లా వుండే సుదర్శన్ తన స్వంతం అయిపోతున్నాడని ఎంత గర్వించిందో! తక్కిన అమ్మాయిలు యీర్ష్యతో ఎంత కుళ్ళారో!

ఆరోజుల్లో ఎటు చూసినా సుదర్శనే! సర్వం సుదర్శన్ రూపంఅయి కనిపించింది. తనకంటె అదృష్టవంతురాలు లేదని గర్వించింది.

నీరజ ఏదో చెపుతూంటే శ్రద్ధగా వింటున్నాడుసుదర్శన్‌యితరుల వునికినే మరచి. ఆరాధన నిండిన కళ్ళతో ఆమె వంక చూస్తున్నాడు.

సుమిత్ర మనసంతా యీర్ష్యతో నిండింది.

యీ కళ్ళు యిలాగే చూసేవి తన వంక ఆ రోజుల్లో. తను మాట్లాడినా, నవ్వినా, అసలు ఏమనకపోయినా తనని అలా ఆరాధన నిండిన కళ్ళతో, మత్తుగా చూసేవాడు సుదర్శన్. ఆరోజు బీచిలో— "సుమీ, నీవు ప్రక్కనవుంటే చాలు నాకు, ఆహారంకూడా అక్కరలేదు... అలాంటిది వెధవది, నీకోసం మాంసాహారం మానలేననుకున్నావా...యింత చిన్న విషయంకోసమా సందేహిస్తున్నావు. యీ మాత్రందానికోసం నిన్ను వదులుకుంటా ననుకున్నావా, నన్ను నమ్ము సుమిత్రా, యింక అడ్డుచెప్పకు!" తన కళ్ళలోకి మత్తుగా చూస్తూ చేతిలో చేయివేసి, నలుగురూ తిరిగే బీచి అని కూడా మరచి గుండెలకు హత్తుకున్నాడు ఆవేశంగా ఆ కనుచీకటివేళ!

అందరూ భయపెట్టిన భయాలు, అనుమానాలు అన్నీ తొలగిపోయాయి ఆ క్షణంలో. సుదర్శన్ కళ్ళలోని ఆరాధనకి పరవశించి అతని గుండెలమీద వ్రాలిపోయింది.

సుదర్శన్‌తో పెళ్ళికి అందరూ తనని ఎన్నోవిధాల అడ్డుకోవాలని చూశారు. తల్లి ఏడ్చింది. తండ్రి యింట్లోంచి పొమ్మన్నాడు. అక్కలు, అన్నలు వర్ణాంతర



వివాహాలవల్లవచ్చే అనర్థాలను విడమర్చి చెప్పి నచ్చచెప్పబోయారు. స్నేహితు లందరూ ఎన్నో విషయాలు చెప్పి భయ పెట్టారు. ఎవరు చెప్పినా, 'అతను మాంసాహారి, నీవు శాకాహారివి. నిష్ఠ నియమాలుగల కుటుంబంలో పెరిగావు. అతనికి నీకు సరిపోదు. మొదట కొన్నాళ్లు సర్దుకున్నా తరువాత తరువాత మీ మధ్య కలతలు రేగితీరుతాయి' అని.

వాళ్ళు చెప్పడంవల్ల కాకపోయినా తనకి మాంసాహారం అంటే అదోరకం ఎలర్జీ. ఎవరైనా తింటూంటే చూసినా భరించలేదు. అందుకనే ముందుగానే సుదర్శన్‌దగ్గిర మాట తీసుకుంది.

సుదర్శన్ యిచ్చిన భరోసాతో అనుమానాలు తొలగి, మరుసటి నెలలోనే సుదర్శన్ భార్య అయిపోయింది రిజిష్ట్రార్ సమక్షంలో.

పెళ్ళి అయ్యాక మూడు నాలుగు నెలలు తామిద్దరు చుట్టూ ప్రపంచాన్నే కాక తమనితాము మరచిపోయారు.

డిన్నరు రెడీ అయిందని కబురొచ్చింది.

"కమాన్, లెటజ్ గో!" డైనింగు రూములోకి దారితీస్తూ అతిథు లందరిని ఆహ్వానించాడు జార్జి.

పెద్ద టేబిల్‌మీద తెల్లని టేబిల్‌క్లాతు వేసి ప్లేట్లనిండా రకరకాల పదార్థాలు అందంగా అమర్చారు. మధ్య కోడి, బాతు ఆకారాలని ఆపళంగానే స్టఫ్‌చేసి వండి డెకరేట్‌చేసి పెట్టారు. బుఫే డిన్నరు! అందరికి తలో ప్లేటు, నేప్‌కిన్, స్పూన్, ఫోర్క్ పెట్టి అందించారు జార్జి, నీరజ.

టేబిల్‌మీద అమర్చిన నాన్‌వెజిటేరియన్ డిషెస్ చూసి కాస్త వెనక్కి తగ్గి సందేహిస్తూ నిలబడింది సుమిత్ర. జార్జి చూశాడు ఆమెని. "కమాన్,

మిసెస్ సుదర్శన్! వెజిటేరియన్ వికూడా ఉన్నాయి. అవన్నీ వేరుగానే చేయించాం వీటిల్లో కలవకుండా. మీరున్నారని తెలుసుగా నాకు. మీరేకాదు యింకా ఉన్నారుగా వెజిటేరియన్స్..." టేబిల్ దగ్గిరకి తీసికెళ్ళి శాకాహార పదార్థాలు చూపించాడు జార్జి. 'హెల్ప్ యువర్ సెల్ఫ్' అంటూ.

ఏవో రెండుమూడు రకాలు ప్లేటులో పెట్టుకుని తప్పుకుంది సుమిత్ర. అందరూ ఆ కోడిని, బాతుని ముక్క ముక్కలుగా చేసి తలోముక్కా తీసుకున్నారు. ఎంతో ఆప్యాయంగా, బాగుందని మెచ్చుకుంటూ తింటున్నారు. సుమిత్ర అదంతా చూస్తూ తన భోజనం తినలేకపోతూంది. కడుపులో త్రిప్పసాగింది సుమిత్రకి.

ఇప్పుడు నయం ఇంకా – ఇదే మొదటిసారి సుదర్శన్ యింట్లో తినడం చూసి భళ్ళున వాంతి చేసుకుంది.

హుం...సుదర్శన్! ఎంత అప్యాయంగా ఆ ఎముక పట్టుకుని చీకుతున్నాడు! 'ఆహారమే అక్కరలేదు నీవు ప్రక్కన వుంటే ... అలాంటిది మాంసాహారం మానలేనా నీ కోసం' అని తేలికగా ఆనాడు అన్న మనిషి. యీరోజు తన ఎదురుగానే, తనకి అసహ్యమని తెలిసినా, లెక్కచేయకుండా తింటున్నాడు!... అవును తనంటే భయమేమిటి అతనికి! తనకి సంజాయిషి యివ్వవలసిన అవసరం ఏముంది! భార్య...భరించక ఏం చేస్తుంది.

ఇంట్లో యీ నరకం అప్పుడే ఆరు నెలలుగా భరిస్తూనేవుంది. యీ పాటికి నిజానికి తనకి అలవాటు అయిపోవలసింది. యివి చూడడం, యివి తింటూంటే సహించడం...కాని ఖర్మ! దురదృష్టం! మొదటిరోజు సుదర్శన్ తింటున్నాడని తెలిసిన రోజున ఎంత అసహ్యించుకుందో యీ ఆరు నెలలుగానూ అలాగే అసహ్యించుకుంటూంది.

సుదర్శన్ యిలా మాట తప్పుతాడని తనకిచ్చిన వాగ్దానాన్ని అంత తేలిగ్గా మరచిపోతాడని ఊహించకపోవడం తన పొరపాటేనేమో!కాకపోతే ప్రేమవేడిలో ఆమోజులో అన్నమాటకి తను విలువ యిచ్చి నమ్మడం తెలివితక్కువగదూ! మనిషి మాటకి కట్టుబడి ముప్పై ఏళ్ళుగా అలవాటయిన ఆహారం ఒక్కసారిగా తనకోసం మానుతాడని విశ్వసించడం తన తెలివిహీనతనే చాటుతూంది! ఇంకోటి ఇంకోటిగాదు, ఆహారం విషయంలో ఎన్నాళ్ళని యిబ్బందిపడి మాట నిలబెట్టుకోడానికి కట్టుబడి ఉంటారు! కట్టుకున్న తరువాత. ఆమోజు, ఆక్రొత్తవేడి తేలిపోగానే... ఏమగాడు భార్యకిచ్చిన మాటకి విలువ యిస్తాడు. అలా యిస్తాడని నమ్మడం తన బుద్ధిహీనతనే చాటుతూంది.

తనకిచ్చినమాట పెళ్ళయిన మూడు




నాలుగు నెలలుమాత్రమే అమలు జరిపాడు సుదర్శన్. ఆమూడు నాలుగు నెలలు తను అంతగా గమనించక పోవడంవల్ల సుదర్శన్ చికాకు అర్థం కాలేదు. సుదర్శన్ భోజనంముందు కూర్చుని ఏం తినకుండా ఎందుకు లేచి పోతున్నాడో ముందసలు తనకి అర్థమే గాలేదు. తరువాత నెమ్మదిగా భోజనం ముందు కూర్చున్న దగ్గరనించి సణగడం ఆరంభించాడు... 'యీ వెధవకూరలతో అన్నంఎలాతినడం. ఈ చప్పకూరలలో ఏం బలముంటుంది'. ఎంత మంచికూర చేసినా తినేవాడుకాడు. పప్పు, పచ్చళ్ళు అవి అసలు ముట్టుకునేవాడుకాడు. అన్నం అంతా కెలికి ఇంత పెరుగన్నం మాత్రం తిని లేచిపోయేవాడు. అతని భోజనం ఒక సమస్యఅయింది తనకి. రోజు రోజుకి తగ్గిపోనారంభించాడు సుదర్శన్. దాంతోపాటు అతనికి కోపం చిరాకు ఎక్కువయింది. 'నాజన్మలో నేను ఎప్పుడూ ఇన్నాళ్ళు మాంసాహారం తినకుండా వుండలేదు తెలుసా, అసలు మాంసమో, చేపలో ఏవో ఒకటి లేకపోతే భోజనం ముందు కూర్చునేవాడినే కాదు. ఇంట్లో ఏపూజలు అవి అయినాకూడా అమ్మ నాకోసం ప్రత్యేకం చేయించేది' అనేవాడు. 'యీ వెధవ వంకాయి, బీరకాయలో ఏముంది, ఎంత తింటేమాత్రం ఏంలాభం,' అని విసుక్కునేవాడు. 'బాగుంది, శాకాహారం తిన్నవాళ్ళందరూ చచ్చిపోతున్నారా ఏమిటి !' అనేది తను నవ్వుతూ. 'ఏమో మీకలవాటు !' మొఖం

చిట్లించేవాడు. 'అలవాటు చేసుకుంటే మీకూ సయిస్తాయి. అసలు మీరు ప్రయత్నించడమేలేదు.'

"ఏం అలవాటవుతుందో ! ఆరు నెలల నించి తిండికోసం మొహం వాచినట్లున్నాను' అన్నాడు. తనకీ జాలి అనిపించింది. పాపం ఒక్కసారిగా అన్నాళ్లుగా అలవాటయిన ఆ ఆహారం వదలడానికి ఎంతకష్టంగా వుందో ననిపించింది. కాని సుదర్శన్ తినడం భరించలేదు. అది చూస్తే తనకి అసహ్యం... అందుకేగా ముందు సుదర్శన్ దగ్గిర మాటతీసుకుంది. తనతప్పులేదు...

రోజు రోజుకి యింట్లో సుదర్శన్ భోజనసమస్య తీవ్రత దాల్చింది. సుదర్శన్ యింట్లోతినేదే ఒక్కపూట. మధ్యాహ్నం లంచ్ ఆఫీసుకే ఏసాండ్ విచెస్‌లో, చపాతీలో తీసికెడతాడు. రాత్రికి మాత్రమే భోజనం ! అరాత్రి కూడా ఏం తినకుండా లేచిపోతుంటే ఎన్నాళ్ళు సహించగలదు ! ఆరు నెలల్లో సుదర్శన్ ఎంతో తగ్గిపోవడం గమనించి నొచ్చుకునేది. అమాటా అన్నాడు. 'యీ ఆరునెలల్లో ఎనిమిది పౌనులు తగ్గాను తెలుసా, ఎన్నిమందులు తీసుకుంటే మాత్రం ఏంలాభం, ఆహారం సరిగా లేకపోతే! అయినా నీవుమరీనూ, ఇంక పట్టింపేమిటి, యీరోజుల్లో బ్రాహ్మణులే ఎంతోమందిమాంసాహారంతింటున్నారు, నీఅంత చాదస్తం ఎవరికీవుండదు' సగం విసుగు, సగం హాస్యంగా అన్నట్టు అన్నాడు. "అయితే ఏమిటంటారు, మానడానికే మీకంత కష్టంఅయితే, క్రొత్తగా నన్ను అలవాటు చేసుకోమంటే నాకెంత కష్టం !"

"నిన్నెవరు తినమన్నారు !"

"మిమ్మల్ని తినవిస్తే చాలంటారు !" సుదర్శన్ మాట్లాడలేదు. ఆక్షణంలో తనకు కాస్తకోపం వచ్చింది. యీమాత్రం దానికి అంతపెద్ద వాగ్దానాలు, అంతతేలిగ్గా ఎందుకు చేయడం !

అక్కడికీసుదర్శన్ ఆరోగ్యం కోసం గుడ్లు ఉడికించీ, ఆమ్లెట్లుచేసిపెట్టేది. అంతకంటె ముందుకుపోవడం మాత్రం తనవల్లగాలేదు.

"అదేమిటి మీరు ఏం తినడంలేదు.... ఏం తీసుకోడంలేదేమిటి !" నీరజ దగ్గిరకి వచ్చి పలకరించింది సుమిత్రని. 'తింటున్నాను...' నవ్వింది బలవంతంగా సుమిత్ర. 'యీస్వీట్ తీసుకోండి ... బాగుంది' అంటూ ప్లేట్‌లోవేసింది. 'థాంక్స్' అంది సుమిత్ర.

నీరజ!... పేరుబాగుంది. మనిషీ బాగుంది! కాని నీరజపేరుహిందూపేరు, జార్జి!... క్రిష్టయన్! ఇంటర్ కాస్ట్ మేరేజ్!... నీరజ వెజిటేరియనా! నాన్ వెజిటేరియనా!?... అడగాలి అనుకుంది సుమిత్ర.

నీరజ అప్పుడే యింకెవరి దగ్గిరకో వెళ్ళిపోయి మాట్లాడుతూంది. సుదర్శన్




జార్జి ఏదో చర్చిస్తున్నారు నీరజతో. సుదర్శన్ ఎంత చక్కగా మాట్లాడు తున్నాడు నవ్వుతూ వాళ్ళతో! తనతో యిలా మనసారా నవ్వుతూ మాట్లాడి ఎన్నాళ్ళయింది! అసలు తామిద్దరూ మాట్లాడుకుని ఎన్ని రోజులయింది! యీ పార్టీకి భార్య వెంటలేకపోతే సంజాయిషీలు యివ్వాలన్న భయంతోనేమో తీసుకువచ్చాడు సుదర్శన్. సొసైటీ మర్యాదలకి భంగంకాదూ తను రాకపోతే! యీ పార్టీలు, డిన్నర్లు, క్లబ్బులు ...యీ సొసైటీ లైఫ్‌కి నటన చాలా అవసరం!

అసలు ఆ రోజు జాన్ వాళ్ళ పార్టీ నుంచి వచ్చిన దగ్గిరనించేగా తమమధ్య కలతలు, కలహాలు ఎక్కువయ్యాయి.

అప్పటివరకు యింట్లో భోజనం చేస్తున్నంత సేపూ సణగడం, చిరాకు పడడం, మినహా ఉత్తప్పుడు బాగానే వుండేవాడు సుదర్శన్.

ఆ రోజు పార్టీకి యిలాగే టేబిలు మీద అమర్చిన నాన్ వెజిటేరియన్ డిషెస్‌వంక చూసే సుదర్శన్ చూపులు ఎదురుగా ఏ మేకనో పెట్టితే బోనులోని సింహంచూసే ఆకలిచూపులు గుర్తు వచ్చాయి. ఆ రోజు తనప్రక్కన ఉండి వుండకపోతే యిచ్చిన మాట మరచి హాయిగా ఆ మాంసాహారం తినివుండేవాడనిపించింది. ఆ చూపు చూస్తే యింక ఎన్నిరోజులో మాటకి కట్టుబడి వుండడనిపించింది. ఆ రోజు యింటికి వచ్చాక తనతో మాట్లాడకుండా కోపంగా పడుకున్నాడు.

ఆ మర్నాటినించే అసలు కథ ప్రారంభమయింది. ఆ రోజునించి రోజూ రాత్రి ఇంట్లో భోజనం మానేశాడు. ఎవరో ఫ్రెండు పిలిచాడని, డిన్నరని, పార్టీ అని ఏదోవంక చెప్పసాగాడు. ఓ పదిహేనురోజులు నమ్మింది. కాని ఇన్నాళ్ళూలేని ఫ్రెండ్స్, పార్టీలు రోజూ యిచ్చే తనకి తెలియని ఫ్రెండ్సు ఎవరున్నారు! హోటలులో తింటున్నాడని స్పష్టం అయింది. ఒకనెలచూసి యింక వూరుకోలేక అడిగింది.

... 'అవును హోటలు కెళ్ళే తింటున్నాను ... ఎన్నాళ్ళు తిండి తినకుండా చచ్చిపొమ్మన్నావు' అనవసర కోపంతో గట్టిగా అరిచాడు. తనకీ వళ్ళుమండింది.

"యీ మాత్రం దానికి అనాడు పెద్ద పెద్ద వాగ్దానాలు ఎందుకు చేశారు. తిండే అక్కరలే దన్నారు..." దెప్పింది.

సుదర్శన్ మొహం ఎర్రబడింది.

"అవును అన్నాను. వాగ్దానం చేశాను కనుకే, నీ కోసం ఎనిమిది నెలల నించి వస్తున్నాను ... యింక నా వల్లగాదు ... తిండి తినకుండా చచ్చిపోవడమే నీ కానందం అయితే చెప్పు ... ఎంతసేపూ నాలోనే లోట్లు ఎంచడం ఎందుకు... త్యాగాలు నేనే చెయ్యాలా! ఆ మాత్రం కట్టుకున్న వాడికోసం నీవు త్యాగం చేయకూడదా! నే నేం నిన్ను తినమనలేదే. నాకు అభ్యంతరం చెప్పొ దన్నాను...అంతే గదా," అన్నాడు.

యింకేమంటుంది. అక్కడికీ అంది "నేను త్యాగాలు చేయలేను కాబట్టే ముందుగానే మాట తీసుకున్నాను."

"ఎన్నిసార్లు చెపుతావు, అవును వాగ్దానం చేశాను...క్షమించు వాగ్దానం నిల్పుకోలేనివాడిని... ఏదయినా మానవచ్చుగాని...తిండిమాని త్యాగాలు ఎవరు చేస్తారు." విసురుగా వెళ్ళిపోయాడు.

ఆ భాగోతం అలా మూడు నెలలు సాగింది. ఇల్లు, పెళ్ళాం ఆన్నీవుండగా హోటల్లో భోజనంచేసి వస్తూంటే సహించలేకపోయింది .. కాని, ఆరోజునించి మాట తప్పాడనో, ఆ ఆహారం తిని వస్తున్నాడన్న భావమో కాని సుదర్శన్ పట్ల కాస్త విముఖత కలిగింది. సుదర్శన్ కూడా మాట తప్పినందుకు కాబోలు కాస్త మొహం దాచేసుకుని తిరిగేవాడు. పూర్వంలా యిద్దరూ ఫ్రీగా మాట్లాడుకో లేకపోయేవారు. అంతేకాక సుదర్శన్ దగ్గిరకి తీసుకోగానే సుదర్శన్ మాంసం తింటున్నాడన్న తెలివిడి అదోరకం జుగుప్స కలిగించేది అతని స్పర్శ. తనకి తెలియకుండానే మొహం త్రిప్పుకునేది. మొత్తంమీద ఆ సంఘటన తమ దాంపత్య జీవితానందాన్ని చాలవరకు హరించింది.

అంతటితో ఆగలేదు. "ఎన్నాళ్ళు రోజూ వెళ్ళి హోటల్లో తినగలను!" అంటూ ఇంట్లోనే ఓ వంటవాడిని వేరే వండడానికి తీసుకొచ్చాడు. అప్పారావు-




నల్లటి గోళ్ళు, గంపంత జుట్టు - వాడిని చూస్తేనే అసహ్యం తనకి. వాడు వచ్చిందగ్గిరనించి సుదర్శన్ భోజన సమస్య తీరింది. కాని ఆ యింట్లో భోజనం చేయడం తనకో సమస్యగా వుంది. ఇంట్లో కోళ్ళుకోయడం, చాపలు కడగడం, అవి వుడుకుతూంటే ఆ వాసన, ఆ మసాళాలు దుబ్బడం అదంతా భరించడం తనకి తప్పలేదు. ఎంత చెప్పినా, వాడికి వేరే గిన్నె లిచ్చినా ఆ అప్పారావు అన్నీ కలిపేస్తాడు. మూతలు, గరిటలు అన్నీ కలిపేస్తాడు. వంటింటి పైపు దగ్గర అంతా ఆ మాంసం అవీ కడిగి గలీజుచేస్తాడు. పనిమనిషీ అన్ని గిన్నెలూ కలిపేస్తుంది ఎంత చెప్పినా. ఏం చెయ్యడం ! ఎంత చూడకూడదనుకున్నా అదంతా తన కంటబడక మానడం లేదు.

హూ...యిలాంటి గొడవలు వస్తాయనే అందరూ అంతగా ఆనాడు తనని హెచ్చరించారు. ఆ మాటలని నిర్లక్ష్యం చేసింది ఆనాడు. కాని ఎంత అనుభవ పూర్వకంగా చెప్పారు.

ఈ గొడవలవల్ల తమ దాంపత్య జీవితమే దెబ్బతింటుందని కలలోకూడా అనుకోలేదు...సుదర్శన్ ! ఎంత ప్రేమగా అనురాగంతో చూసేవాడు ! అలాంటి వాడు యిలా మారిపోతాడని...

నిజానికి తప్పు తన ఒక్కడిదే గాదూ ! యిందులో తన పాలూవుంది ! సుదర్శన్ తనని తినమనలేదు ! వండమనలేదు ! అతని ఏర్పాటులు అతను చేసుకున్నాడు. కాని...యీ విషయాన్ని తేలిగ్గా తీసుకోలేకపోవడం తన బలహీనత ! ఇంటా వంటా లేని వా రెందరో తింటున్నారు యీరోజుల్లో మత్స్య మాంసాలు ! అలాంటిది తనెందుకు యింత సీరియస్‌గా తీసుకోడం ఈ విషయం...

తను మాత్రం ఏం చేస్తుంది! ఎంత సరిపెట్టుకుందామన్నా ఆ ఊహ తలపుకి వచ్చేసరికి సుదర్శన్ స్పర్శే భరించలేకపోతూంది. తన మొహం మీద ఏహ్యాత స్పష్టంగా కనిపించడం చూసి చూసి సుదర్శన్ ఓ రోజు కోపంగా అడిగాడుకూడా [illegible] "ఎందుకంతలా చీదరించుకుంటున్నావు ఈ మధ్య... ఎందుకిలా మారిపోతున్నావు..."

"మారింది నేనే కాదు" కోపంగా అంది తను. "నేను [illegible]. నీవు మారావు. నా ప్రేమానురాగాలలో ఏం మార్పు [illegible] చెప్పు" [illegible] కాదు [illegible]

"[illegible] ప్రేమతోటా [illegible] మాటల్లో ... చేతల్లో [illegible]" సుదర్శన్ తెల్లబోయాడు. "బాగుంది. మారింది అంటున్నావని మరి నేను అనుమానించుకుంటున్నావా! [illegible] కారణం..." తను జవాబీయలేదు. సుదర్శన్ ఒక క్షణం [illegible] చూస్తూ తన మొహం [illegible] తనని [illegible] లేకాడు

"మనం చాలా పొరపాటు చేశాం.... చాల తొందరపడ్డాం ... తప్పటడుగు వేశాం" అని అటు తిరిగి పడుకుండిపోయాడు. ఆ రోజునించి యీ రెండు నెలల నించి తనతో చాలా ముభావంగా మాట్లాడుతున్నాడు. తన దగ్గిరకే రావడం లేదు. తను పలకరించినా జవాబీయడం లేదు. ఇద్దరూ లోకానికి మాత్రమే భార్యాభర్తలు...

ఎన్నాళ్ళిలా! ఎవరో ఒకరు సర్దుకోకపోతే కాపురం ఎలా ... నలుగురినీ కాదని పెళ్ళిచేసుకుని...నలుగురూ తన మొహాన్నే శాస్తి జరిగిందని చెప్పుకునేటట్టు ప్రవర్తిస్తే ఎలా! తనవాళ్ళందరూ వింటే ఏమంటారు! ముందే చెప్పాం అంటూ దెప్పి హేళన చేస్తారు. దీనికి పరిష్కారం ఏమిటి! ఇంట్లో సుదర్శన్ వరస చూస్తుంటే తప్పంతా తందే నన్నట్టు, తనని శిక్షించదలికన్నట్టు ప్రవర్తిస్తున్నాడు. ఇలా చేస్తేగాని దారికి రాదన్నట్టు నిర్లక్ష్యంగా [illegible] తిరుగుతున్నాడు. ఏం చెయ్యా[illegible] సుదర్శన్ [illegible] స్పష్టమైంది. కాపురం కావాలిస్తే తనే అన్నీ చప్పునట్టు భరించాలి. లేకపోతే ఏం చెయ్యాలి! అన్నదే తన ప్రస్తుత సమస్య...

డిన్నరు పూర్తయింది. అంతా చేతులు కడుక్కుంటున్నారు. యాంత్రికంగా చేతులు కడుక్కుంది సుమిత్ర. అందరూ మళ్ళీ డ్రాయింగురూములో చేరారు.

ఫ్రూట్ సలాడ్ సర్వ్ చేస్తున్నారు. మౌనంగా అందుకుంది సుమిత్ర. ఈ రోజంతా ఏమిటోలావుంది సుమిత్రకి. ఎవరితో మాట్లాడబుద్ధి వేయటంలేదు. మనసంతా ఏదో ఆవేదన నిండింది. భవిష్యత్ చింత ఆనందాన్ని హరించి నిర్లిప్తత కనిపించింది ఆమెలో.

యింత చిన్నవిషయానికి ఎవరూ




నాలా యిలా అవివేకంగా ప్రవర్తించి కాపురం పాడుచేసుకోరేమో! ఆ భావం సుమిత్రలో ఆత్మవిమర్శన చేయిస్తూంది.

యిలాంటి పెళ్ళిళ్ళు చేసుకున్న అందరికి యిలాంటి సమస్యలు ఎదురు అవుతాయా? ఎవరిని అడగడం? ఎవరిని ఏమని సలహా అడగడం? తన వాళ్ళందరూ వున్నా ఎవరిని అడగలేని స్థితిలో తనవితనే పడేసుకుంది.

నీరజ ప్లేటులో అందరికి కిళ్ళీలు అందిస్తూంది. సుదర్శన్ సిగరెట్లు ఆఫర్ చేస్తున్నాడు మగవారికి. అందరూ కలసి మాట్లాడే మాటలతో గోలగావుంది.

నీరజ!...అప్పట్లు నీరజ వెజిటేరియనా! నాన్‌వెజిటేరియనా! అనేవాళ్ళు ఎవరూ వచ్చినట్లు లేదు. ఈ పెళ్ళి వాళ్ళంతటవాళ్ళు చేసుకుంటున్నారట! ఎందుకో! అప్పుడే పెళ్ళికాకుండానే, దంపతులంత క్లోజ్‌గా వుంటున్నారు జార్జి. నీరజ! అంటే చాలగ్రంథమే నడిచి వుంటుంది. ఇద్దరూ క్రొత్తపాత లేకుండా అప్పుడే భార్యాభర్తలమాదిరి తిరుగుతున్నారు

"మిసెస్ సుదర్శన్! ఏమిటలా వున్నారు యివాళ! మాట్లాడకుండా అలా కూర్చున్నారేమిటి! ఏం ఒంట్లో సరిగా లేదేమిటి?" జార్జి స్నేహపూర్వకంగా చూస్తూ అడిగాడు. సుదర్శన్ ఒకసారి కళ్ళెత్తి నీరజవైపుచూసి చూపు మరల్చుకున్నాడు

"ఆవిడ అసలు భోజనం కూడా చెయ్యలేదు." అంది నీరజ.

"అబ్బే. ఏంలేదు. బాగానేవుంది. కొంచెం తలనొప్పి అంతే" లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అంది సుమిత్ర.

పైవాళ్ళకి ఉన్నంత ఆదుర్దాకూడా లేనట్లు సుదర్శన్ రామ[illegible]ధంతో మాట్లాడుడుతున్నాడు. సుమిత్ర మనసు

దెబ్బతింది. అసహాయతతో సుదర్శన్ పట్ల విరక్తి వచ్చింది.

పదకొండు గంట లయింది. నెమ్మది నెమ్మదిగా ఒక్కొక్కరూ శెలవు తీసుకుని వెళ్ళేముందు కాబోయే దంపతులకి మరోసారి అభినందనలు చెప్పి వెళ్తున్నారు.

సుదర్శన్, సుమిత్ర మిగిలారు. తన సందేహం అడగడంకోసం అవకాశం కోసం చూసింది సుమిత్ర. సుదర్శన్ వెళ్ళడానికి శెలవు తీసుకున్నాడు.

"మీవాళ్లు ఎవరూ రాలేదేం... మీఅమ్మ, నాన్నగారు ... ఎవరూలేరా ఇక్కడ" మామూలుగా అడిగినట్లు అడిగింది సుమిత్ర నీరజని. నీరజ నవ్వి జార్జివైపు చూసింది.

"అందరూ వున్నారు... ఎవరూ రాలేదు" తేలిగ్గా అంది నీరజ.

"అదేం!"

"మావాళ్ళకి ఎవరికీ యీపెళ్ళి యిష్టం లేదు .. వాళ్ళమాట వినలేదని కోపం అందరికీ."

"ఏం ఎందుకు ఇష్టంలేదు ... కారణం" రెట్టించింది సుమిత్ర. అనవసర ప్రసంగం అన్నట్లు చిరాగ్గాచూశాడు సుదర్శన్, భార్యవైపు.

"కారణాలకేం చాల వున్నాయి. ఆయన క్రిస్టియన్, నేను హిందు. ఆయన మాంసాహారి, నేను ఫక్తు శాకాహారిని. యింతకంటె యిష్టం లేకపోవడానికి ఏం కారణాలు కావాలి .." నవ్వింది నీరజ.

"అవును. ఓ హిందూస్త్రీ ఓ క్రిష్టియన్‌ని పెళ్ళాడడం అంత సులువైన పనా మన సమాజంలో .. వాళ్ళ వాళ్ళెవరికీ యిష్టంలేదు. అంచేత నీరజ యింట్లోంచి వచ్చేసింది ఉద్యోగం చూసుకుని" అన్నాడు జార్జి.

"మీ సాహసాన్ని అభినందిస్తున్నాను" నీరజతో అన్నాడు సుదర్శన్ మెచ్చుకుంటూ. సుమిత్రకి నవ్వొచ్చిందింది. అభినందిస్తున్నాడట! ఎందుకో! రేపొద్దునవాళ్ళూ తమలా బాధపడాలని గాబోలు...ఆవేశంగా ఏదోఅనబోయింది.

"ఇందులో పెద్ద అభినందించడానికి ఏముంది! నేనేం పెద్ద త్యాగం చేస్తున్నానని అనుకోలేదు... జార్జి నాకన్నివిధాల నచ్చాడు. నాకు కావల్సింది వ్యక్తిగాని కులాలూ మతాలూగావు..." చాలా తేలిగ్గా అంది నీరజ.

సుమిత్ర ఇంక ఆవేశం అణుచుకోలేకపోయింది. "వద్దు ... వద్దు ... మీ రీ విషయాన్ని ఇంత తేలిగ్గా తీసుకోకండి. మీకు తెలియదు. అనుకున్నంత తేలికకూడ కాదు ఈవిషయం అనాలోచితంగా... నా సలహా..." ఏంఅంటున్నదీ తెలియకుండానే గబగబ, కొన్ని తుంపుడు ముక్కలు పలుకుతూ, చేతిరుమాలు నోటికడ్డం పెట్టుకుని, గబగబ, బయటకువెళ్ళింది సుమిత్ర.

సుదర్శన్ మొహం కొట్టొచ్చినట్టుగా ఎందుకు పాలిపోయిందో జార్జికీ, నీరజకీ అర్థంకాక, బయటకుపోతున్న దంపతులిద్దర్నీ చూస్తూ ఉండిపోయారు.



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"ఏమ్ ఏమ్ ఏమిటది," కెమేరాతోవున్న నన్ను చూడగానే దూడని జాగ్రత్తగా క్రిందదింపి, గడ్డితో చేతులు తుడుచుకుంటూ, పాకబైటకివస్తూ అన్నాడు.

"ఫొటో" అన్నా ఈసారి అతని ఒక్కడిది యాంగిల్ చూస్తూ.

కృష్ణ క్రిందకివంగి చిన్నరాయి ఒకటితీసి చేయిజాచి విసరబోతున్న వాడులా పట్టుకుని, "మర్యాదగా చెబుతున్నా ఫొటోలు గిటోలు ఏం పనికిరావు. నువ్విక్కడ నుంచి ఏ జ్ఞాపకం తీసుకెళ్ళటానికి వీల్లేదు" అన్నాడు.

"నువ్వెవరు నన్ను ఆజ్ఞాపించటానికి ?" నోరుమూసుకో మన్నంత గట్టిగా అన్నాను.

కృష్ణ రాయి విసరబోయాడు. విసిరాడనే అనుకున్నాను. అతనిముఖం అంత సీరియస్‌గావుంది.

నేను దెబ్బతగులుతుందేమోననే భయంతో కాస్త పక్కకితగ్గాను.

కృష్ణ విసరలేదు. రాయి క్రిందవిడిచి పకపకానవ్వాడు.

కెమేరాలో యాంగిల్ చూసుకుంటున్న నాకు ఆనవ్వు చక్కిలిగింతలు పెట్టినట్టయింది. టక్కున మీటనొక్కా. ఎర్రనిచిగుళ్ళు కొద్దిగా కన్పిస్తుండగా దంతాలన్నీ కన్పించేట్టు. విరగబడి నవ్వుతున్న కృష్ణముఖాన్ని శాశ్వతంగా నా కెమేరాలో బంధించుకున్నాను. అతను అంతలా నవ్వటం నేనెప్పుడూ చూడలేదు.

కృష్ణ అంతలోనే నవ్వటంమానేసి సీరియస్‌గా వెనక్కితిరిగి, 'అమ్మా! మీ అన్నయ్య కూతురు నాలుగురోజులు యిక్కడ వుండదల్చుకుంటే యిలాంటి పిచ్చి పనులు చేయద్దని గట్టిగాచెప్పు. యింకోసారి ఎప్పుడైనా యీ ప్రదేశంగాని యిక్కడ మనుష్యుల్ని కానీ ఫొటో తీయాలనిచూస్తే తక్షణం బ దెక్కిస్తానని చెప్పు. తర్వాత నువ్వు తిటినాసరే,' అంటూ వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళినవైపే చూసి నేను పెదవులుముడిచి మూతి తిప్పాను

అదేమిటోగానీ, గినకను చి అతని వి గహాన్ని ఎన్నిసార్లు చూసినా తనివితీరక, యింకా చూడాలనే అన్పించట ఒక విశేషమే.

మర్నాడు ఆపుపాలు అన్నం వండుకుని అందరూ ఆనందంగా, అమృతం తింటున్నట్టు తిన్నారు. అత్తయ్య నాక్కూడా పెట్టింది నేను తినలేదు. దానివైపు చూడగానే, నాకు అప్పుడే యీనినఆవు గుర్తుకువచ్చింది. కడుపంతా చెయిపెట్టి దేవినట్టు వికారపెట్టింది. వద్దని తిరస్కరించాను

*  *  *  *

సాయంత్రం అవుతుండగా మంగమ్మగారు వచ్చింది. ఆవిడ వచ్చినప్పటినుంచీ నా దగ్గరే కూర్చుని నాతో కబుర్లకి దిగింది రాజేశ్వరీ నేనూ చాపమీద కూర్చుని సన్నజాజులు, దినకాంబరాలు, మరువం కలిపి అందంగా మాల గుచ్చుతున్నాం. ఈరోజు శుక్రవారం. ప్రతి శుక్రవారం సాయంత్రం వేణుగోపాలస్వామి ఆలయానికి తోటలో వున్న పూలన్నీ కోసి పెద్ద దండగుచ్చి కానుకగా పంపటం అత్తయ్యావాళ్ళకి అలవాటుట. మంగమ్మగారు నేను కట్టుకున్న చీర, నా చేతులకున్న గాజులు, నా మెళ్ళో గొలుసు వీటన్నిటినీ పరీక్షగా చూస్తూ మా యింటి వివరాలు అడగటం ప్రారంభించింది.

"మీ నాన్న పెద్ద యిల్లు కట్టాడటగా. ఎంత ఖరీదయిందే అమ్మడూ?"

"మా నాన్న కట్టలేదు. మా తాతగారు కట్టించి మా అమ్మ కిచ్చారు," అన్నాను.

"మీ తాతగారు నీకు గుర్తున్నారా?"

లేరన్నట్టు తలూపాను. ఆవిడ ఆసక్తిగా నా వైపుకి వంగి మరీ అడిగింది.

"పట్నంలో గొప్పగొప్పవాళ్ళ యిళ్ళలో స్నానానికి అవేవో పెద్దపెద్ద తొట్లు వుంటాయిటగా! మీ యింట్లో వుందా?"

వుందన్నట్టు తలూపాను.

అప్రయత్నంగా రాజేశ్వరి, నేను నవ్వుముఖాలతో ఒకరివైపు మరొకరు చూసు




కున్నాం. మా యిద్దరి మనసులో నేను యిక్కడికి వచ్చిన రోజున జరిగిన సంఘటన మెదిలింది.

"మీ హైదరాబాదులో మా ఆడబడుచుకి పిన్నత్తగారి మేనల్లుడు అక్కడే వున్నాడు. మాకు బాగా తెలుసులే. ఎప్పుడూ రమ్మని వ్రాస్తూంటాడు. అదేదో చీకటిపల్లలో వుంటాడట. ఆ పేటలో 50 రూ॥ పెట్టినా ఒకగది దొరకదుట. వెళ్ళాలి ఒకసారి. ఎప్పుడో వస్తాను. వచ్చినప్పుడు తప్పకుండా మీ యింటికి కూడావస్తాను. మీ నాన్నకి చెప్పు."

అలాగే అన్నట్టు తలూపా. కానీ గుండెలు భయంతో పీచుపీచు మన్నాయి. ఈవిడ అన్నంత పనీచేసి ఓ శుభ ముహూర్తాన మా యింట్లో అడుగుపెడితే!

"నీకు వంట వచ్చునేటే పిల్లా!" మళ్ళీ అడిగింది ఆవిడ.

"రాదు." అన్నట్టు కళ్ళతోనే సూచించా. నా సమాధానం విని ఆవిడ బుగ్గమీద వేలేసుకుంది.

"రాదూ! యింత వయసువచ్చి వంటరాకపోతే యింకేమొస్తుందే అమ్మా నీకు? రేపు పెళ్ళయితే మొగుడికి ఏం పెడతావ్? వంటరాదని వాడు నిన్ను తగిలేస్తే?"

అత్తయ్య కల్పించుకుంది. "ఏమిటండీ మంగమ్మగారూ, మీ చాదస్తపు మాటలూ మీరూను. వంటచేయటానికి ఆ అమ్మాయి కేం ఖర్మండీ!"

ఎట్లెట్లా అన్నట్టు చూసింది మంగమ్మగారు.

"ఖర్మా! వంటచేయడం ఆడదాని ఖర్మఅయితే మనమంతా ఖర్మకాలినవాళ్ళ మన్నమాటేగా! ఏమిటి కమలమ్మా! నువ్వు మరీ సోద్యంగా చెబుతావు. మన రాజుకి వంటరాదూ! పట్నవాసపు పిల్ల అంటే యింకా రకరకాలుగా, ఎన్నెన్నో కొత్తకొత్త పోకడలతో చేస్తుందనుకుని అడిగాను."

"బాగుందండీ. యింట్లో వంటమనిషి వుంది. వాళ్ళమ్మ వుంది. ఇక ఆ అమ్మా యికి వంటయింట్లోకి వెళ్ళాల్సిన అవసరం ఏముందో చెప్పండి." అత్తయ్య నన్ను సమర్థిస్తూ అంది.

"పోనీ వీళ్ళమ్మకైనా వచ్చునా అవి!" ఆవిడ నన్ను సందేహంగా చూస్తూ అంది.

"అబ్బ! హూష్. కాస్త నెమ్మదిగా మాట్లాడండి. అన్నయ్య పడుకున్నాడు," అంది రాజేశ్వరి.

కృష్ణ అంతక్రితమే చాలా ఆలస్యంగా వచ్చి భోజనంచేసి పడుకున్నాడు. అన్నం తినగానే ఒక్క పదినిముషాలు అలా పక్కమీదవాలి ఏ పుస్తకమో, పేపరో తిరగవేస్తూ విశ్రాంతి తీసుకోవటం అతనికి అలవాటు. అతను యింట్లో లేనప్పుడు ఆ గదిలోకి స్వతంత్రంగా వెళ్ళే నేను, అతను అక్కడుంటే ఆ ఛాయలకికూడా పోను అతనుకూడా అంతే. నేను ఆ గదిలో వున్నట్టు తెలిస్తే అసలా వైపుకే రాడు.

"కృష్ణుడు యింట్లోనే వున్నాడా ఏమిటి?" అంది ఆవిడ గొంతు ఏ మాత్రం తగ్గించకుండానే.

మళ్ళీ నా వైపుతిరిగి, "సరే. నీకు పనిపాటలు వస్తే నా కెందుకు? రాకపోతే నా కెందుకుగానీ - యింతకీ మాకు పప్పన్నం ఎప్పుడు పెడతావో చెప్పు," అంది.

నా కర్థంగాలేదు. పప్పన్నం అంటే?

రాజేశ్వరి వైపు ఏమిటన్నట్టు చూసాను.

రాజేశ్వరి తలవంచుకుని పూలుగుచ్చుతూ, నవ్వాపుకుంటూ, "ఆవిడనే అడుగు," అంది.

ఈసారి మంగమ్మగారు చెప్పలేనంతగా ఆశ్చర్యపోతూ, రెండు దవడలూ నొక్కుకుని, "అయ్యో రామా! నే నడిగింది తెలియనేలేదా నీకు? మీ యింట్లో అసలు తెలుగు మాట్లాడుకుంటారా?" అంది.

"మాట్లాడుకుంటాం," నిస్సహాయంగా అన్నాను.

ఆ క్షణంలో నాకు రాజేశ్వరిమీద చిరుకోపం వచ్చింది. చెయిజాచి ఆవిడకి కన్పించకుండా రాజేశ్వరి తొడమీద గిల్లి, మంగమ్మగారితో, మర్యాద వుట్టిపడు

తున్న కంఠంతో, అతివినయంగా, "పప్పన్నానికేం భాగ్యం! మీరు ఎప్పుడు మా యింటికి వస్తే అప్పుడే. ఒకసారి కాదు, వందసార్లు. మీకు విసుగొచ్చేటన్ని సార్లు పెడతాను. మీరు రావాలేగానీ," అన్నాను పప్పన్నం అంటే విందు భోజనం అయివుంటుందని వూహిస్తూ.

రాజేశ్వరి ఫక్కుమని నవ్వింది.

అత్తయ్య పెదవులమీద చిరునవ్వు కదిలింది.

ఆశ్చర్యంగా చూసిన మంగమ్మగారు కూడా ఘొల్లుమని పైకప్పు ఎగిరిపోయేలా నవ్వింది.

వాళ్ళు ముగ్గురూ అలా ఒక్కసారిగా ఎందుకు నవ్వారో నా కర్థంగాలేదు. అయినా నేనూ నవ్వాను.

"కమలమ్మా, మీ అన్నయ్యకి వుత్తరం వ్రాయలేకపోయావా ?" అంది మంగమ్మగారు నవ్వు సర్దుమణిగిన కొద్దిసేపటికి.

"ఏమని ?"

"మీ కృష్ణుడికి యీడేగా యీ అమ్మాయి. చిలకా గోరింకల్లా వుంటారు. అయిన సంబంధం "

నేను తెల్లబోయి చూశాను.

రాజేశ్వరి కోపంగా తలెత్తింది.

అత్తయ్య ముఖం పాలిపోయినట్టుగా అయింది.

కాస్తకోపంగా, "చాల్లే వూరుకోండి, మీరు మరీను. ఏది మాట్లాడొచ్చో ఏది మాట్లాడకూడదో బొత్తిగా తెలియదు," మందలింపుగా అంటూ లేచి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"నేను కానిమాట ఏమన్నానే కమలమ్మా. మీ అన్నయ్య తన కూతురికి యింత కంటే మంచి సంబంధం తెస్తాడా ? అయినా మన కృష్ణుడికి అసలు ఏం తక్కువని_"

"పిన్నీ !" వెనకనుంచి వున్నట్టుండి కఠినంగా, వారిస్తున్నట్టుగా వినిపించింది.

వులిక్కిపడిన నేను వెనక్కు తిరిగి చూశాను.

గది గుమ్మంలో నిటాటగా నిలబడి వున్నాడు కృష్ణ.

పడుకుని చదువుకుంటున్నవాడల్లా, హఠాత్తుగా, ఆ పేపరు అలాగే పట్టుకుని లేచి వచ్చినట్టుగా వున్నాడు.

ఎందుకో అతని ముఖం జేవురించివుంది. కళ్ళల్లో ఎఱ్ఱజీరలు తొంగిచూస్తున్నాయి.

తినమైన స్వరంతో అన్నాడు.

"చూడు, పిన్నీ. నీకా్కావలసింది కాఫీయే అయితే అమ్మ యిచ్చేవరకూ మెదలకుండా కూర్చుని తాగి వెళ్ళు. లేదు. తోచడంలేదంటావా యింకెవరి యింటి కైనా వెళ్ళి నీ భారతం విప్పు. అంతేగాని యీ యింట్లో కూర్చుని అధిక ప్రసంగం చేస్తేమాత్రం నేను వూరుకోను. నాకు నచ్చదు."

అతని నిర్మొహమాటానికి, ఆ ఖచ్చితమైన తిరస్కారానికి, తెల్లబోయిన నేను ఖంగారుగా మంగమ్మగారివైపు తిరిగి చూశాను.

ఆవిడ కనుబొమలు ముడిచి ముఖం ముడుచ్చుకుంది.

చాపమీద పోసిన పూలు చేతిలోకి తీసుకుని గుచ్చుతున్నట్టుగా దారం లాక్కుని, "నేనిప్పు డంత కానిమాట ఏమన్నానురా. ఏహో మీరూ మీరూ అయినవాళ్లు కాబట్టి, వరస కలిసినవాళ్లు కాబట్టి అన్నాను కానీ–" అంటూ నసిగింది.

కృష్ణ వెనక్కుతిరిగి వెళ్ళిపోయాడు

మంగమ్మగారి కెంత కోపం వస్తుందో అనుకున్నాను నేను. అదే యింకోళ్ళు అయినట్టయితే ఆ క్షణంలోనే దుసదుసలాడుతూ అక్కడనుంచి లేచిపోయేవాళ్ళేమో, కానీ మంగమ్మగారు రెపలేదు. అత్తయ్య కాఫీ తెచ్చేవరకూ మాతో అవీయివీ మాట్లాడుతూ, కాఫీ యివ్వగానే గ్లాసు అందుకుని అపురాపురుమన్నట్టుగా నాలుగు గుక్కల్లో తాగేసి లేచి నిలబడుతూ, వచ్చినపని అయిపోయినదానిలా వెళ్ళబోతూ, "నా మాటలు కృష్ణుడికి కోపం తెప్పించాయో – ఏమిటో. పెద్దదాన్ని చాదస్తంగా ఏదో అన్నాను. ఏమీ అనుకోవద్దని చెప్పు కమలం. రేపు వీలయితే కూరకి కాసిని వంకాయలు పంపించు" అంటూ వెళ్ళిపోయింది.

ఆవిడ వెళ్ళిపోయిన తర్వాత రాజేశ్వరి చెప్పింది ఆవిడ ఆవూళ్ళో వెళ్ళని యిల్లు లేదుట. పనీపాటా లేని యీవిడ అందరిళ్ళకీ వెళ్ళి వాళ్ళకి ఆప్తురాలిగా నటిస్తూ ఆ యిళ్ళల్లో విషయాలన్నీ తెలుసుకుని, ఒకటికి నాలుగు కల్పించి అందరికీ చెబుతుంది. ఆవిడ విషయం తెలిసికూడా ఎవరూ ఏమీ అనలేరు. యింటికి రానివ్వకుండా చేయలేరు. ఎందుకంటే ఆవిడ నోరు మహాచెడ్డది. అందుకే సాధ్యమైనంతవరకూ అంతా ఆవిడతో సామరస్యంగా వుండాలనే ప్రయత్నిస్తుంటారుట. రోజూ మధ్యాహ్నం అయేసరికి కాఫీకోసం అత్తయ్యా వాళ్ళింటికి చేరుతుంది. ఆ గుక్కెడు కాఫీ దొరికేవరకూ యిరుగమ్మ పొరుగమ్మ కబుర్లువద్దన్నా వినిపిస్తూ వుంటుందట. ఒకసారి ఎవరినిగురించో ఆవిడ అసహ్యంగా మాట్లాడుతోంటే విన్న కృష్ణ ఆవిడముఖం వాచిపోయేట్టు చివాట్లువేసి, యిలాటి కబుర్లు చెప్పేట్టయితే అసలు యీ యింటి గుమ్మమే ఎక్కద్దు అన్నాట్ట. దాంతో కోపంవచ్చి కొద్ది

రోజులు రాలేదు. రాకపోవటంవల్ల ఆవిడకే నష్టం. ఆవిడకి అత్తయ్యలా 'పోనీలే పాపం పెద్దది' అంటూ జాలితో ప్రతిరోజూ కాఫీ యిచ్చేవాళ్ళు ఎవరూ లేరు.

ఈమధ్య మళ్ళీ రావటం ప్రారంభించింది.

ఇదుగో యిది జరిగింది. మళ్ళీ ఓ వారంరోజులు మా యింటివైపుకూడా చూడదనుకొంటా అంది రాజు.

మంగమ్మగారి గురించి అన్ని విషయాలు ఆసక్తిగా విన్నాను. వూరంతా ఝడిసే ఆ మహాకాయానికి కృష్ణ ఏమాత్రం భయపడడు అని తెలియగానే అతడంటే నాకు గౌరవంలాటిది కలిగింది. మగవాళ్ళలోకానీ ఆడవాళ్ళలోకానీ అలాటి ధైర్యం నాకు చాలా నచ్చుతుంది

పూలుగుచ్చటం అయిపోయింది.

రాజేశ్వరి కాఫీగ్లాసు కడగటానికని వంటయింట్లోకి వెళ్ళింది. నేను తయారైన దండని రెండు చేతుల్లోనూ శాస్త్రదూరంగా పట్టుకుని, అది దేవుడిమెళ్ళో వేస్తే ఎలావుంటుందో వూహించి చూస్తున్నాను.

వున్నట్టుండి దొడ్లోంచి వీరాయి కేక గావుకేకలా విన్పించింది.

"రాజమ్మా! అన్నయ్యని చప్పున పిలు. మన కొత్తఎద్దు మళ్ళీ తాడుతెంచుకున్నది. నాకు అందటంలేదు. దొడ్డినపడి వంగనారంతా తొక్కుతోంది."

'అన్నయ్యా. అన్నయ్యా' రాజేశ్వరి ఖంగారుగా అన్నగారిని పిలుస్తూ దొడ్లోకి పరుగెత్తింది.

నేను మాల అలాగేపుచ్చుకుని పరుగులాటి నడకతో దొడ్డిగుమ్మంలోకివచ్చి నిలబడ్డాను

బలిష్టంగా, పొంకంగా, పొగరుగావున్న ఎద్దు దొడ్డినపడి వీరాయికి అందకుండా పరుగెత్తుతోంది. దానిమెళ్ళో కట్టుకొయ్యనుంచి తెంచుకున్న సగంతాడు తెంచుకున్న బంధంలా వేళ్ళాడుతోంది వీరాయి ఆతాడుకొస అందుకోటానికి ప్రయత్నిస్తున్నాడు. కానీ దొరకలేదు. ఎద్దు అతన్ని చూడగానే బుసలుకొడుతూ, మీదకి వచ్చింది.

వీరాయి భయంతో వెనక్కి పరుగెత్తబోయి వెల్లకిలా పడ్డాడు. అదృష్టవశాత్తూ ఆఎద్దు అతనిమీదకి రాకుండా యింకోవైపుకి వెళ్ళిపోయింది.

ఇంతలో వెనకనుంచి ఎప్పుడువచ్చాడో కృష్ణ నావెనకగావచ్చి, దారికి అడ్డంగా నిలబడిన నన్ను 'వుండు. లే' అంటూ నా జబ్బపుచ్చుకుని ప్రక్కకులాగి దొడ్లోకి పరుగెత్తాడు.

"దీనికి మళ్ళీ యివాళ తిక్కరేగింది దొరా. కట్టుకొయ్యకి నిలవటంలేదు," అన్నాడు వీరాయి లేస్తూ.

# ఫోస్‌ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.



సహనశక్తిని

పెంచ్పించును.

శరీరముయొక్క రోగనిరోధక శక్తిని

ఎక్కువ చేయును.




అవును — కుటుంబము
అంతటికి ఫోస్‌ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్‌ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్‌ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం: దీని రిజిస్టర్డ్
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SQUIBB® TTT®

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel

కృష్ణ ఎద్దువైపుకి వెళ్ళాడు. "ఆ! ఆ!" గర్జిస్తున్నట్టుగా వారిస్తున్నట్టుగా పలికింది అతనికంఠం.

"దా! దా! క్ఛ్. క్ఛ్." పిలుస్తున్నట్టుగా, ఆజ్ఞాపిస్తున్నట్టుగా అంటూ ఎద్దుకి దగ్గరగా వెడుతున్న కృష్ణనిచూసి నేను భయంతో రాజేశ్వరిచెయి గట్టిగా పట్టుకున్నాను.

తనకెదురుగా, బాగా దగ్గరగావస్తున్న యజమానిని చూసి ఎద్దు కొమ్ము విసిరింది.

కృష్ణ ఒడుపుగా ఒకచేత్తో ఆకొమ్ముని గట్టిగా పట్టుకుని, ఎడంచేత్తో దాని వీపుమీద అదమాయిస్తున్నట్టుగా గట్టిగా రెండు మూడుసార్లు చరిచాడు.

అంతవరకూ బుసలుకొడుతూ, పోట్లగిత్తలా దొడ్డినపడి పరుగెత్తుతున్న ఎద్దు, కోపంతెచ్చుకున్న తల్లినిచూచి భయపడుతూ మారాంతగ్గించిన చిన్న పిల్లలా అయింది.

కృష్ణ తాడుతీసుకుని పాకవైపులాగాడు. రెండు మూడు అడుగులు మామూలుగానే వేసిన అది అంతలోనే తలముందుకుచాచి ఒక్కసారిగా కొమ్ములెత్తి కృష్ణని కుమ్మటానికి సిద్ధమైంది. కానీ కృష్ణ చటుక్కున మెరుపులా వెనక్కు దూరంగా వెళ్ళిపోయాడు. అతనిముఖం కోపంతో అసహనంతో కఠినంగా మారింది. పళ్ళు బిగబట్టినట్టు దవడ ఎముకలు పైకితేలి కన్పించాయి. పాకలోపలికివెళ్ళి చూరులో పెట్టిన చర్నాకోల్ తెచ్చి ఝళిపించి ఛెళ ఛెళని బలంఅంతా వుపయోగించి కొట్టసాగాడు.

ఆదెబ్బలు నాకేతగిలినట్టుగా భయపడ్డనేను చూడలేనట్లుగా కళ్ళు గట్టిగా మూసుకున్నాను. అబ్బ! నోరులేనిజంతువుని అంత నిర్దాక్షిణ్యంగా బాదటమా!

"యిలా తెంచుకోవటం యిది రెండోసారి" అంది నావెనకవచ్చి నిలబడిన అత్తయ్య.

నేను మెల్లిగా కళ్ళుతెరిచిచూసాను. చర్నాకోల్ ఓచేత్తోపట్టుకుని, కృష్ణ ఎద్దుతాడు పుచ్చుకుని లాక్కెళ్ళి కట్టుకొయ్యకి కట్టేసాడు.

అంతవరకూ ఆంబోతులా అందరినీ భయపెడుతూ గంతులుపెట్టినఎద్దు పిల్లిలా కృష్ణనిచూసి భయపడినదానిలా వెనక్కివెనక్కి బెదురుతూ వెళ్ళటం చూడగానే నాకు చెప్పలేనంత ఆశ్చర్యంవేసింది.

"పీరాయి! యీతాడు దీనికి పనికిరాదు. యినపగొలుసు తేవాలి" అంటూ కృష్ణ

# కొత్త

# సూపర్ సర్ఫ్

## అత్యంత అమిత తెల్లగా ఉతుకుతుంది




సూపర్ సర్ఫ్ అత్యధిక ఉతికే శక్తిని కలిగియున్నది! అది ఎక్కువగా మాసిన బట్టలనైనా అత్యంత తెల్లగా చేస్తుంది. తెలుపుచేసే పౌడర్‌ను చేర్చక్కర్లేదు. నేడే సూపర్ సర్ఫ్ కొనండి.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్టమైన ఉత్పత్తి

బైటకి వచ్చాడు. అతని నుదుట చెమటలు పట్టాయి. మనిషి కొద్దిగా ఆయాసపడటం కూడా కన్పించింది నాకు.

నేను సంభ్రమాశ్చర్యాలతో అలాగేనిలబడి అతనివైపు నిస్పంకోచంగా చూస్తున్నాను.

ఎంత మామూలుగా కన్పిస్తాడీ మనిషి! ఎంతసేపూ తనేదో తన పనేదో తప్ప యింకో గొడవేదీ పట్టించుకోనట్టుండే కృష్ణ యీరోజు నాకు వింతగా, కొత్తగా కన్పించాడు. అంటీముట్టనట్టుండే అతనిస్వభావం. దేనిమీదా ఆసక్తి లేనట్టు నిర్లిప్తంగావుండే అతని మనస్తత్వం గమనించిన నేను చాలాసార్లు అతన్ని జడుడుగాను, మందమతిగానూ భావించుకున్నాను.

కానీ — యీరోజు — సన్నగా, పొడుగ్గా, రివటలావుండే అతనిలో అజ్ఞాతంగా యింత అద్భుతమైన శక్తి దాగివుందని కళ్ళారాచూసిన యీక్షణంలో నిజంగా చకితురాలినే అయాను.

నోరు చెడ్డదని వూరంతా భయపడే మంగమ్మఅంటే అతనికి లక్ష్యంలేదు. పొగరుమోతు గొడ్డంటే బెదురుఏమాత్రం లేకపోగా, అలాటిదాన్ని వడుపుగా వశం చేసుకునే నేర్పు, సాహసం వున్నాయి.

సహజంగా మృదు మధురంగావుండే అతనిస్వరం అవసరంఅయితే ఎదుటివారిని నిశ్చేష్టులను చేసేటంత భీకరంగా గర్జించగలదు అని యింతక్రితం ఎద్దుని పిలవటంలోనే చూసాను. తమ్ముడిని, చెల్లెళ్ళని చూసినప్పుడు ప్రేమని, అనురాగాన్ని వర్షించే ఆకళ్ళు ఒక్కోసారి ఆగ్రహావేశాలువస్తే నిప్పులు కురిపించగలవు.

తనకి అయిష్టమైనదాన్ని ఖచ్చితంగా, స్పష్టంగా, నిర్మొహమాటంగా తిరస్కరించగల మొండితనంకూడా వుంది అతనిలో.

క్షణంక్రితం మంగమ్మని మందలిస్తున్నప్పుడు అతనిపట్ల నాకు ఏర్పడిన గౌరవం యీక్షణంలో రెట్టింపు అయినట్టుగా అన్పించింది.

దాదాపు గంటతర్వాత, అంతక్రూరంగా బాదిన ఆ ఎద్దుకి అతను స్వయంగా తనచేత్తో తవుడు, వులవలూకలిపిన దాణా ఆప్యాయంగా తినిపించటం చూసిన నేను మరీ తెల్లబోయాను. అతని స్వభావం నాకు చిత్రంగా కన్పించింది. వుదయం లేగదూడని పట్టుకోవటంలో అతను చూపించిన ఆప్యాయత, యింతక్రితం తాడు తెంచుకుని, దొడ్డినబడి మొక్కలు నాశనం చేసిందని కొత్త ఎద్దుని నిర్దాక్షిణ్యంగా అతను శిక్షించినతీరు, మళ్ళీ యిప్పుడు పసిపాపకి కన్నతల్లి వెన్ను నిమురుతూ

అన్నం తినిపించినట్టుగా దానికి ఆహారం పెట్టేతీరుకి నేను ముగ్ధురాలివి ఆయాను. వింత చెందానుకూడా.

యీ యింట్లో పిల్లలందరూ యింత క్రమశిక్షణగా ప్రవర్తించటానికి అసలు కారణం ఏమిటో హఠాత్తుగా నా కిప్పుడు అర్థమైంది. పిల్లల్లో ఎవరూ అన్నగారిలో అజ్ఞాతంగావున్న యీ వుగ్ర నరసింహమూర్తిని చూడటానికి యిష్టపడరేమో!

పిల్లలేకాదు. చివరికి మంగమ్మకూడా అంతే. వూరందరినీ భయపెట్టే మంగమ్మ కృష్ణుడి మనసు నొప్పించానేమోననే భయంతోనే వెళ్ళేటప్పుడు 'పెద్దదాన్ని. ఏమీఅనుకోవద్దను' అంటూ సగం క్షమార్పణ కోరుకుని వెళ్ళింది.

ఎంతమామూలువ్యక్తి అతను! కానీ ఎంత అసాధారణమైన వ్యక్తిత్వం! మరుగునపడ్డ మాణిక్యం అంటే ఏమిటో నాకిప్పుడు తెలిసివచ్చింది.

*　　　*　　　*

మర్నాడు కాకుండా, ఆ మూడో రోజు.

ఆ రోజు వుదయం లేవగానే రాజేశ్వరి మామూలుగా యింట్లో తిరగలేదు. నాకు కాఫీ అత్తయ్య తెచ్చి యిచ్చింది.

"రాజు ఏమైందత్తయ్యా" అన్నాను లేచి ఎదురెళ్ళి కాఫీ గ్లాసు తీసుకుంటూ.

"దొడ్లో వుంది." అనేసి అత్తయ్య వెళ్ళిపోయింది.

నేను కాఫీ తాగుతూనే వంటయింటివైపు వచ్చాను. అక్కడ అత్తయ్య ఒక్కత్తె పనితో సతమతమౌతోంది. అత్తయ్యకు సాయం చేయకుండా రాజేశ్వరి పొద్దుటే పనివేళ దొడ్లో అరుగుమీద జేబు రుమాలుమీద ఎంబ్రాయిడరీ చేసుకుంటూ తీరికగా కూర్చోవటం చూసేసరికి నాకు ఆశ్చర్యం వేసింది.

"ఇదేమిటి! అమ్మాయిగారు, ఈ రోజు యింత తీరికగా యిక్కడ కూర్చున్నారు. ఎవరిమీదనైనా అలుక వహించారా?" అంటూ కాఫీ తాగుతూనే వెళ్ళి రాజేశ్వరి ప్రక్కగా కూర్చోబోయాను.

రాజేశ్వరి దూరంగా జరిగి ఖంగారుగా, "ఆ! ఆ! దూరం" అంది. నేను నిలబడినచోటే అలాగ ఆగిపోయి ప్రశ్నార్థకంగా చూసా.

"నేను మూడు రోజుల సత్యాగ్రహంలోకి దిగా నివాళ," అంది నవ్వుతూ.

నా కర్థమైంది.

కాని రాజేశ్వరి అలా అంటుకోటానికి వీల్లేకుండా దూరంగా ఎందుకుండాలో మాత్రం అర్థంకాలేదు. ఇందులో తాకరానిది ఏముంది? ప్రకృతి సిద్ధంగా, స్త్రీకి ఎంతో సహజమైన యీ ఋతు కార్యక్రమం యిలా ఎడంగా కూర్చుని ఫలానా అంటూ నలు

గురికి చాటిచెప్పటం ఏం బాగుంది? ఛీ-ఛీ-అసహ్యం కదూ! నాకయితే సిగ్గుకూడా వేసింది. పల్లెటూళ్ళలో, సనాతన కుటుంబాల్లో యీ ఆచారం వుంటుందని వినటమే తప్ప నేనింతవరకూ చూడలేదు. ఈ రోజు స్వయంగా చూసాను. ఎందుకోగాని నాకీ ఆచారం నచ్చలేదు. ఈ రోజుల్లో పల్లెటూళ్లు మాత్రం సామాన్యంగా వున్నాయా? పట్నవాసాలకి అవి ఎందులో తీసిపోతున్నాయి? విద్యుద్దీపాలు వాడుతున్నారు. రేడియోలు పెట్టుకుంటున్నారు. సినిమాలు చూస్తున్నారు. వ్యవసాయ పద్ధతుల్లో కొత్త కొత్త పద్ధతులు నేర్చుకుంటున్నారు. మగాళ్ళు, ఆడవాళ్ల క్లబ్‌లు అవీ పెట్టుకుంటున్నారు. ఏ విషయంలో వీళ్ళు వెనకపడి వున్నారు నిజానికి? అలాటిది ఎంత ముఖ్యమైన యిలాటి చిన్న విషయంలో ఎందుకు మారరు? ఇన్ని విధాల కొత్త అలవాట్లకి లోనయిన వీళ్లు యీ పాత విషయానికి స్వస్తి ఎందుకు చెప్పలేదో నా కర్థం గాలేదు. అయినా మన దేశంలో మనుష్యులు కొత్త విచిత్రమైన వాళ్ళనే చెప్పచ్చు. కొత్త విధాలకి ఓ పట్టాన ఎవరూ అలవాటు పడటానికి

ముందుకు రారు. నూటికీ, కోటికీ ఏ ఒక్కరో కాస్త తెగువ చూపి, ధైర్యం వహించి ముందుకువస్తే, వాళ్ళని వేలుపెట్టి చూపించి, వెక్కిరించి, నోటినిండా తూర్పారపట్టి, యీ పెల్లాంటి మాటలతో విమర్శించి, చంపి చివరికి ఓ శుభ ముహూర్తాన పీళ్లా ఆ పనిచేయటం ప్రారంభిస్తారు. ఈ కుసంస్కారం, తెలివి హీనతతోకూడిన అమాయకత్వం నేను మా పట్నవాసంలోకూడా గమనించాను.

రాజేశ్వరి కడుపునొప్పితో బాధపడటం గమనించిన నేను అత్తయ్య దగ్గిరికి వెళ్ళి "రాజుకి మందేమి యిప్పించలేదా అత్తయ్యా'' అని అడిగాను.

"మందేమీ లేదుటమ్మా. పెళ్ళయితేగాని పోదుట" అంది అత్తయ్య. ఆ మూడు రోజులూ రాజేశ్వరి భోజనంకూడా సరిగ్గా చేయదు. ముఖం అంతా వాడి పోయి, మనిషి నీరసంగా, బద్ధకంగా ఎలాగో వుంటుందిట.

మధ్యాహ్నం అయింది. మా అందరి భోజనాలు అయినాయి. కృష్ణకోసం చూసి, చూసి అత్తయ్యకూడా తినేసింది. కృష్ణ యింకా రాలేదు. వీరాయి పనిమీద పొరుగూరు వెళ్ళాడు. రాజేశ్వరి యింట్లోకి రావటానికి వీల్లేదు. మధూ వాళ్ళంతా స్కూలుకు వెళ్ళిపోయారు. 2 గంటలు అవస్తోంది. కృష్ణ జాడేలేదు. అత్తయ్య యింట్లోకి బైటికి కాలుగాలిన పిల్లిలా తిరుగుతోంది.

"ఏం చెయ్యనే రాజూ! మన కావయ్యగారి గోపాలంకూడా లేడు. ఎక్కడికో వెళ్ళాట్ట. యిప్పుడొస్తాడో రాడో చెప్పివెళ్ళలేదు అన్నది సీతం పిన్ని. అయినా వీడికి మరీ బొత్తిగా యింత జ్ఞానం లేకుండా పోతోందే! నువ్వు యింట్లోకి రావటానికి వీల్లేదని తెలుసుకదా. వేళపట్టున వచ్చి నాలుగు మెతుకులు తినిపోకూడదూ! ఏం మనిషి. ఆ పనిలో పడ్డాడంటే యికా ఒళ్ళే తెలియదు." అత్తయ్య సగం బాధగా సగం విసుగ్గా అంది. ఆవిడ బాధ చూస్తూంటే నా కెలాగో అన్పించింది. కృష్ణ ఆవిడకి సవతికొడుకు అంటే ఎవరూ నమ్మనే నమ్మరు. నేను వచ్చినప్పటి నుంచి గమనిస్తూనే వున్నాను. ఆవిడకి నా పిల్లలు అనే పక్షపాతం లేకపోగా, గట్టిగా పరిశీలిస్తే రవంత కృష్ణమీదనే అభిమానం జాస్తీ ఏమో అన్పిస్తుంది. రాజేశ్వరి మాటలద్వారా నేను తెలుసుకున్నది ఏమంటే ఆవిడ పెళ్ళయి వచ్చేసరికి కృష్ణ చాలా పసివాడు. కాపురానికి వచ్చిన నాలుగైదు సంవత్సరాలకి కాని రాజేశ్వరి పుట్టలేదు. అందుకని కనకపోయినా ఆవిడకి కృష్ణ ప్రథమ సంతానం క్రిందే లెక్క. అందుకే అన్నారేమో, కన్నప్రేమకంటే పెంచిన ప్రేమ గొప్పదని. ఆ మాటకొస్తే అసలు పెంచబట్టే కన్నవాళ్ళకికూడా ఆ అనురాగం కలుగుతుందేమో!

కృష్ణ రానేలేదు. ఆలస్యం అయినకొద్దీ అత్తయ్య మనసు విలవిలలాడిపోతోంది.

చివరికి విరాళతో వుస్సురంటున్నట్టుగా, విరక్తిగా, "ఈ పూట పీడికి భోజనం ప్రాప్తిలేనట్టేవుంది. ఛి. ఛి-ఏం మనిషి. అమ్మ ఎదురుచూస్తుందనే తెలివైనా లేదేం? అయ్యోరామా! యివాళ కొబ్బరి పెసరపచ్చడికూడా చేసాను." అంది.

ఆవిడ బాధ నాకు చూడలేనిదిగానే తోచింది ఆ క్షణంలో.

రాజేశ్వరితో చింతగింజలు ఆడటం నేర్చుకుంటున్న నేను, అవి వదిలేసి, లేచి నిలబడుతూ, "అత్తయ్యా! క్యారియర్ సర్దు. నేను వెళ్ళి యిచ్చి వస్తాను" అన్నాను.

"నువ్వా!" అంది అత్తయ్య.

"ఏం? వెళ్ళకూడదా నేను? నేను తీసుకువెడితే తినడా మీ అబ్బాయి?"

"అయ్యో. అదేం మాటమ్మా. తినడవి కాదు. కాని, నువ్వెందుకులే వద్దు. వస్తే వాడే వస్తాడు, లేకపోతే పోన్లే." అయిష్టంగా అంది అత్తయ్య.

"ఫర్వాలేదులే అత్తయ్యా. యింట్లో కూర్చుని, కూర్చుని నాకు బోర్‌గా వుంది. ఏం తోచడంలేదు. అలా సరదాగా వెళ్ళివస్తాను. కాస్త నడిచినట్టుగా వుంటుంది."

అత్తయ్య అయిష్టంగానే క్యారియర్ సర్దింది.

"దోవ గుర్తుందా నీకు?" అంది అనుమానంగా చూస్తూ.

"ఖలేదాని వత్తయ్యా! రాజేశ్వరితో మొన్న వెళ్ళలేదూ నేను? దోవ గుర్తు లేకపోవటానికి యిదేమైనా మహాపట్నమా? మహా నగరంలో మెలికలుగల దోవనే ఒకసారిచూస్తే నేను మర్చిపోను. అలాటిది దొంక వెంబడి సరాసరి సూటిగా వెళ్ళే యీ దోవ నాకు గుర్తుండదా?"

"వాడేమంటాడో ఏమో!" జంకుగా అంది అత్తయ్య.

"ఏమీ అనడు. పస్తు పడుకోకుండా అన్నం తీసుకెళ్ళినందుకు నాకు కృతజ్ఞతలు చెబుతాడు. చెప్పకపోయినా ఫర్వాలేదు. నేను లెఖ్ఖచేయను."

"రాజూ! పోనీ నువ్వుకూడా వెళ్తావుటే వదినతో?"

"వూరుకో అత్తయ్యా. పొద్దుటనుంచీ అదలా కూర్చునే శక్తిలేక బాధపడు తుంటేను. నాకేం ఫర్వాలేదులే. నన్నెవరూ ఎత్తుకుపోరులే. భయపడకు" అంటూ అత్తయ్య చేతిలో క్యారియర్ తీసుకున్నాను.

"జాగ్రత్త వదినా! నీ కాళ్ళకి చెప్పులుకూడా లేవు. ముళ్ళవీ వుంటాయి. గుచ్చుకుంటాయేమో. చూసుకుని నడిచివెళ్ళు—"

రాజేశ్వరి నన్ను హెచ్చరించింది. రాజేశ్వరి మాటలు లక్ష్యపెట్టకుండా నేను నీళ్ళలో, బురదలో అవి వేసుకుని తిరిగేసరికి నా జలతారు చెప్పులు, అలిసిపోయి వాడిపోయినట్టు పుటుక్కున తెగిపూరుకున్నాయి. నిన్నటినుంచీ నేను కాలికి చెప్పులు లేకుండానే నడుస్తున్నాను. అవి కుట్టి బాగుచేయటానికి అత్తయ్య గూడెంలో ఎవరికో కబురుచేసింది. కానీ ఆ మనిషి రానేలేదు.

క్యారియర్ తీసుకుని బైలుదేరాను.

ఆ సత్తుక్యారియర్ పట్టుకుని, కాళ్ళకి చెప్పులు లేకుండా దొంక వెంబడి నడు స్తుంటే నాకు విచిత్రంగా, గమ్మత్తుగా అనిపించింది. ఎక్కడుందో మా అమ్మ! ఒక్కసారయినా నన్నుగురించి జ్ఞాపకం చేసుకుంటోందో లేదో! నేనిలా వున్నా నని కలలోకూడా వూహించలేదని గ్యారంటీగా నాకు తెలుసు. మా అమ్మ వూహా కందని పని నేను చేస్తున్నాననే జ్ఞాపకం నాకు గర్వంగా, చక్కిలిగింతలు పెట్టి నట్టుగావుంది. పైరుగాలి పీల్చుకుంటూ, ఆకాశంలో తేలిపోతున్న తెలిమబ్బులని తలఎత్తి మధ్యమధ్యలో పరీక్షగా చూసుకుంటూ, ఎంతో అందంగావున్న పరిసరా లని కనులవిందుగా గమనిస్తూ, సాధ్యమైనంత తాత్సారం చేసుకుంటూ నడవసాగాను. పొనుమరి. అత్తయ్య బాధపడుతుంటే చూడలేక తెచ్చానుగాని, కృష్ణ ఆకలితో వుంటే నాకేం!

నేను వెళ్ళేసరికి కృష్ణ అరటిచెట్లకి బోదెలు చేస్తున్నాడు. అతనితోపాటు పని

చేసే మిగతావాళ్ళు ఎవరూలేరు. వాళ్ళు భోజనాలకి వెళ్ళారేమో ; పాకముందు కూరగాయలు నింపిన గంపలు వరుసగా పెట్టివున్నాయి.

"ఇదిగో, అన్నం తెచ్చా." బిగ్గరగా అన్న సేను క్యారియర్‌ని గట్టుమీద గట్టిగా పెట్టా.

పులిక్కిపడ్డట్టుగా కృష్ణ చటుక్కున తిరిగిచూసాడు.

అతని కళ్ళలో ఆశ్చర్యంలాటిది కన్పించింది.

"నువ్వెందుకు వచ్చావ్ ?" అన్నాడు.

"చిత్తం. తమరు ఆ ప్రశ్న వేస్తారని నాకు ముందే తెలుసు. మీ కోసం తేలేదు. అత్తయ్య తన సుపుత్రుడు అన్నం తినలేదని బాధపడుతుంటే చూడలేక తీసుకుని వచ్చా."

కృష్ణ క్షణంసేపు రెప్పవాల్చకుండా నా వైపుచూశాడు. తర్వాత చేతిలో పార క్రిందపెడుతూ, సీరియస్‌గా "చాలా శ్రమపడ్డావు. మా అమ్మకోసం యింత కష్ట పడ్డ మనిషిని నేనింతవరకూ చూడలేదు. మంచిది. అక్కడ పెట్టివెళ్ళు" అన్నాడు.

నాకు ఒళ్ళుమండింది. పూరికేకాదు, కిరసనాయిలువేసి నిప్పుపుల్ల గీసిపడేసినట్టు భగ్గుమంది.

"నేను నీకు అన్నం తీసుకువచ్చాను కానీ, నీ ఆజ్ఞలు శిరసావహించటానికి రాలేదు. వెళ్లాలనుకున్నప్పుడు నేను వెళ్ళగలను. నువ్వు నాకు చెప్పనవసరం లేదు" అంటూ గట్టుమీద కూర్చున్నాను.

కృష్ణ నా మాటలకి పెదవులమీద కదలబోయిన చిరునవ్వుని అణుచుకోవటం, ముఖం తిప్పుకోవటం నేను గమనించకపోలేదు. ఏమనుకున్నాడో ఏమో! మారు మాట్లాడకుండా కాళ్ళూ, చేతులూ కడుక్కుని, అరటి ఆకుకోసి, కడుక్కుని తెచ్చుకుని, వచ్చి, కూర్చుని క్యారియర్‌ని విప్పాడు.

నేను అతనివైపు చూడలేదు. నా దృష్టిఅంతా తోట అందం పరిశీలించటంలో పూర్తిగా నిమగ్నమైనట్టు కూర్చున్నాను.

అతనూ నా వైపుచూడలేదు. అన్నం తినటమే ఆ క్షణంలో అతని జీవితాదర్శం అన్నట్టుగా ఆకులో శ్రద్ధగా వడ్డించుకోసాగాడు.

అతను అన్నం కలుపుకుంటుండగా అన్నాను, "నువ్వింత మానర్‌లెస్ బ్రూట్‌వని నేను కల్లోకూడా అనుకోలేను."

అన్నం నోట్లో పెట్టుకోబోతున్న కృష్ణ ఆగిపోయి తలెత్తి కళ్ళు పెద్దవిచేసి, కనుబొమలెత్తి ఆశ్చర్యంగా చూశాడు. కాలుమీద కాలువేసుకుని, మోకాలిచుట్టూ రెండుచేతులూ పెనవేసుకుని ముందుకి, వెనక్కి కొంచం వూగుతూ కూర్చున్న నేను ఎదురుగా వున్న పాకమీద అందంగా విచ్చుకునివున్న బీరపూలని వుద్దేశించి అన్నట్టుగా, వాటివైపు తదేకంగా చూస్తూ అన్నాను. "లేకపోతే ఏమిటి? యింత ఎండలో, కాళ్ళు పీక్కుపోయేలా నడుస్తూ, చెయి తిమ్మిరెక్కేలా ఆ క్యారియర్ మోసుకుని వచ్చాను. కనీసం నువ్వు థ్యాంక్స్ అయినా చెప్పలేదు నాకు."

కృష్ణ చట్టూ చూశాడు. ఓసారి తలెత్తి మబ్బుపట్టి ఆహ్లాదంగావున్న ఆకాశం వైపు చూశాడు. "యింత ఎండా! యింటినుంచి యిక్కడికి అదో దూరమా! యీ క్యారియర్ మోయటానికి నీ చేతులు నొప్పి పుట్టాయా?" ఆశ్చర్యపడుతున్నట్టుగా అడిగాడు.

"అంటే నీ వుద్దేశ్యం?" నేనతనివైపు సూటిగా తిరిగాను.

కృష్ణ మళ్ళీ క్షణంలో సగంసేపు నావైపు సూటిగా చూశాడు.

తర్వాత కొద్దిగా భుజాలెగరేసి, "ఐయామ్ సారీ. నేను యీ పల్లెటూరు వచ్చి

స్థిరపడిపోయినతర్వాత బస్తీ మర్యాదలు పూర్తిగా మర్చిపోయాను. ఐయామ్ రియల్లీ వెరీవెరీ సారీ. థాంక్‌యూ!" అన్నాడు.

నా కతని కళ్ళలో కొంటెదనం కన్పించింది. కంఠంలో వెక్కిరింపుకూడా వుంది. గంటుపెట్టుకున్న ముఖంతో అన్నాను.

"నువ్వా థ్యాంక్స్ చెప్పేకన్నా అసలు చెప్పకపోవడమే బాగుంది."

"అదేమిటి?"

"థ్యాంక్స్ చెప్పమంటే వెక్కిరించమనికాదు."

"నేను వెక్కిరించానా? నిన్ను!"

ఈసారి నవ్వు అతని కళ్ళలోనేకాదు, పెదవులమీదకూడా దొంగతనంగా తొంగిచూస్తోంది.

అతని ముఖం చూసేసరికి నాకూ కూడా నవ్వు రాబోయింది: కానీ మొహం

తిప్పేసుకుంటూ, "కాదామరి. అలాగేనా చెప్పేది? ఒకమాట చెప్పటంలో, నావి పలికే తీరునిబట్టి ఎలాటి అర్థం తెప్పించవచ్చో తెలియదా నీకు!" అన్నాను.

"చచ్చాంపో," కృష్ణ నిస్సహాయంగా అని అన్నంతినడం ప్రారంభించాడు.

నేను మళ్ళీ చుట్టూ చూడసాగాను.

కృష్ణ ఎప్పటిలాగానే చకచకా తినేశాడు.

భోజనం చివరిలో పెరుగు వేసుకుంటూ హఠాత్తుగా, "తమరి మకాం యింకా యెన్నాళ్ళిక్కడ?" అన్నాడు.

ఈసారి ఉలిక్కిపడటం నావంతు అయింది.

"ఏమిటీ?" అంటూ అతనివైపు తిరిగాను.

"యింకా యెన్నాళ్లు వుండదల్చుకున్నారిక్కడ అని అడుగుతున్నాను." అతని ముఖం యీసారి చాలా సీరియస్‌గా వుంది.

నా ముఖంలో వెచ్చటిరక్తం ఒక్కసారిగా పొంగి వచ్చింది.

కోపంలాటిదో, రోషంలాటిదో ఏవో తీవ్రంగా కలిగింది. అయినా నిగ్రహించుకుంటూ, "నీకు మరీ అంత బాధగావుంటే యీ సాయంత్రమే వెళ్ళిపోతాను," అన్నాను.

"బంగారుతల్లివి. ఆపని చేశావంటే ఈసారి మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు అర్పించుకుంటాను. జరీఅంచు తెల్లచీర కానుకగా యిచ్చి, రాజారాణివి అవమని ఆశీర్వదిస్తానుకూడా."

నేను అతని ముఖంలోకి పరీక్షగా చూశాను. ఇతను నన్ను వెళ్ళిపొమ్మని సూటిగా చెబుతున్నాడు. ఇది పరిహాసమా? లేక నిజమేనా! కానీ కృష్ణ ఉప్పు కోసం క్యారియర్‌లో వెతుకుతున్నట్టు శ్రద్ధగా క్రిందకి చూస్తూండటంవల్ల అతని ముఖంలో ఏ భావముందో నాకర్థంగాలేదు. కానీ నా చూపుల్తో తన చూపులు కలవకుండా జాగ్రత్త పడ్డాడనిమాత్రం స్పష్టంగా తెలిసింది.

నేను అతనివేపు చూస్తూ చాలా నిష్ఠూరంగా అన్నాను.

"నేను వచ్చినప్పటినుంచీ చూస్తూనేవున్నాను. ఎందుకో నాకు తెలియదు, కానీ నువ్వుమాత్రం నన్ను చూసినప్పటినుంచీ ముళ్ళమీద వున్నట్టుగా మహాబాధపడుతున్నావు. నా రాకవల్ల నీకేం నష్టం కలిగిందో కాస్త వివరిస్తే చాలా సంతోషించి, యీ సాయంత్రమే బండి ఎక్కుతాను నేను."

"నష్టం నాకేంలేదు. నష్టంగాని, బాధగాని ఏదయినా కలిగితే అది నీకే కలగాలి."

"నాకా?!"

"ఔను."

"అంటే నీ వుద్దేశ్యం?" పూర్తిగా అతనివైపు తిరిగి నిందిస్తున్నట్టుగా దూకుడు.. అడిగాను.

"నువ్విక్కడికి వచ్చినట్టు ఏ పరిస్థితుల్లోనూ మీ.అమ్మకి తెలియటం. నీకూ, మాకూ ఎవరికీ అంత క్షేమంకాదని నా వుద్దేశ్యం."

"ఏమిటీ!" నివ్వెరబోయాను నేను.

"మీ అమ్మ డార్జిలింగ్ వెళ్ళటంవల్ల, సారధిని తప్పించుకోటానికి యిక్కడికి పారిపోయి వచ్చావని నాకు తెలుసు. సారధి నువ్వు వూహించినట్టుగా హైదరాబాద్ రావటంలేదు. అతని ప్రయాణం కాన్సిల్ అయింది. నువ్వు సాధ్యమైనంత తొందరలో యిక్కడినుంచి వెళ్ళిపొమ్మని నా సలహా. హెచ్చరికకూడా."

విరుత్తరురాలిని అయాను నేను!

నిశ్చేష్టురాలినికూడా అయాను!!

నోట మాట రాకుండా, రెప్పవాల్చటం మర్చిపోయి అతనివైపు వింతమృగాన్ని చూసినట్టు చూడసాగాను.

ఏమిటి యితను మాట్లాడేది?

ఎలా మాట్లాడుతున్నాడో!

ఇంతకంటే మహా అవమానం యింకేదైనా వుందా.

అసలి దంతా యితని కెలా తెలుసు?

తెలిస్తే తెలిసింది. తెలిసినంతమాత్రాన జంకూ గొంకూలేకుండా ముఖాన అనేసేయటమేనా?

లావాలా కుతకుతలాడుతూ, భళ్ళున బద్దలవబోతున్న అగ్నిపర్వతంలా అయిన నేను కర్కశంగా అడిగాను.

"మా అమ్మకి తెలియకుండా వచ్చానని నువ్వెలా అనుకున్నావ్?"

సారధి వస్తున్నందువల్లే నే నిలాపారిపోయి వచ్చానని ఎవరు చెప్పారు నీకు?"

భోజనం ముగించి క్యారియర్ సర్దిపెట్టేస్తున్న కృష్ణ క్షణంసేపు చేస్తున్నపని ఆపేసి తలెత్తి నావైపు చూశాడు.

అతనికళ్లు నా కళ్ళలోకి లోతుగా, సూటిగా చూసినాయి.

సమాధానం వెంటనే ఏదో అనబోయి నిగ్రహించుకున్నవాడిలా ఆగిపోయాడు. తర్వాత, కొద్దిగా ఆగి మృదుస్వరంతో అన్నాడు. "నువ్వు అబద్ధం చెప్పదల్చుకుంటే నా కేమీ అభ్యంతరంలేదు. కానీ మనల్ని గురించి అన్ని విషయాలు

క్షుణ్ణంగా తెలిసిన వాళ్ళదగ్గర అబద్ధాలు చెప్పటం, దబాయించా లనుకోవటం కేవలం హాస్యాస్పదమే అవుతుంది." చేష్టలుడిగిన నేను, సమాధానం చెప్పలేని అశక్తురాలిలా చూడసాగాను.

అతని స్వరం మళ్ళీ నిర్వికారంగా, నిశ్చలంగా పలికింది.

"మా గురించి నీ కేం తెలియదని నాకుతెలుసు. కాని నీ గురించి నాకు అన్నీ తెలుసుననే సంగతి నీకు తెలియదని నా కిప్పుడే తెలుస్తోంది. ఎలాతెలుసు నీకు అని నన్నడక్కు. నా కన్నీ తెలుసు. నీ వయసుపెరిగినకొద్దీ మీ అమ్మమధ్యా, నీ మధ్యా పెరిగి పెద్దదవుతున్న అఘాతం నే నెరగనిదికాదు. మీ యిద్దరిమధ్యా ఒక్కోసారి ఎటూచెప్పలేక మామయ్య నలిగిపోయిన సంఘటనలుకూడా నాకుతెలుసు."

అతని నోటినుంచి వెలువడుతున్న ఒక్కొక్క వాక్యం వింటున్నకొద్దీ నేను నిటారుగా కూర్చుని, పాలిపోయిన ముఖంతో నా జీవితంలో అతిముఖ్యమైన రహస్యాల్ని తెలుసుకుని, నన్ను బ్లాక్‌మెయిల్ చేస్తున్న మనిషివైపు చూస్తున్నట్టుగా, చూడటం ప్రారంభించాను. ఎంతో మామూలువాడు, ఎలాటి ప్రత్యేకతాలేని, అతి సాధారణమైన మనిషి అని నేను తీసిపారేసినట్టు నిశ్చయించుకున్న మనిషేనా యీ కృష్ణ! అన్పించింది.

---


## FORM IV

**(See Rule 8)**

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | | 5-9-88, Public Garden Road, Hyderabad-1 |
| 2 | Periodicity of its publication | : | MONTHLY |
| 3 | Printer's Name | | Sri A. SUDHAKARA RAO for Yuva Press |
| | Nationality | : | INDIAN |
| | Address | | Yuva Press, 5-9-88 Public Garden Road, Hyderabad-1. |
| 4. | Publisher's Name | | Sri A SUDHAKARA RAO for Ms. Yuva Publications |
| | Nationality | : | INDIAN |
| | Address | | 5-9-88 Public Garden Road, Hyd-1 |
| 5. | Editor's Name | | Sri CHAKRAPANI (Alias) Sri A V. SUBBA RAO |
| | Nationality | : | INDIAN |
| | Address | | 2 & 3 Arcot Road, Madras-26 |
| 6. | *OWNERS* : | | M/s. Yuva Publications, 5-10-194, Saifabad, Hyderabad-4 |

| *Partners* : | *Addresses* : |
|---|---|
| Sri A. V. Subba Rao (Chakrapani) | 2 & 3 Arcot Road, Madras—26. |
| Smt. A. Jayalakshmi. | |
| Sri A. Chandrasekhara Rao-Minor | |
| Sri A. Rajasekhara Rao-Minor | |
| Sri A. Sudhakara Rao | 5-9-88, Public Garden Road, Hyderabad—1. |

I, A. Sudhakara Rao, hereby declare that the particulars given above ar true to the best of my knowledge and belief.

Hyderabad.
Date 1—3—1969.

*A. SUDHAKARA RAO*
Signature of Publisher

అతను మాట్లాడుతున్న వాడల్లా నా ముఖంచూసి హఠాత్తుగా ఆగిపోయాడు. అతనిచెయి నా చెయపట్టుకోబోయినట్టు అప్రయత్నంగా ముందుకువచ్చి, అంత లోనే మళ్ళీ నిగ్రహించుకున్నట్టుగా వెనక్కి వెళ్ళిపోయింది.

రవంత బాధని స్ఫురించేస్వరంతో క్షమార్పణ. కోరుకుంటున్నట్టుగా అన్నాడు.

"సారీ మీనా! నే నివన్నీ నీతోచెప్పాలని అనుకోనేలేదు. నువ్విక్కడ ఎక్కువ రోజులుండటం. మాదగ్గరకి వచ్చావని మీ అమ్మకి తెలియటం అంతమంచిది కాదనే వుద్దేశ్యంతో నిన్ను హెచ్చరించా లనుకున్నానేతప్ప–"

నేను చటుక్కున లేచి నిలబడ్డాను.

నా గురించిన విషయాలు అన్నీ అతనికి తెలుసునన్న సత్యం నన్ను పిచ్చిదాన్ని చేసింది. వెర్రెక్కించింది.

ఏమనాలో తోచని నేను నోటికివచ్చింది అనేశాను.

"నువ్వు – నువ్వు యిలాటి మనిషివని కల్లోకూడా అనుకోలేదు నేను. నే నెంతో అపరూపంగా భావించుకుంటున్న యీ ప్రయాణంలో అపశ్రుతిలా అయావు."

"మీనా!"

"నా కిప్పుడు తెలిసింది. నువ్వు రావాలనే అన్నానికి యింటికి రాలేదు. రాజేశ్వరి యింట్లోకి రావటానికి వీల్లేదు. అత్తయ్య యిల్లువదిలి బైటకిరాదు మా యింట్లో వాళ్ళెవ్వరూ లేరు. నేను తప్పకుండా అన్నం తీసుకుని వస్తానని నీకుతెలుసు. నాకీ మాటలు చెప్పటానికీ, యీ అవకాశం నీకు చిక్కించుకోటానికీ యింటికి రాకుండా యిక్కడ కూర్చున్నావు. నువ్వు చాలా తెలివికలవాడివి. తెలివికలవాళ్ళ యోచన ఎప్పుడూ గురితప్పదు. చూడు. నువ్వు వూహించినట్టుగానే వెర్రిమొహంలా నేను రానేవచ్చాను."

"మీనా!" వారిస్తున్నట్టుగా పిలిచాడు.

నే నతని వారింపు అస్సలు లక్ష్యపెట్టలేదు.

మండిపడుతున్నట్టుగా అన్నాను.

"అస లిదంతా ఎందుకు? ఒక్కమాటలో సూటిగా చెప్పేస్తే సరిపోలా? అమ్మాయీ! మీ యింటికి మమ్మ ల్నెవరినీ రానివ్వలేదు. మా యింటికి సిగ్గు లేకుండా ఏ మొహం పెట్టుకుని వచ్చావని ఒక్కమాట నా మొహం పట్టుకుని అడిగితే పోయేదిగా. పైగా యివన్నీ నాకు చెప్పదల్చుకోనేలేదుట. ఏం నటన! పాపం. ఎంత పెద్దమనిషివి. అబద్ధాలు ఆడేది ఎవరు? నువ్వా? నేనా?" (సశేషం)

Printed and published by A. Sudhakara Rao for Yuva Publications, Hyderabad-4
and printed at Yuva Press, Public Garden Road - Hyderabad - 1. Phone 36336
Controlling Editor: Sri "CHAKRAPANI"

